# నాలుగు మాటలు

ఇంద్ర ధనుస్సులాంటి జీవితంలో ఎన్నెన్ని రంగులు! ఎన్నెన్ని భంగులు! చెప్పలేం! అయినా చెప్పకుండా వుండనూ లేము.

ఈ నవలలో ఆ జీవితంలోని సొంపులు సోయగాలు, వంపులు వక్రతలు, ముడులు సుడులు సుమనోహరంగా వివృతాలయినవి.

కన్నె మనసు వన్నె చిన్నెలిందులో ఎంతో విన్నాణంగా సున్నితమైన రేఖలతో చిత్రితా లయినవి.

ఒకేయింట కలిసిమెలిసి ఉన్నా ఎవరిలోకం, ఎలా, ఎవరిదిగా విడిగి విప్పారుతుందో చదువుతున్నప్పుడు మనం చమత్కృతులం కాకుండా ఉండలేము.

మా మిత్రులు శ్రీ శేషయ్యగారు నవలా రచనలో సిద్ధహస్తులు. ఒకానొక నిర్దిష్ట దృక్పథం, ఒకానొక సునిశిత మనఃపరిశీలనం, ఒకానొక వాస్తవ వ్యక్తీకరణ పాటవం వారి కలంలో పొంగులువారుతుండడం వారి ప్రతి రచనలోను కానవస్తుంది.

భాష భాషకోసం కాక, కేవల భావ వాహికగా మలుచుకున్నారు గనుక, చెప్పదలచుకున్నదేదో సూటిగా, ఘాటుగాకూడా వారు చెప్పగలరు.

ఇందలి సుందరాంగుల మనసు లెన్నెన్ని తరహాలవో! ఒక్కటే అచ్చునగుద్దినట్టు కాన్పించవు. ఒక్కటీ రచయిత కోసమని అనవసరంగా వంగి వక్రాలు కావు. అవలా, ఆ పరిధిలో, ఆ పరిస్థితులలో అలా అలా తీవ

సాగుతూ పోతుంటే మనకేదీ అసహజంగా కాని, అమితంగా కాని తోచదు. అదే వాస్తవిక చిత్రణంలో గీటురాయి అనుకుంటాను.

ఔను, నేటికీ ఈ స్త్రీల జీవితం, అందులో ఇలాంటి కాస్త నాగరక వాసన గల ఇళ్ళలోని ఇంతుల బ్రదుకు ఇలాగే ఒకసారి పడగవిప్పి బుసకొట్టుతుంటుంది; మరొకసారి మంజుల కుహూ కుహూ స్వరాలు వినిపిస్తుంటుంది; ఇంకొకమారు ఇప్పటి కిలా తెల్లవారిందని వెల వెల పోతుంటుంది!

దానినేదో మార్చాలి. కాని, ఆ మార్చడం మరొక మనో వికృతికి దారితీయరాదు. మరొక విశృంఖలతకు మార్గం చూపరాదు. అందుకే దానినలా పరిశీలించి సరసంగా మంచి చూపడంలో నవలా కర్తలు చూపవలసిన జాగరూకత అసిధారావ్రతం వంటిది.

ఈ వ్రత పరిపాలనలో మా మిత్రులు చిత్తశుద్ధి వెలార్చినన్నది నా నమ్మకం. అంతకంటె ఏం కావాలి?

ప్రియ స్నేహితుని రచనగూర్చి ఇంతకంటె ఏమన్నా ఏమంత బాగుంటుంది కనుకా? చదవండి. చదివి అవలపెట్టి అరుబయటకివెళ్ళి ఆలోచిస్తూ నడవండి. అంతే నేను కోరునది, కోరగలది.

7, డిసెంబర్ 1961
విజయవాడ.

- విశ్వం.

# ప్రకరణం 1

పూజామందిరంలో గంట గణగణ మ్రోగింది. రంగారావుకు నిద్రాభంగమైంది. అతను మంచం మీద అటూ ఇటూ దొర్లాడు. కళ్ళు నలుపుకొని చేతినున్న గడియారం చూశాడు. చీకట్లో టైము సరిగా తెలియలేదు. శాలువా ముసుగు తొలగించి పక్కనేవున్న స్విచ్ నొక్కాడు. లైటు వెలుతురులో గడియారం మళ్ళీ చూశాడు. నాలుగున్నర అయింది.

"అబ్బా! వీళ్ళు అప్పుడే కృష్ణకుపోయి స్నానాలు కూడా ముగించుకు వచ్చినట్టున్నారు. వీళ్ళ జపతపాలకు అంతులేకుండావుంది." అనుకున్నాడతను.

పూజామందిరం రంగారావు పరున్న గదికి ఎదురుగా వుంది. రెండింటికిమధ్య నాలుగుగజాలు మాత్రం ఖాళీ స్థలం వుంది. పూజామందిరంలో నూరుక్యాండిల్ బల్బు దేదీప్యమానంగా వెలుగుతూంది. మందిర ద్వారాలు, కిటికీలు అన్నీ తెరచివున్నాయి. అతను లైటు తీసివేసి మంచం మీద మళ్ళీ తాపీగా పడుకున్నాడు. కాని అతనికి నిద్ర పట్టలేదు. మందిరంలోనుండి కమ్మని అగరువత్తి వాసనలు వస్తున్నాయి. అతని చూపులు పూజామందిరం వైపుకు పోయాయి.

కృష్ణభగవానుని విగ్రహంముందు తన సోదరి రంగనాయకమ్మ, ఆమె ప్రక్కనే తన భార్య కామేశ్వరి ఆశీనులై

వున్నారు. రంగనాయకమ్మ భగద్గీత పఠిస్తోంది. కామేశ్వరి కన్నులు మూసుకొని చేతులు జోడించి భగవానునికి ప్రణామంచేస్తూ ధ్యానంలో నిమగ్నురాలైంది.

"అనన్యాశ్చిన్త యన్తో మాం
యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభి యుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్

ఎవరు అన్యదేవతా భజనచేయక సదా నన్నే ధ్యానించుచు ఉపాసింతురో వారు నాయందే నిత్యసంబంధము కలవారగుదురు. అట్టివారికి నాప్రాప్తిరూపమైన యోగమును, పునర్జన్మనివృత్తిరూప క్షేమమును నేనే యిచ్చుచున్నాడను."

రంగనాయకమ్మ శ్లోకం పఠించి తాత్పర్యం చెప్పింది. కామేశ్వరి నిశ్చలంగా కూర్చునివుంది. రంగనాయకమ్మ మళ్ళీ అందుకుంది.

"పత్రం పుష్పం, ఫలం తోయం
యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యు పహృత
మశ్నామి ప్రయతాత్మనః.

ఒక పత్రంగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని ప్రీతిపూర్వకముగా ఎవరు నాకుసమర్పించినా ఆ వస్తువును నేను స్వీకరించుచున్నాడను." అంటూముగించి గంట

గణగణ మ్రోగించింది. విగ్రహంముందు పువ్వులుంచి యిరువురూ ప్రణమిల్లారు.

కామేశ్వరి భర్తమంచం దగ్గరకువచ్చి అతనిపాదాలకు నమస్కరించింది. రంగారావు "కామూ! యిలాంటి నియమాలలో నాకు నమ్మకంలేదు. నాపట్ల అవిపాటించవద్దని నీకెన్నోసార్లు చెప్పాను. అయినా నీవు మానుకోలేదు." అన్నాడు. కామేశ్వరి సమాధానం చెప్పలేదు.

గదిలోయింకా చీకటిగానేవుంది. అతను కొద్దిగా పైకిలేచి స్విచ్ నొక్కాడు. ఆవెలుగులో రంగారావు కామేశ్వరిని ఆపాదమస్తకం పరీక్షగాచూశాడు. ఆమె తల తడి యింకా ఆరినట్టులేదు. వెంట్రుకలు చెవులనుదాస్తూ క్రిందికి వ్రేళ్ళాడుతున్నాయి. కొసనుమాత్రం చిన్నముడివుంది. విశాలమైన నుదురు, నొసట కుంకుమ. తుమ్మెదరెక్కల్లా దట్టంగాపెరిగిన కనుబొమలు, సోగగాజారిన కనురెప్పలు, సన్ననిముక్కు, పలుచనిపెదాలు, నిడివైనకంఠం, భారంగా వున్నఱొమ్ములు, సన్ననినడుం, నారింజపండురంగు పట్టుచీర, కెంపురంగు శిల్కుజాకెట్టులో ఆమె తెల్లగా, మృదువుగా అప్సరసలా అవుపించింది.

రంగారావు ఆమెచేతిని తనచేతుల్లోకి తీసికొంటూ "కామూ! నీ ఆరోగ్యం అసలే అంతంతమాత్రం. దానికితోడు ఈ చన్నీళ్ళ స్నానాలూ, ఉపవాసాలూ దేనికి? అవి కొంచెం తగ్గించలేవూ!" అన్నాడతను ప్రశాంతంగా ఆమెకనుల్లోకి చూస్తూ.

కామేశ్వరి మందస్మితం చేసింది. కాని సమాధానం చెప్పలేదు. అతనుమళ్ళీ ప్రశ్నించాడు. "ఏమీ సమాధానం చెప్పవేమిటి?"

ఆమెజాలిగా అతనికళ్ళల్లోకి చూసింది. "ఏమి సమాధానం చెప్పమంటారు? కార్తీకమాసం యింకాకొద్దిరోజులే కదావుంది! ఆ తర్వాత ఎలానూ వదినెగారు స్నానానికిపోరు"

"అయితే నీవుస్నానానికి పోవటం ఆమెకుతోడుగా వుండటానికే నన్నమాట."

"మరి!"

రంగారావు ఆమెను తనదగ్గరగా తీసికొని మంచంపై కూర్చోపెట్టడానికి ప్రయత్నించాడు. కాని కామేశ్వరి వారించింది.

"శాంత యింకా నిద్రలేవలేదు. నేను మేడపైకిపోయి దాన్నిలేపి తీసుకువస్తాను" అంటూ ఆమె భర్తను విడిపించుకొని గదిబయటకు నడిచింది.

రంగారావు యోచనలు పరిపరివిధాల పోయాయి. రంగనాయకమ్మ అతని చెల్లెలు. బాల్యవితంతువు. తండ్రి రామశాస్త్రి తహశీలుదారుగా రిటైరు అయ్యారు. తనకు పదిహేను సంవత్సరాల వయస్సులో ఆయన చనిపోయారు. తల్లి శాంతమ్మ అమాయక యిల్లాలు. పరమసాధ్వి. తను బి. యస్. సి. చదువుతూవుండగా తనకు వివాహమైంది. రంగనాయకమ్మ తనకంటే నాలుగు సంవత్సరాలు చిన్నది. తనవివాహం జరిగిన కొద్దికాలానికే ఆమెకు వివాహంచేశారు.

కాని సంవత్సరమైనా తిరగకుండా రంగనాయకమ్మ భర్త నారాయణరావు చనిపోయాడు. రంగనాయకమ్మ మామ సుబ్బయ్యావధాని చాల పూర్వాచారపరాయణుడు. నారాయణరావు అతని ఏకైక సంతానం. అవధాని రోగిష్టి. కొడుకు బాల్యదశలో వుండగానే భార్యపరలోకగతురాలైంది. వారికి మంచి ఆస్థిపాస్థులున్నాయి. ఆదశలో అవధానికి పిల్లనిస్తామంటూ ఎంతోమంది వచ్చారు. కాని రోగిష్టి అయిన అవధాని పునర్వివాహానికి సమ్మతించలేదు. నారాయణరావు జీవించివున్నకాలంలో అవధాని తన జ్ఞాతులతో అహర్నిశలు పేచీలు పడుతూనేవుండేవాడు. సరిహద్దు తగాదాలు, పంపకాల పేచీలు, కోర్టులలోదావాలు, డిక్రీలతో అవధాని విసుగెత్తిపోయాడు. అంతేకాదు. తనదాయాదులను శత్రువులుగా పరిగణించాడు. నారాయణరావు మరణానంతరం ఆ దాయాదులంతా అవధానిచుట్టూ చేరారు. అన్నకొడుకు కుటుంబరావును దత్తస్వీకారం చేసుకోవాలంటూ పట్టుబట్టారు. కాని అవధాని ససేమిరా అన్నాడు. "కొడుకైనా కోడలైనా మా రంగనాయకే. నన్ను అన్నివిధాల చూస్తుంది. పైగా మావాడి బావమరది రంగారావు వున్నాడు. అతను చాలా యోగ్యుడు. నాకు మీతో ఏ మాత్రం పనిలేదు." అని చెప్పేశాడు వారితో.

తరువాత జరిగిన నారాణరావు కర్మ కాండలకు జ్ఞాతు లెవ్వరూ రాలేదు. రంగనాయకమ్మ మామగారు పట్టుదల వహించి కోడలికి జుట్టు తీయించారు. రంగారావుకు బావమరది నారాయణరావంటే ఏమంత పెద్ద ప్రేమ

లేదు. అతను చనిపోయినప్పుడు అతను అంతగా బాధపడ లేదు కూడాను. కాని, చెల్లెలు రంగనాయకి అంటేమాత్రం అతనికి చచ్చేంత ప్రేమ, అపారమైన ఆదరాభిమానా లూనూ. చెల్లెలికి జుట్టు తీయించినప్పుడు అతను ఆమెను కౌగలించుకొని హృదయం పగిలేటట్టు బిగ్గరగా యేడ్చాడు. బంధువులంతా తనచుట్టూచేరి సముదాయించినా ఆనాడు తను దుఃఖం ఆపుకోలేక కుమిలిపోయాడు. రంగు రంగుల దుస్తుల్లో సర్వాభరణాలతో లక్ష్మివలె శోభిల్లే తన సోదరిని వికృతంగామార్చిన పెద్దలను, వారి మూఢాచారాలను అతనులోలోన శపించాడు. అట్టి ఆచారాల పట్ల యేర్పడిన యేహ్యాభావం అతనికి యీనాటికీ తగ్గలేదు.

కొడుకు కర్మ కాండలు ముగిసిన తరువాత అవధాని కోడలిని, ఆమెకు తోడుగా తల్లి శాంతమ్మ గారిని, రంగా రావును కూడా వెంట బెట్టుకుని కాశి, గయ, ప్రయాగ మొదలైన పుణ్య తీర్థాలకుపోయి పితృ దేవతలకు పిండోపక క్రియలు కావించాడు. హరిద్వారంలో వుండగా ఆయనకు బాగా జబ్బు చేసింది. డాక్టరు సందేహం వెలిబుచ్చాడు. అప్పటికే అవధాని స్థితి అయోమయంగా వుంది. రంగనాయకమ్మ, శాంతమ్మ ఆయనకు పరిచర్యలుచేస్తూ కళ్ళనీళ్ళతో తమ విచారం వ్యక్తంచేశారు. పుణ్యభూమిలో, గంగా తీరాన తనకు మరణం ప్రాప్తించటం తనపూర్వ జన్మ సుకృతమని అవధాని వెలిబుచ్చాడు. అవసాన ఘడియలపుడు అవధాని రంగారావును దగ్గరకు తీసికొని తాము యాత్రకు బయలు దేరే ముందు తన ఆస్థికి విల్లువ్రాసి రిజిష్టరు చేయించాననీ,

తన అనంతరం తన యావదాస్థికీ కోడలు రంగనాయకమ్మే సర్వాధికారిణి అవుతుందనీ తెలియజేశాడు. ఆ తెల్లవారు ఝామున అవధాని మరణించాడు. ఆయన కోరిక ప్రకారం ఉత్తరక్రియలు కర్మకాండలు అన్నీ అక్కడే ముగించారు. ఇంటికి తిరిగివచ్చిన తరువాత రంగనాయకమ్మ జ్ఞాతుల నుండి ఎన్నో పేచీలు, తగాదాలు వచ్చాయి. వాటి నన్నింటిని రంగారావు తెలివితేటలతో సమర్థించుకున్నాడు.

"అబ్బ! కాలం ఎంత తొందరగా దొర్లి పోతూంది. ఆ ఘటనలు జరిగి అప్పుడే పదేళ్ళు గడిచి పోయాయి" అనుకున్నాడు రంగారావు.

కామేశ్వరి గుమ్మంలో నిలబడి "అయ్యో! ఇదేమిటండీ! మీరింకా పడకనుండి లేవనే లేదూ! కాఫీ తయారయింది" అంది భర్త వంక చూస్తూ.

రంగారావు చేయి పైకెత్తి గడియారంలోకి చూశాడు. "అబ్బా! అప్పుడే ఏడయిందోయ్! సరే! తమరు దయచెయ్యండి. నేను యిప్పుడే వస్తా" అంటూ అతను లేచి వంకీనున్న తువాలు తీసికొని స్నానాల గదిలోకి నడిచాడు.

రంగారావు డైనింగు హాలులోకి ప్రవేశించేసరికి శాంత ఒంటరిగా టేబిలు ముందు కుర్చీలో కూర్చొని వుంది. శాంత రంగారావు కుమార్తె. శాంతకు పూర్వముగాని, తరువాతగాని అతనికి యిక సంతానం లేదు.

ఆమెకు పదమూడో సంవత్సరం. పి. యు. సి చదువుతోంది. గుండ్రని ముఖము, విశాలమైన నేత్రాలు, లేత

నునుబుగ్గలు, ఎర్రనిమూతి, చెవులకు ముత్యాల లోలకులు. వెండి తెరమీది అందాల బొమ్మలా వుంది.

రంగారావు కుమార్తెవంక చూస్తూ "యేమ్మా! కాఫీ అయిందా?" అని పలుకరించాడు.

శాంత కూచునే సమాధానం చెప్పింది. "లేదు నాన్న గారూ! మీ కోసం ఎదురు చూస్తున్నారు."

"ఓహో, నా కోసమా! ఎక్కడ, ఎవరు, ఎదురు చూస్తూన్నారంటావు?"

"పూజా మందిరంలో అత్తయ్య, వంట ఇంట్లో అమ్మా."

"అయితే ఈరోజు మనకు టిఫిన్ డబుల్‌డోస్ అన్నమాట."

శాంత కిలకిలా నవ్వింది. "అత్తయ్య మనకు యిచ్చేది టిఫిన్ కాదు నాన్నగారూ! ప్రసాదం."

"ఏదైతేనేం! అత్తయ్యకూడా ప్లేట్లు నిండా తెస్తుంది కదా!"

రంగనాయకమ్మ రెండు ప్లేట్లలో కొబ్బరికోరు, చక్కరకేళీ అరటి పళ్ళ ముక్కలు, ద్రాక్ష పళ్ళు తెచ్చి వారిముందు పెట్టింది. తండ్రి కుమార్తెలమధ్య జరిగిన సంభాషణ కూడా ఆమె వింది. శాంత అత్తయ్య యిచ్చిన ఫలాహారం వినయంతో కళ్ళకు అద్దుకొని తినడం ప్రారంభించింది. రంగారావు చంచా తీసికొని కొబ్బరి కోరు, అరటి పళ్ళ ముక్కలు కలిపితినడం ప్రారంభించాడు. రంగనాయ

కమ్మ చిన్నబుచ్చుకుంది. ఈశ్వరప్రసాదంపట్ల అన్న గారికి అంత చులకన భావన ఎందుకా అని ఆమె లోలోన బాధ పడింది. వుండ బట్టలేక ఆమె అనేసింది "అన్నయ్యా! భగవత్ ప్రసాదంపట్ల అంత చులకనభావం మంచిదే నంటావా?"

రంగారావు తెల్లబోతూ చెల్లెలి వైపు చూశాడు. "అదేమిటి చెల్లెమ్మా! భగవత్ ప్రసాదంపట్ల నాకు చులకన భావముందని నీవెందు కనుకోవాలి? ఈ ప్రపంచం లోని సకల చరాచర సంపత్తూ ఈశ్వర సృష్టేకదా? నీకు తెలియని దేముంది? అయినా ఆ గీతలోనే చెప్పాడు కదా!

యచ్చాపి సర్వ భూతానాం
బీజం తదహ మర్జున
తన దస్తి వినాయత్స్వా
న్మయా భూతం చరా చరం ॥

ఈ యదార్థం తెలిసికొంటే ఈశ్వర ప్రసాదంపట్ల నాకు చులకన భావన అని అనుకోవటం సరిగాదు." అని చెప్పి రంగారావు మరల ఫలాహారం తినటం సాగించాడు. శాంత విప్పారిన కళ్ళతో తండ్రివంక చూస్తూ "నాన్న గారూ! తాత్పర్యం కూడా చెప్పరూ?" అంది.

"అత్తయ్యను అడుగు చెపుతుంది" అన్నాడతను చెల్లెలివైపు చూస్తూ.

రంగనాయకమ్మ మందస్మితం చేసింది. ఆమె శాంత వైపు తిరిగి చెప్పింది "భగవద్గీతలోని విభూతి యోగంలో కృష్ణ భగవానులు అర్జునునికి యిలా ఉపదేశించారు.

"ఓ అర్జునా! యీ ప్రపంచంలోని సమస్త వస్తువులకు నేనే ఆది కారణమైనవాడను. నేను లేని చరాచర వస్తువులు లేనే లేవు."

శాంత అత్తయ్యవంకా, ఆ తరువాత తండ్రి వంకా పరీక్షగా చూచి "వీ రిద్దరూ సమాజంలో అత్యున్నత స్థాయికి చెందిన వ్యక్తులు" అనుకొంది.

కామేశ్వరి పూరీలు, కూర వున్న ప్లేట్లు తెచ్చి వారి ముందు పెట్టింది. రంగనాయకమ్మ సంభాషణ మార్చింది. "ఏమమ్మా వదినా! వంటావిడ ఈ రోజు కూడా రానట్లేనా ?" అని ప్రశ్నించింది.

"జ్వరం తగ్గలేదుట! వాళ్ళ చెల్లెలు వచ్చి చెప్పి పోయింది" అంది కామేశ్వరి.

"అయితే మన డాక్టరును ఒకసారి వెళ్ళి ఆవిడను చూచిరమ్మని చెప్పటం అవసరమేమో ?" రంగారావు ప్రశ్నించాడు.

రంగనాయకమ్మ పెదవి విరిచింది. "ఏమో! ఆవిడ గారికి అసలు జ్వరమో, మరేదైనా రోగమో, రొప్పో, మనకెలా తెలుస్తుంది ? అయినా మనడాక్టరే వెళ్ళి చూడాలని యెక్కడుందీ ?" అంది ఆమె అన్నగారివైపు చూస్తూ. తరువాత ఎవ్వరూ మాట్లాడలేదు.

కాఫీతాగిన తరువాత రంగారావు డ్రాయింగ్‌రూము లోకివెళ్ళి ఫోనుతీసుకుని డయలుతిప్పాడు. అవతలినుండి సమాధానంవచ్చింది. రంగారావు చెప్పాకుపోయాడు.

"డాక్టర్! మీరు బిజీగావున్నారా ?"

"లేదు సార్ ! యేమిటి పని?"

"ఆఁ! ఏమీలేదు. మా వంటామెకు నాలుగురోజుల నుండి జ్వరం వస్తూందిట. మీరు ఒకసారివెళ్ళి ఆమెను పరీక్షచేసి చూడగలరేమోనని"

"ఓ నిరభ్యంతరంగా. మీయింటికి రమ్మంటారా యిప్పుడు?"

"అక్కర్లే లేదు! వాళ్ళు పూర్ణానందంపేటలో వుంటు న్నారు. పోస్టాఫీసు సందులో 18/23 నెంబరు యిల్లు."

"ఆ, సరే!"

డాక్టర్! నేను పదిగంటలవరకూ యిక్కడే వుంటాను. రోగిని చూచివచ్చిన తరువాత వివరాలు ఫోన్ చేస్తారు కదూ?"

"తప్పకుండా"

"శెలవు."

పదిగంటలకు రంగారావూ, శాంతా యిద్దరూ కాలేజీకి పోవాలి. కామేశ్వరి పొయ్యిలురెండూ వెలిగించి వంటకార్య క్రమంలో నిమగ్నురాలైంది. రంగనాయకమ్మ కూరలు తరుగుతూ వంటావిడప్రస్తావన తెచ్చింది. "వదినా! ఈ వంట మనిషిని మాన్పించి మరొకరిని పెట్టడం బాగుంటుందేమో" అంది.

కామేశ్వరి పొయ్యిమీదనున్న బంగాళాదుంపలుదించి వేరేపళ్ళెంలో బోర్లించింది. రంగనాయకమ్మవైపుతిరిగి "మీ అన్నగారితో సంప్రతించండి" అంది.

"ఈమాత్రందానికి సంప్రదింపులుకూడా కావాలిటమ్మా! ఆవిడేమో నెలకు పదిరోజులు నాగాలు పెడుతుందయ్యే! పొయ్యిదగ్గర నానాయాతనపడుతున్నదానివి నీవూ! మాట వరసకి అన్నయ్యతో అనిచూడరాదూ?" అంది రంగ నాయకమ్మ కొంచెం నిష్ఠూరంగా.

"మీరు చెపుతున్నది యదార్థమే ననుకోండి. కాని ఆవిడకుకూడా చిన్నవయస్సు. నెలలో నాలుగురోజులు వంటింట్లోకిరావడం యెలానూ సాధ్యపడదుకదా! ఇకపోతే సుస్తీగావున్నపుడు యెవ్వరైనావచ్చి పనిచెయ్యలేరు. అలాం టప్పుడు యింకొకరువచ్చినా మనకు తప్పేదేముందీ!" అంది కామేశ్వరి నెమ్మదిగా.

"యేమోనమ్మా! మీ భార్యా భర్తలిరువురూ ఆలోచించుకొని మీ యిష్టంవచ్చినట్లు చేసుకోండి. నాకు అవన్నీ అనవసరం" అంటూ రంగనాయకమ్మ బియ్యపుచేట కామేశ్వరిముందుకునెట్టి మేడపైకిపోయింది.

* * *

రంగారావుగారింట్లో వంటావిడ వితంతువు. కాని చాలా చిన్నవయస్సు. పేరు అన్నపూర్ణ. వారి కుటుంబపరి స్థితి చాలా హృదయ విదారకమయినది. అన్నపూర్ణతండ్రి పేరిశాస్త్రికి ఆస్తిపాస్థులేమీలేవు. పౌరోహిత్యంమీద

జీవితం వెళ్ళబుచ్చేవాడు. అన్నపూర్ణకు పథ్నాలుగోయేట వివాహంచేశాడు. తరువాత రెండేండ్లకే ఆమె బిడ్డతల్లి అయింది. ఆ తరువాత కొద్దికాలానికి పేరిశాస్త్రి కలరా వ్యాధిలో చనిపోయాడు. అప్పటికి పేరిశాస్త్రికి అన్నపూర్ణ కాక మరోకుమార్తె, కుమారుడు వున్నారు. శాస్త్రిగారి మరణానంతరం అన్నపూర్ణ భర్తతోకూడా వచ్చి పుట్టింటి దగ్గరే వుండిపోయింది. మామగారి పౌరోహిత్యం అల్లుడు నిర్వహిస్తూవచ్చాడు. సంవత్సరమైనా తిరగకుండానే టైఫాయిడ్ జ్వరంతో అతను మరణించాడు. అన్నపూర్ణతల్లి రాజమ్మకు పక్షవాతం. ఆ పరిస్థితులలో వారికుటుంబపోషణ దుర్భరమైపోయింది. రాజమ్మచెల్లెలిభర్త సుబ్బరామయ్య కాలేజీలో గుమాస్తాగా వున్నాడు. ఆయిన ఒకసారి రంగారావును కలుసుకొని పేరిశాస్త్రి కుటుంబానికి ఏదైనా సహాయం చేయవలసిందిగా కోరాడు. ఆ కుటుంబానికి తానే విధంగా తోడ్పడగల్గుతానా? అని రంగారావు ఆలోచించాడు వివరాలన్నీ చర్చించినమీదట అన్నపూర్ణను వంటమనిషిగా తమయింట్లో పనికితీసికోవాలని నిర్ణయించాడు.

ఆ రాత్రి భోజనాలసమయంలో రంగారావు పేరిశాస్త్రి కుటుంబ దీనావస్థ గురించి రంగనాయకమ్మకు, కామేశ్వరికి వివరించాడు. అది విని రంగనాయకమ్మ చాలా జాలి పడింది. కామేశ్వరి ప్రక్కకుతిరిగి కళ్ళు తుడుచుకుంది. అన్నపూర్ణను తమఇంట్లో వంటమనిషిగా తీసుకొందామని రంగారావు సూచించాడు. అంతకు పూర్వం ఆ ఇంట్లో మగ

వాళ్ళుమాత్రమే వంటవాళ్ళుగా వుంటూవచ్చారు. దాదాపు అందరూ అయినకాడికి తిని తెగబలిసి పేచీలు పెట్టుకుని మరీ వెళ్ళిపోయారు. ఆ పరిస్థితులలో అన్నపూర్ణను అందరూ సంతోషంతో ఆహ్వానించారు

అప్పటికి అన్నపూర్ణ వయస్సు పంథొమ్మిది సంవత్స రాలుమాత్రమే. కోలముఖం, సోగకన్నులు, పలుచని చెక్కిళ్ళు, సన్నని పెదవులు, నిడివైనకంఠం, పసుపురంగు ఛాయ, చూచేవారికి ఎంతో నాజూకుగా అవుపిస్తుంది.

అన్నపూర్ణను ప్ర ప్రథమంగాచూచి రంగనాయకమ్మ నిర్ఘాంత పోయింది. అన్నపూర్ణ మామూలు రంగుచీర, జాకెట్టుతో వుంది. చేతులకు ఒకజత గిల్టుగాజులుకూడా వున్నాయి. కామేశ్వరి ఆమెనుచూసి మందస్మితం చేసింది.

రెండుదినాలు గడిచాక రంగనాయకమ్మ అన్న పూర్ణను తనగదిలోకిపిలచి "అమ్మాయీ! భర్త పోయినతరు వాత చీరెలూ, జాకెట్లూ ధరించటం మంచిదికాదు. అందు లోనూ మన బ్రాహ్మణ్యానికి అసలు తగదు." అంటూ మంద లించింది. అన్నపూర్ణ తల క్రిందికిదించింది. కళ్ళమ్మట నీటి ధారలు కారాయి. ఆమె ఏమీ సమాధానం చెప్పలేక పోయింది. పదినిమిషాలు తరువాత తనకుతానే సముదా యించుకొని "క్రొత్తపంచెలుకొనే తాహతులేక పాతచీర లుంటే కడుతున్నా" నంటూ ఆమె ప్రక్కకుతిరిగి కొంగుతో కళ్లూ, ముక్కూ తుడుచుకొంది.

ఆ స్థితిలో అన్నపూర్ణను ఏవిథంగా సముదాయిం చాలో రంగనాయకమ్మను బోధపడలేదు. జాలిగా ఆమె

వంకచూసింది. "పోనీలే అమ్మా! రేపు నేను ఒకజత పంచెలు తెప్పిస్తాను, కట్టుకుందువుగాని" అని చెప్పింది.

ఆ మరునాడు రంగనాయకమ్మ గుమస్తాకుచెప్పి రెండు మల్లుపంచెలు తెప్పించి అన్నపూర్ణకు యిచ్చింది. అన్నపూర్ణ ఆ పంచెలుకడుతూ మధ్యమధ్య చీరలుకూడా కట్టేది. కామేశ్వరి తానుపయోగించకుండా పెట్టెఅడుగున పడివున్న చీరలు, జాకెట్లు అన్నీ అన్నపూర్ణకు యిచ్చింది. కొద్ది కాలంలో అన్నపూర్ణ రంగారావుగారి కుటుంబంలోని వ్యక్తి వలె, వారిలో కలసిమెలసి తిరిగింది.

ఒకసాయంకాలం రంగారావు కాలేజీనుండి వచ్చే సమయానికి కామేశ్వరి, అన్నపూర్ణ యిద్దరూ మేడమీద వరండాలో నిలబడివున్నారు. యిద్దరూ ఒకేరంగు చీరలు కట్టారు. దూరంనుండిచూస్తూ కామేశ్వరిఎవరు? అనుకున్నాడు రంగారావు. ఆ రాత్రి అతను భార్యతో "ఏమోయ్, కామూం! ఈ అన్నపూర్ణలో నీ పోలికలు చాలావున్నాయ్! పరాయివారు ఎవరయినా మిమ్మల్ని యిద్దర్నిచూస్తే అక్క, చెల్లెళ్ళనుకుంటారు." అన్నాడు.

భర్తమాటలకు ఆమె మందస్మితంచేసింది. "నాకు అక్కలూ, చెల్లెళ్లూ లేనికొరత యీ అన్నపూర్ణద్వారా తీరుతోంది. ఆవిడనుచూస్తే నాకు చాలా సంతోషం సుమండీ!" అంది ఆమె.

కామేశ్వరి, అన్నపూర్ణలమైత్రి నానాటికి పెంపొందు తూంది. అన్నపూర్ణ వంటఇంట్లోఉన్నంతసేపూ కామేశ్వరి

కూడా అక్కడేవుండి ఆమెకు తోడ్పడుతూవుండేది. భోజనాల అనంతరం యిద్దరూ చదరంగం ఆడుతూ కబుర్లతో కాలం గడిపేవారు. రంగనాయకమ్మకు అది గిట్టేదికాదు. ఒక నాడు కామేశ్వరితో అంది "యిదెక్కడి విపరీతమమ్మా! వంటావిడతో అంత దోస్తీ పనికిరాదనే విషయం నీవుమాత్రం గ్రహించలేవూ! అయినా నా కెందుకు? పనివాళ్ళను పనివాళ్ళలాగానే చూడాలిగాని చనువిచ్చి నెత్తికెక్కించుకునే వాళ్ళను నే నెక్కడా చూడలేదు."

కామేశ్వరి నాలుక కరుచుకుంది. ఆ తరువాత ఆమె అన్నపూర్ణతో సన్నిహితంగా మెలగటం తగ్గించింది. ఆ విధంగా కొద్దిదినాలే గడిచాయి. తరువాత మళ్ళీమామూలే.

అన్నపూర్ణ రంగుచీరకట్టినా, సిల్కుజాకెట్టుతొడిగినా రంగనాయకమ్మ కొరకొరలాడుతూ ఆమెవైపు చూచేది. ఒక సారి అందికూడాను, "భర్తలేని ముండమోపికి ఈ శృంగారం దేనికమ్మా? ఆ పాపిట అలా దిద్దుకోవటం మంచిదికాదని నేను ఎన్నోసార్లుచెప్పాను. అయినా నీకు గ్రహింపే లేదమ్మో! వంటచేసుకుబ్రతికేదానికి యింత విరగబాటు పనికిరాదు సుమా! గ్రహించావో లేదో."

రంగనాయకమ్మ మందలింపులకు, ఛీత్కారాలకు అన్నపూర్ణ లోలోన బాధపడేది. కళ్ళు తుడుచుకునేది. కాని కామేశ్వరికికూడ ఫిర్యాదుచేసేదికాదు. రంగనాయకమ్మ అన్నపూర్ణను ఎంతగా ఏవగించుకొని ఎంతత్వరలో ఇంట్లో నుండి తరిమివెయ్యాలని చూస్తోందో, కామేశ్వరి ఆమెను

అంతగా ప్రేమిస్తూ శాశ్వతంగా తమతోనే వుంచుకోవాలని ఉబలాటపడుతూంది.

♦ ♦ ♦ ♦

రంగారావు, శాంత భోజనాలుచేస్తున్నసమయంలో ఫోన్ అలారం మ్రోగింది. రంగారావు భార్యనుపిలిచి "కామూ! ఫోన్ మోగుతోంది ఎవరోచూడు. బహుశా డాక్టరనుకుంటా! రెండునిమిషాలలో వస్తున్నారనిచెప్పి ఫోను ప్రక్కకుపెట్టిరా" అని చెప్పాడు.

కామేశ్వరి వెంటనేతిరిగివచ్చి "వదినెగారు మాట్లాడుతున్నారు" అని చెప్పింది.

రంగారావు చేతులుతుడుచుకొంటూ డ్రాయింగు రూములోకి నడిచాడు. రంగనాయకమ్మ సోఫాలోకూర్చొని పత్రికచూస్తోంది. అతను ఆమెవైపుకుచూస్తూ "ఏం చెల్లెమ్మా! ఫోనులోపిలిచింది డాక్టరేనా?" అన్నాడు.

"అవును అన్నయ్యా!"

"ఏం చెప్పాడు?"

"అన్నపూర్ణకు జ్వరంతగ్గిందట."

రంగారావు ఫోన్‌తీసికొని "డాక్టర్!" అని పిలిచాడు.

"యస్. సార్" అవతలికంఠం పలికింది.

"విశేషాలేమిటి? ఆమెకు ఏమిజ్వరం అంటారు?"

"ఫ్లూ. జ్వరమైతే తగ్గిందిగాని ఆమె చాలానీరసంగా వుంది, కొంత విశ్రాంతి అవసరమనుకుంటా."

"ఔషధం, టానిక్కులు ఏమన్నా కావాలా ?"

"చీటీ రాసిచ్చాను."

"సరే! నాకు టైమయింది. కాలేజీకి పోతున్నా."

"సరేగాని క్లబ్బుకు రావటం మానివేశా రేమిటి ?"

"కాలేజీలో టెన్నిస్ కోర్టు ఓపెన్ చేశారు. నాకు అక్కడే హాయిగా వుంది."

"పోనీ రేపు ఆదివారం రాకూడదూ !"

"అబ్బే! యిక నేను అక్కడకు రాదలచుకోలేదు"

"యేమిటి, అంత వైరాగ్యం!"

"వైరాగ్యమేమీ లేదుగాని అక్కడ తిరిగే వాళ్ళకు చాలమందికి నైతిక విలువలే లేవని నా అభిప్రాయం"

"అయితే యీనాడు క్లబ్బులలో తిరిగే వేలాది మందీ మనుష్యులు కాదంటారు"

"మీ దృష్టిలో కావచ్చు. నా దృష్టిలో మాత్రం ఏ సెట్ ఆఫ్ లోఫర్స్. పతనమవుతూన్న సోమరిపోతులు. వస్తా. తరువాత కలుసుకుందాం" అంటూ రంగారావు ఫోను పెట్టేసి చకచకా వెళ్లిపోయాడు.

రంగారావు సంభాషణ రంగనాయకమ్మ పొల్లు పోకుండా వింది. అన్నగారియొక్క నిజాయితీనీ, నిష్కల్మష జీవితాన్నీ ఆమె యెప్పుడూ కొనియాడుతుంది. ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగాయి "అన్నయ్య దేవుడిలాంటివాడు" అనుకుందామె.

రంగారావు తనగదిలోకిపోయి ప్యాంటు వేసుకుంటూ “కామూ” అని భార్యనుపిలిచాడు. ఆమె వచ్చింది. “మేమోయ్! యీ టై కాస్త కట్టు” అన్నాడు అతను క్రాపుదువ్వుకుంటూ. ఆమె నేర్పుగాముడివేసింది. అతను అద్దంలో చూస్తూ “ఛ! ఫస్టు!” అన్నాడు. అతను బూట్లు తొడుగుతూంటే ఆమె కోటు బ్రష్ చేసియిచ్చింది. అతను బిరబిరా బయటికినడిచి కారులో కూర్చుని హారన్ మోగించాడు. శాంతవచ్చి కారులోకియెక్కింది. నౌకరు గేటు తెరిచాడు. కారు కదిలిపోయింది.

# ప్రకరణ 2

రంగారావుకు పిత్రార్జితం విజయవాడ గాంధీనగరంలో రెండంతస్తులభవనం, సంవత్సరానికి అయిదారువేలు రాబడి వచ్చే లంకభూములూ వున్నాయి. రంగనాయకమ్మకు అత్తవారిగ్రామం ఉయ్యూరులో చక్కని భూవసతీ, యిల్లూ వున్నాయి. ఆమెకుకూడ సంవత్సరానికి యిరవై వేలకు పైగా రాబడివస్తుంది. యిన్ని అవకాశాలు వున్నప్పటికీ రంగారావు యం. యస్. సి. డిగ్రీపొందగానే కాలేజీలో లెక్చరర్‌గాచేరాడు. ఆ కాలంలోనే అతనిభార్య కామేశ్వరి క్రొత్తగా కాపురానికివచ్చింది. ఆమె అతనికి స్వయంగా మేనమామకూతురు. కామేశ్వరి బాల్యంలో వున్నప్పుడే తండ్రి పునర్వివాహం చేసుకున్నాడు. తల్లిలేని పుట్టింటిని గురించి కామేశ్వరి అంతగాతలచదు. కామేశ్వరీ, రంగనాయకమ్మా యిరువురూ సమవయస్కులే. కామేశ్వరి మితభాషిణి, నిరాడంబరజీవి. అత్త, ఆడబిడ్డలకు అణగిమణగివుండేది, భర్త అడుగులకు మడుగులొత్తేది.

రంగనాయకమ్మదృష్టి ఆ కాలంలో యింకా పూజా పునస్కారాలవైపుకు మళ్ళలేదు. కుటుంబ నిర్వహణ బాధ్యతనంతా ఆమె నిర్వహించేది. రాబడీ, ఖర్చూ లెక్కలూచూస్తూ ఎక్కువకాలం గడిపేది. సనాతనాచారాలను తు. చ. తప్పక పాటిస్తూవుండేది. యింటినౌకర్ల మీదా, వదెనగారిపైనా పెత్తనం చెలాయించేది కూడాను.

కామేశ్వరి కాపురానికివచ్చిన కొద్దికాలానికే శాంతమ్మగారు దీర్ఘవ్యాధితో మంచంపట్టి మరణించింది. తల్లి మరణానికి కోడలువచ్చిన వేళావిశేషమేనని రంగనాయకమ్మకు అనుమానం. దానితో ఆమె కామేశ్వరిని నిరాదరణతో చూడసాగింది. అంతటితో ఆగలేదు. యిరుగు, పొరుగున సూటీపోటీగా నిందించేది. "ఈవిడ మాకు శకునిలాగ దాపురించింది. ఆరునెలలైనా తిరుగకుండా అత్తను పొట్టపెట్టుకుంది. ఈవిడవచ్చిన వేళావిశేషం కాకపోతే యింత వైపరీత్యం ఎలాజరుగుతుంది?" అనేది. ఆడబిడ్డ నిందలకు, నిష్ఠూరాలకు లోలోన బాధపడినా ఏనాడూ భర్తకు చెప్పి ఎరుగదు కామేశ్వరి.

ఒక ఆదివారం సాయంకాలం రంగారావు భార్యాసమేతంగా సినిమాకు బయలుదేరాడు. అది పసిగట్టిన రంగనాయకమ్మ ముందుగానే తల్లిని తలచుకొని యేడుపు ప్రారంభించింది. రంగారావు నిర్ఘాంతపోయి చెల్లెలిదగ్గరకుపోయి "దేనికి చెల్లెమ్మా అంతవిచారం?" అని అడిగాడు రంగనాయకమ్మ అన్నగారి వైపు చూడనైనా లేదు. ముఖం పక్కకు తిప్పుకొని చీదివేసింది. రంగారావు మళ్లీ ప్రశ్నించాడు "చెల్లెమ్మా! విషయమేమిటో నాకుచెప్పకూడదా?" ఆమె విచారం వలకపోస్తూ అంది. "ఏముందిఅన్నయ్యా చెప్పేందుకు? కని పెంచిన తల్లిపోయి రెండుమాసాలయినా గడవలేదుగదా! అమ్మ తలపుకువచ్చి దుఃఖం పొర్లుకువచ్చింది" అంది.

అంతటితో రంగారావు సినిమాకుపోయే ప్రయత్నం విరమించుకున్నాడు. కొద్దిదినాలు గడిచాయి. వదెన గర్భ

వతి అని తెలిశాక రంగనాయకమ్మ ధోరణి పూర్తిగామారి పోయింది. పండ్లు, ఫలాహారాలతో ఆమె ఎప్పుడూ వదెనని అంటిపెట్టుకు తిరిగేది. ఆమెకు సీమంతాలు చేయించింది. సూడిదలు పంచింది. నెలలు దగ్గరపడ్డాక కాన్పుకు పుట్టింటికి తీసుకుపోతానంటూ కామేశ్వరి తండ్రి వచ్చాడు. రంగ నాయకమ్మ వీలు లే దంది.

"అది శుద్ధపల్లెటూరు. అక్కడ సరయిన డాక్టరూ, ఆసుపత్రీ అంటూలేవు. యేమైనా తొలికాన్పుగదా! యిక్కడే వుంచుకుంటాం." అనిచెప్పేసింది. చెల్లెలివాదనను కాదనలేదు రంగారావు. అయినా అతను భార్యతో సంప్ర దించాడు. ఆమె "మీ యిష్టం" అంది.

కామేశ్వరికి కలుగబోయే సంతానాన్ని గురించి రంగ నాయకమ్మ యెన్నెన్నో కలలుకంది. ఆమెయోచనలు పరి పరివిధాల పోయేవి. "ఆడపిల్ల పుడితేనే బాగుంటుంది. అమ్మ పేరు పెట్టుకోవచ్చు" ఆ మరుక్షణంలోనే ఆ అభిప్రాయం మార్చుకునేది. "ఏమో, మగపిల్లవాడు కలగడమే మంచి దేమో! వంశప్రతిష్ట నిలబడుతుందిగదా!" అని అనుకునేది.

ఒకరోజు ఆమె కామేశ్వరికి తలఅంటుతూ "వదెనా! నీవు కనబోయేది ఆడపిల్లా, మగపిల్లవాడా!" అని అడిగింది.

కామేశ్వరి సిగ్గుతో తలవంచుకుంది. సమాధానం చెప్పలేదు. రంగనాయకమ్మ మళ్లీ ప్రశ్నించింది "అయ్యో! అంతసిగ్గు దేనికమ్మా? నీ కా మాత్రం తెలియదూ!"

కామేశ్వరి తలవంచుకునే సమాధానం చెప్పింది. "ఏమో వదినెగారూ! ఏ బిడ్డయిందీ నేనుమాత్రం ఎలా చెప్పగలను?"

"అదేమిటమ్మా! పెద్దవాళ్ళు చెప్పుకుంటూంటే విన లేదూ? మగబిడ్డయితే గర్భంలో శిశువు కుడివైపున తిరుగు తుందనీ, ఆడపిల్లగనుక అయితే ఎడమవైపు తిరుగుతుందనీ అంటారుగా! నీవు ఆమాత్రం గ్రహించకుండా వున్నావా యేమిటీ?"

"యేమో, నేనింతవరకూ అదేమీ గమనించలేదు వదినెగారూ."

"పోనీలే! యేబిడ్డయితే మాత్రమేమి? కాన్పు సుఖంగా జరగాలి గదా! అంతా ఆ ఈశ్వరదయ." అంది రంగనాయకమ్మ.

ఆ రాత్రి భోజనాలసమయంలో రంగనాయకమ్మ తిరిగి ప్రస్తావన తెచ్చింది "ఒదెనా! నీకు కొడుకుపుడితే మా నాన్న గారి పేరుపెట్టి నాన్నా! అనిపిలుస్తాను, ఆడపిల్ల అయితే అమ్మపేరుపెట్టి "అమ్మా" అని పిలుచుకుంటాను" అంది ఆమె కామేశ్వరి కనబోయే బిడ్డపేరు తనే నిర్ణయిస్తూ.

కామేశ్వరి మందస్మితంచేసింది. "మీ కంటే మా క్షేమాభిలాషులు ఎవరున్నారు వదెనగారూ! అన్నీ మీ యిష్టప్రకారమే జరపండి. యే అభ్యంతరంవుండదు." అని స్పష్టంగా చెప్పింది.

"వదెన అన్నివిధాలా చాలా కలుపుగోలుమనిషి" అనుకుంది రంగనాయకమ్మ.

రోజులు లెక్కిస్తుండగా నవమాసాలునిండాయి. కామేశ్వరిని హాస్పిటల్లో చేర్చారు. నర్సుతోబాటు రంగనాయకమ్మ వదెన మంచం ప్రక్కనే నిలబడింది. ఆ సమయానికి విజిటర్సురూములో రంగారావు గుండెబిగబట్టుకుని వెర్రిమొర్రి ఆలోచనలతో పచారుచేస్తున్నాడు. గదిలో యింకా యితర ప్రేక్షకులుకూడా వున్నారు. రంగనాయకమ్మ హడావుడిగా తలుపుతోసుకొని ఆ గదిలోకివచ్చింది. ఆమె వెనుక స్ప్రింగ్ తలుపులు అటూఇటూ వూగాయి. రంగారావు కిటికీలోనుండి బయటకుచూస్తున్నాడు. ఆమె "అన్నయ్యా!" అంది. అతను బిత్తరపోయినట్టు చెల్లెలి వంక చూశాడు. ఆమెకళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి. అన్నగారి నోటినుండి మాటవెలువడకముందే ఆమె చెప్పుకుపోయింది.

"అన్నయ్యా! ఆడపిల్లపుట్టింది. పిల్లయెలావుందనుకున్నావు! సాక్షాత్తూ మనఅమ్మే. నువ్వుకూడా చూదువుగాని రా! అయితే కాసేపు ఆగాలి. ఆ నర్సులు పిల్లను స్నానంచేయిస్తారట, స్నానమూ పాడూనూ! కాస్తబొచ్చెలో నీళ్ళుపోసి దాంట్లో ఆ పిల్లనుపడేసి రుద్దుతారు. పిల్లవంటినున్న మలినమంతా ఆ బొచ్చెలోనే కడగటం. శుచాశుభ్రమా! పాడుఆసుపత్రీ, వీళ్లూనూ!" అంటూ ఆమె గదినలువైపులా చూసింది. అక్కడవున్నవారందరూ తన వైపు పరీక్షగాచూస్తున్నారు. ఆమె సిగ్గుపడింది. ఆమె

తలదించుకొని "అన్నయ్యా! లోపలికిపోదాం రా" అంది. రంగారావు స్వేచ్ఛగా గాలిపీల్చుకొని "అమ్మయ్యా, ఒక గండం గడిచింది." అనుకున్నాడు. అంతమందిలో చెల్లెలితో యేమిమాట్లాడాలో అతనికి తోచలేదు. రెండు నిమిషాలు తటపటాయించి"కామేశ్వరి యెలావుంది చెల్లెమ్మా!" అని అడిగాడు.

రంగనాయకమ్మ పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడింది. బుగ్గలు సొట్టలుపడ్డాయి. ఆమె అన్నకుదగ్గరగా జరిగి "శుభ్రంగావుంది. తేలికై నకాన్పు." అంటూ ఆమె వరండాలోకి దారితీసింది. అతను వెనక నడిచాడు. ఒక మూలగానిలబడి అన్నగారివైపుచూచి నవ్వుతూ 'అన్నయ్యా! పిల్లక్షేమం నీకు పట్టలేదన్నమాట' అంది వ్యంగ్యంగా.

రంగారావు నవ్వుకుంటూ "అలా ఎందుకనుకోవాలి చెల్లెమ్మా! పిల్ల యోగక్షేమాలగురించి నీవు ముందుగానే చెప్పావుకదా!" అని అన్నాడు.

ఇద్దరూకలసి కామేశ్వరివున్న గదిలోకి నడిచారు. గది అంతగా పెద్దదికాదు. నాలుగుమంచాలు క్రిక్కిరిసి వట్టున్నాయి. రెండు మంచాలమీది బాలింతలు పాపలకు పాలిస్తున్నారు. కామేశ్వరి మంచానికి ప్రక్కగానున్న ఆమె ఆయాసంతో మూలుగుతోంది. ఆ మంచం ప్రక్కనే ఒక నర్సు నిలబడివుంది.

కామేశ్వరి రంగారావునుచూసి నీరసంగా నవ్వింది. రంగారావు ఆమెకుదగ్గరగా నిలబడి "ఎలావుంది కామూ!" అన్నాడు. ఆమె సమాధానంచెప్పలేదు. విప్పారినకళ్ళతో

అతనివంకచూచింది. దంపతులిరువురూ ఒకరినొకరు కళ్ళతో ఆప్యాయంగా పలుకరించుకొన్నారు. ఆమెచెక్కిళ్ళు పలుచ నయ్యాయి. కళ్ళు తేజోవంతంగా వున్నాయి. ఆ స్థితిలో ఆమె అతనికి ఒక పసిపాపలా అగుపించింది.

"ఒదినా! అన్నయ్య 'నీ ఒంట్లో యెలావుంది?' అని అడిగినప్రశ్నకు సమాధానం చెప్పవేమిటమ్మా?" రంగ నాయకమ్మ ప్రశ్నించింది. కామేశ్వరి ఆయాసంతో దీర్ఘంగా నిట్టూర్చింది. కళ్ళుమూసుకుని "బాగానే వున్నాగా!" అంది.

రంగారావు రెండునిమిషాలు నిలబడి "నేను పోవచ్చా?" అన్నాడు.

కామేశ్వరి నీరసంగా అతనివైపుచూచి "పాపాయిని చూడరూ?" అంది. అతను సిగ్గుపడ్డాడు. "పాపాయి బాగుందని చెల్లెమ్మ చెప్పిందిలే." అన్నాడు.

పొత్తిళ్ళలో పొదిగిన పసిపాపను ఒకనర్సు తీసుకువచ్చి కామేశ్వరిపక్కలో పరుండబెట్టింది.

"వదినా! నీబిడ్డ అదేనా?"రంగనాయకమ్మ నవ్వుతూ ప్రశ్నించింది. కామేశ్వరి నీరసంగా నవ్వింది.

రంగారావు పాపవంక పరీక్షగాచూశాడు. చెల్లెలు వర్ణించిన రూపురేఖలవివరాలు ఆపాపలో అతనికేమీ అగు పించలేదు. పాప శరీరమంతా ముసలివాళ్ళ చర్మంలా ముడుతలారివుంది. కళ్లు మూసుకొనివున్నాయి. "సరే, నేను పోయివస్తాను." అంటూ అతను వెనక్కుతిరిగి గుమ్మం వైపుకు నడిచాడు.

పాప పోషణభారమంతా రంగనాయకమ్మ తనమీద వేసుకొంది. పాపకు ఉయ్యాల, నామకరణం, అన్నప్రాశన, పుట్టినరోజు పండుగలు, అక్షరాభ్యాసం మొదలైన వేడుకలన్నీ క్రమపద్ధతిగా పెద్దఎత్తున జరిపించింది. సంవత్సరాలు గడిచాయి. పాప నానాట పెరిగిపెద్దదైంది.

రంగారావుగారి కుటుంబ ఆర్థికపరిస్థితులు ఎంతో మెరుగయ్యాయి. లెక్చరర్‌గా మంచి పేరుప్రఖ్యాతులు గడించాడు. గాంధీనగరంలోనున్న మేడ నవీనపద్ధతిలో పునర్నిర్మాణం గావించాడు. ప్లిమత్ కారు కొన్నాడు.

భూములమీద అజమాయిషీకి యిద్దరు నిగామానులను పెట్టాడు. లెక్కలుచూడటానికి వేరే గుమాస్తానుకూడా నియమించాడు.

రంగనాయకమ్మ పూజలు పునస్కారాలు, భజనలు, పురాణశ్రవణం, వేదాంతచర్చలు మొదలైనవాటిలో లీనమైంది. ఆమెదృష్టిని ప్రాపంచికవిషయాలకు మరల్చాలని రంగారావు అనేకప్రయత్నాలు చేశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. యిటీవల అతిస్వల్ప విషయాలమీదకూడ ఆమె చాల చికాకుపడుతూంది. ఆమె క్రమంగా యే సన్యాసాశ్రమంలోకో మారుతుందేమోనని అతను భయపడ్డాడు. "రంగనాయకమ్మకు చిన్నవయస్సే. ఆమె అభిప్రాయాలు మార్చుకుంటే యిప్పుడైనా వివాహంచేసుకునే అవకాశం లేకపోలేదు." అనుకున్నాడతను.

ఒకరోజున తన తోటికాలేజీ లెక్చరర్ ఒకాయన మాటలసందర్భంలో "ఏమయ్యా! నీకైతే చాలా అభ్యుదయ

భావాలున్నాయి. కాని చిన్నవయస్సులో మీ చెల్లెలికి భర్త పోయినా ఆమెకు పునర్వివాహం చేసేందుకు ఎందుకు ప్రయత్నించలేదు?" అని ప్రశ్నించాడు.

అతనికి ఎలా సమాధానంచెప్పాలో తోచక రంగారావు తికమకపడి మా చెల్లెలికి ప్రాపంచికదృష్టి అంతగా లేదండీ? ఆమెకు ఆధ్యాత్మికచింతన చాలాఎక్కువ. అందుచేత నేను ఎంతప్రయత్నించినప్పటికీ ప్రయోజనం కలగడం లేదు." అని మాత్రం అనగలిగాడు.

రంగారావు చెప్పిన సమాధానంవిని ఆయన నవ్వుతూ "ఆ మాత్రంచేత నీభాధ్యత తీరిందని అనుకోవడం భావ్యంగాదు. ఇప్పుడైనా మించిపోయిందిలేదు. గట్టిగా ప్రయత్నించు" అని హెచ్చరించాడు.

ఒక ఆదివారం ఉదయం రంగారావు వేళతప్పి లేచాడు. స్నానాలగదిలోనుండి అతను సరాసరి డైనింగు హాలులో ప్రవేశించాడు. కామేశ్వరి అతనికొరకు అక్కడ నిరీక్షిస్తూకూచుంది. రంగనాయకమ్మ సోఫాలోకూచుని డైరీ వ్రాసుకుంటోంది

కామేశ్వరి భర్తవంకచూస్తూ "టిఫిన్ తీసుకుంటారా?" అని ప్రశ్నించింది. "లేదు. వట్టి కాఫీమాత్రం" అన్నాడతను. కామేశ్వరి గడపదాటుతూండగా "మేమాయ్! స్ట్రాంగ్ కాఫీ" అన్నాడు.

రంగారావు సోఫాలోకూర్చుని పత్రికతిరగేస్తున్నాడు. కామేశ్వరి కాఫీ తీసుకువచ్చి అతనిముందు పెట్టింది. రంగనాయకమ్మ డైరీ పుచ్చుకుని మేడమీదికిపోతూ "కాఫీ

తీసుకున్న తరువాత ఒకసారి పైకివచ్చివెళ్ళు అన్నయ్యా!" అని చెప్పింది.

ప్రక్కన నిలబడివున్న కామేశ్వరి ప్రశ్నార్థకంగా భర్తవంక చూసింది. అతను ప్రశ్నించాడు "అలా సీరియస్‌గా చూస్తావేమిటి కామూ? ఆ చూపులలోని భావమేమిటో కాస్త చెప్పవూ?"

"అబ్బే, ఏమీలేదండీ! మీ చెల్లెలుగారు ఈ వేళప్పుడు మేడమీదికి పిలుస్తున్నారు ఎందుకు అని?"

"బహుశా ఖాతాలెక్కలు చూడటానికేమో ననుకుంటా."

"గుమస్తాగారు వున్నారుగా అందుకైతే!"

"మరి యింకెందునిమిత్తమనుకుంటున్నావు?"

"యేమో! నాకెలా తెస్తుంది! బహుశా..."అంటూ నవ్వేసింది.

"ఏదో విశేషముంది చెప్పరాదూ!"

ఆమె మళ్ళీ నవ్వింది. అతను తిరిగి ప్రశ్నించాడు

"ఇంట్లో యేమైనా పేచీపడ్డారా?"

"అబ్బే! అలాటిదెప్పుడూ జరుగలేదు. జరుగదు కూడాను."

"అన్నపూర్ణ విషయమేమైనా?"

"అబ్బే, అదీఅయివుండదు."

"మరి యింకామేమిటో చెప్పరాదూ?" అన్నాడు రంగారావు కొంచెం చికాకుతో.

ఆమె మందస్మితంచేసింది. "వట్టినే. దేనికండీ అంత చికాకు పడతారు?"

"మరి అసలువిషయం తెలిసివుండికూడ చెప్పకుండా సంభాషణ పెంచుతావు దేనికీ?"

"వదెనగారు చెపుతారుగదా !"

"ఆ విషయం తెలిసినదానివి ఈ ప్రస్తావన తీసుకురావటంలో నీ ఉద్దేశ్యం యేమిటో చెప్పు ముందు?" అంటూ రంగారావు కళ్ళుపెద్దవిచేసి ఆమెవంకచూశాడు.

ఆమె దెబ్బతిన్నదానివలె బెదురుతూ అతనివైపు చూసింది. అతను చికాకు పడ్డాడు. ఆమెకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "ఛీ! ఆడవాళ్ళ స్వభావం పోనిచ్చావుగాదు." అంటూ అతను భార్యను దగ్గరగాతీసికొని కొంగుతో ఆమె కళ్ళు తుడిచాడు.

"సరే. యిప్పుడైనా చెపుతావా ఆ రహస్య మేమిటో?" అన్నాడు అతను కామేశ్వరి గడ్డంపుచ్చుకుని ముఖంపైకెత్తి సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

ఆమె సిగ్గునభినయిస్తూ అతని చేతులు వదిలించుకుని ఎడంగా జరిగి కూర్చుంది.

రంగారావు సంభాషణ మార్చాడు. "ముసలమ్మవు అయినాకూడా చిన్నపిల్లల్లా సిగ్గుపడటంమాత్రం పోలేదు."

ఆమె తిరిగి అంది "నేనేనా ముసలమ్మను? మీరు మాత్రం ముసలివారుకాలేదా యేమిటి !"

"అబ్బే, ముప్ఫయిరెండేండ్లకు నాకు ముసలితనం యేమిటీ! నేను స్టూడెంట్సుతో కలసితిరుగుతూంటే మా

ప్రిన్సిపాలు ఒకసారి నవ్వుతూఅన్నాడు 'యేమయ్యో రంగారావ్! నువ్వుకూడా ఒక స్టూడెంటులాగానే వున్నావు' అని. అసలు యిదంతాదేనికి? శాంత మనఅమ్మాయి అంటే చాలమంది నమ్మరుకూడాను!"

"అవును మరి! కోటూ, సూటూ, బూటూ, వేసుకొని టై కట్టుకుని, స్నోలు, పౌడర్లు రుద్దుకుని యువకుల్లా తయారవుతారు గనుక ముసలివారిలెఖ్ఖలోకి మీరు రారు. సరేగాని, రేపు అల్లుడు వచ్చినతరువాతకూడా యిలానే ముస్తాబు అవుతారా?"

"ఛా! ఇప్పుడే మనకు అల్లుడేమిటోయ్?"

"యేమో! ఇప్పటికి వారంరోజులనుండి అమ్మాయి పెండ్లివిషయం మీతో సంప్రదించమని వదెనగారు నన్ను వేధిస్తున్నారు."

రంగారావు నిర్ఘాంతపోయి "ఛీ, ఛీ! ఎవరైన నవ్వి పోతారు" అన్నాడు.

కామేశ్వరి మరి మాట్లాడలేదు. రంగారావు మళ్లీ ప్రశ్నించాడు "మరి నువ్వేమని సమాధానం చెప్పావు?"

"ఆమె నా సమాధానం కోరలేదుగా!"

"పోనీ నేను అడుగుతున్నాను చెప్పు. అమ్మాయికి యింత చిన్నవయస్సులో వివాహం చేయటం నీకు అంగీకారమేనా?"

"నా అంగీకారం ఎవరికి కావాలి? నేను కాపురానికి వచ్చి పధ్నాలుగు సంవత్సరాలైంది. నా అంగీకారంతో నిమిత్తంలేకనే ఇంతకాలం సాగిపోయింది. ఇప్పుడుమాత్రం

దాని అవసర మేమివచ్చింది ? యేది యేమైనా యీ భావాలకు పద్ధతులకు వ్యతిరేకంగా నడిచే స్వభావం కలదానినిమాత్రం కాదునేను ” అని చెప్పి ఆమె అక్కడినుండిలేచి లోపలికి పోయింది.

కామేశ్వరి చెప్పిన సమాధానంవిని రంగారావు ఆలోచనలోపడ్డాడు. భార్యయొక్క నిస్సహాయస్థితికి అతను జాలి పడ్డాడు. “ఆమె వ్యక్తిత్వాన్ని చంపుకుని మెలగవలసినంతటి దారుణపరిస్థితులు తన ఇంట్లో వున్నాయా ? అయితే అందుకు బాధ్యులెవరు ?” అని అతను ఆలోచించసాగాడు.

రంగనాయకమ్మ గుమ్మంలో నిలబడి “అన్నయ్యా, ఒకసారిపైకివచ్చి వెళ్ళవలసిందని చెప్పిపోతినిగదా! వచ్చావు కాదేమీ ?” అని అడిగింది.

రంగారావు వులిక్కిపడి లేచినిలబడి “ఆ, వస్తున్నాను చెల్లెమ్మా !” అంటూ అతను చరచరా మెట్లుయెక్కి పైకి పోయాడు. రంగనాయకమ్మ అతని వెనుక నడిచింది.

రంగారావు మేడమీది గదులన్నీ తిరిగిచూచి “చెల్లెమ్మా! శాంత అగుపించడంలేదు. ఎక్కడకు వెళ్ళింది?” అని ప్రశ్నించాడు.

“కాఫీ తీసుకున్నతరువాత ప్రయివేటుక్లాసు యేదో వుందని పుస్తకాలుకూడా తీసుకుపోయింది. అయితే నీతో చెప్పకుండానే వెళ్ళిందన్నమాట!” అంది రంగనాయకమ్మ.

“నేను ఈ రోజు ఉదయం చాల ఆలస్యంగాలేచాను గదా ! నాకదేమీ తెలియదు” అన్నాడు అతను.

ఇద్దరూ రంగనాయకమ్మ గదిలోకి నడిచారు. ఆమె అన్నగారికి కుర్చీచూపి తను చాపమీద కూచుంది. రంగారావు గదినాలుగువైపులా దృష్టిపోనిచ్చాడు. ఒకమూల పీటమీద పూరీ జగన్నాథస్వామి పటమూ, దానిముందు భగవద్గీత గ్రంథమూ వున్నాయి. ఆ ప్రక్కనేవున్న అద్దాల బీరువా వేదాంతగ్రంథాలతో నిండివుంది. పొరుగుయింట్లో వీణమీద పాడుతూన్న త్యాగరాయకృతి హాయిగా వినిపిస్తూంది.

రంగనాయకమ్మ లోగడ అధ్యాత్మ రామాయణం కీర్తనలు పాడుతూవుండేది. కొంతకాలంగా ఆమె అవి పాడటం మానేసింది. వీణావాయిద్యం వింటున్న రంగారావు ఆ విషయం గుర్తుకు తెచ్చుకొని "చెల్లెమ్మా! ఈ మధ్య అధ్యాత్మ రామాయణ కీర్తనలు, అష్టపదులు పాడటం పూర్తిగా మానివేసినట్లున్నావు. ఆ పాటలు మన శాంతకు కూడా నేర్పుచెల్లెమ్మా! వినడానికెంతో హాయిగా వుంటాయి" అన్నాడు.

రంగనాయకమ్మ పెదవి విరిచింది "అమ్మడికి ఈ కీర్తనలు దేనికి అన్నయ్యా? సంగీతం మాస్టరు వస్తున్నాడుగా! యేవో కృతులు పాడిస్తున్నట్లున్నాడు!" అంది ఆమె.

ఈ కాలపు సంగీతం మాస్టర్లపట్ల రంగారావుకు యేమంత సదభిప్రాయంలేదు. ఆ విషయం ప్రస్తావిస్తూ "ఈ రోజుల్లో సంగీతం మాస్టర్లకు చాలవరకు సంగీతజ్ఞానం లోపించిందనిపిస్తూంది. ఎందుచేతనంటే యే కొద్దిమందో తప్ప చాలామందికి అటు శాస్త్రీయ సంగీతంలోగాని, ఇటు

కర్నాటక సంగీతంలోగాని సంపూర్ణ పరిజ్ఞానం శూన్యం. ఇకపోతే ప్రతివాడూ నాలుగు సినిమాట్యూన్సు కాపీకొట్టి మ్యూజిక్ మాస్టరు నంటూ తయారవుతాడు. ఏమైనా అమ్మాయికి ఆ మిడిమిడి జ్ఞానపు సంగీతం చెప్పించడంవల్ల ప్రయోజన ముండదని నేను అనుకుంటాను" అన్నాడతను.

రంగనాయకమ్మ ప్రస్తావనమార్చింది. "అన్నయ్యా! నా పేరవున్న ఆ బ్యాంకు అక్కవుంట్లు బదలాయింపు చెయ్యమని లోగడ చెప్పానుగదా! అలా చేశావు కాదేమీ? మళ్ళీ ఇన్‌కమ్ టాక్సులనీ, చట్టుబండలనీ నానా యాతనలు పడవలసి వస్తుందిగదా!" అంది అన్నగారివైపు చూస్తూ.

"అవునమ్మా! నేను ఆ విషయం మరచేపోయాను. అయినా నేను ఆనక గుమాస్తాకు చెప్పిపోతాను. వివరాలు ఆయనకు చెపితే మార్పించుకు వస్తాడు. ఈ దినం ఎలానూ బ్యాంకులుండవ్వకదా! రేపుచూదాం" అన్నాడు రంగారావు.

"వివరాలంటూ ఏమున్నాయి అన్నయ్యా? భారత లక్ష్మీ, ఆంధ్రా బ్యాంకులలో మొత్తం అరవై వేలకు పైగా వున్నాయి. ఆ మొత్తం నీ పేర, శాంత పేర మార్పిస్తే బాగుంటుందని అనుకుంటున్నాను" అంది ఆమె.

"నా అక్కౌంటులో యిప్పటికే పెద్ద మొత్తముంది. అందుచేత నా అక్కౌంటుకు ట్రాన్స్‌ఫర్ చేయడం మంచిది కాదనుకుంటాను."

"అయితే వదినపేరున కొంత, శాంతపేరున కొంత మార్పించవచ్చును గదా!" అంది.

"సరే, అలానేచేదాం" అన్నాడు అతను.

పది నిమిషాలు మౌనంగా గడిచింది. రంగ నాయకమ్మలేచి ఫాన్‌స్విచ్ నొక్కింది. ఆమె యింకా దేనినిగురించో ప్రస్తావించటానికి చూస్తోందని రంగారావు నిశ్చయించుకున్నాడు. రంగనాయకమ్మ తిరిగి తనస్థానంలో కూర్చుని "అన్నయ్యా! మన ప్రక్కవీధిలోవుంటున్న జడ్జీగా రబ్బాయిని నీవు చూచేవుంటావని తలుస్తాను." అంది.

"ఏ అబ్బాయి?"

"నిరంజన్. మీ కాలేజీలో బి. యస్. సి. చదువు తున్నాడట."

"చూశాను. అందంగా వుంటాడు. అంతేకాదు. మంచి తెలివితేటలు గలవాడుకూడాను."

"అతనికి మన అమ్మడిని యిచ్చి వివాహంచేయటం బాగుంటుందని అనుకుంటున్నా."

"మన శాంతది యింకా చిన్నవయస్సేగదా! ఇప్పు డప్పుడే వివాహంచెయ్యటం యేమంత సమంజసంగా వుంటుంది?"

"చిన్నవయస్సు యేమిటే? అమ్మడికి రేపు వైశాఖ శుద్ధ పూర్ణిమకు పదమూడు దాటి పధ్నాలుగు చొరబడు తుంది. పన్నెండోయేటనే అమ్మడు రజస్వల అయింది. ఇంకా చిన్నవయస్సు సమస్య యేముంది. అయినా మన అమ్మ చెబుతూవుండేది. నీకు గుర్తుందో లేదోగాని, నాన్న గారు రెవిన్యూయిన్‌స్పెక్టరుగా గుంటూరు బదిలీఅయినప్పుడు

అమ్మ క్రొత్తగా కాపురానికి వచ్చిందట. అమ్మకు అప్పుడు పదమూడు యేండ్లేనట కూడాను. నీకు ఆ సందేహం దేనికి? అయినా ఈవయస్సులో వివాహం చేస్తే అందమూ, చందమూ, అచ్చటా, ముచ్చటా తీరుతాయి. నీకు అంగీకారం అయితే జడ్జీగారి తో బుట్టువును నేను కదిల్చిచూస్తాను.''

రంగారావు దీర్ఘంగా నిట్టూర్చి చెల్లెలివైపు చూచి మందస్మితం చేశాడు. శాంత వివాహం ప్రస్తావన యిప్పుడప్పుడే తలపెట్టవద్దని చెల్లెలితో నిష్కర్షగా చెప్పాలని అనుకున్నాడు. కాని సంకోచించాడు. ఆమెకు యేమని సమాధానం చెప్పాలో అతను ఆలోచించసాగాడు. కొద్ది నిమిషాలు మౌనంగా గడిచాయి.

రంగనాయకమ్మ మళ్ళీ ప్రశ్నించింది. ''ఏమిటన్నయ్యా, నీ సంకోచం ?''

అతను కుర్చీలోనుండి లేచి గదిలో రెండుసార్లు అటూయిటూ పచార్లుచేసి కిటికీకి దగ్గరగా నిలబడి రంగనాయకమ్మవైపు చూడకుండానే చెప్పకు పోయాడు. ''యేమో చెల్లెమ్మా! మన శాంతకు యింతచిన్న వయస్సులో వివాహంచేయాలనే ఆలోచన నాకు యిప్పటి వరకూలేదు. తెలిసో, తెలియకో మన పూర్వులు చేసిన పొరపాట్లను, దుస్సాంప్రదాయాలను మనం అనుకరించాలనుకోవడం అనాలోచిత మనుకుంటాను. అయినా శాంత తనకు తానుగా వివాహం చేసుకోవాలనేదే నా అభిలాష. అందుకు యింకా చాలా వ్యవధివుంది. కాబట్టి ఆ ప్రస్తావన యింత

టితో కట్టిపెట్టడం మంచిదని నేను అభిప్రాయ పడుతున్నా" అనిచెప్పి రంగారావు చెల్లెలివైపు చూశాడు.

ఆమెముఖం వెలవెల బోతూంది. ఆ చూపుల్లో జీవం లేదు. మరుక్షణం ఆమె తలప్రక్కకు త్రిప్పుకుంది. కళ్ళమ్మట నీళ్ళు జలజల రాలాయి.

రంగారావు నిర్ఘాంత పోయాడు. చెల్లెలు అంతబాధ పడుతుందని అతను వూహించలేదు.

ఆమెను సమాధాన పరచేందుకు అతను మాటల కొరకు తడుముకున్నాడు. కాని అతనినోరు పెగలలేదు. రెండు నిమిషాల తరువాత అతను గుమ్మంవైపు నడిచాడు. రంగ నాయకమ్మ చీదివేసింది. అతను వెనక్కుతిరిగి చెల్లెలిదగ్గరగా కూర్చుని "యింత స్వల్పవిషయాన్నిగురించి నీవు అంత బాధపడటం భావ్యం కాదనుకుంటాను చెల్లెమ్మా! మన శాంత వివాహ విషయమూ, ఆమె భవిష్యత్తునూ గురించి మరొకప్పుడు మనం సావకాశంగా చర్చిద్దాం. శాంతపట్ల నీకు అపారమైన ఆదరాభిమానాలూ, శ్రద్ధాసక్తులూ వున్నా యనే యదార్థాన్ని యెవ్వరూ కాదనలేరు. ప్రస్తుతం ఆమె వివాహ విషయంలో నీవుచేసిన సూచనలూ, యిచ్చిన సలహాలూ త్రోసిపుచ్చాననే అపోహతో బహుశా నీవు బాధపడివుంటావు. కాని నిన్ను నొప్పింప జేయాలనే భావం నాకు యే కొశానాలేదు. ఉండదు కూడాను. సరే నేను వస్తా" అంటూ అతనులేచి గుమ్మందాటి హాలులోకి నడిచాడు.

శాంత కిటికీదగ్గరగా సోఫాలోకూర్చుని చదువుతోంది. రంగారావు ఆమెను పలుకరించాడు. "ఏమమ్మా! ఈ ఉదయాన్నే ఎక్కడికి వెళ్ళావు?"

శాంత సోఫాలోనుండి లేచి నిలబడి సమాధానం చెప్పింది. "ప్రైవేటు క్లాసువుంటే వెళ్ళాను, నాన్నగారూ?"

రంగారావు ఆమెచేతిలోనున్న పుస్తకంవంక చూచాడు. డిటెక్టివ్‌నవల. అతను ముఖం చిట్లించాడు. శాంత బిత్తరపోయింది. అతను నీరసంగా నవ్వాడు. "మన లైబ్రరీలో ఇంగ్లీషు, తెలుగు నవలలు కావలసినన్నివున్నాయి. ఈ డిటెక్టివ్ చెత్త చదవడం మంచిదికాదు" అని చెప్పి అతను మేడదిగి తనగదిలోకి పోయి సిగరెట్టు ముట్టించి తాపీగా సోఫాలో చేరగిలబడి ఆలోచనలో మునిగాడు.

గంటవ్యవధిలో జరిగిన ఘటనలు, సంభాషణలు అతని మనస్సులో మెదిలాయి. కామేశ్వరి తనను తనయింట్లో యెవ్వరూ వ్యక్తిగా చూడడంలేదనేబాధ వ్యక్తం చేసింది. శాంత వివాహ విషయమై తానుచేసిన సూచనలు ఆమోదించనందుకు రంగనాయకమ్మ ఖేదపడింది. ఈ పరిణామాలకు కారకులెవ్వరు? ఈ పరిస్థితులలో తను యేమిచెయ్యాలి? అనే ఆలోచనలతో అతను సతమతమయ్యాడు. వేళ్ళమధ్యనున్న సిగరెట్ కొసకంటా కాలి వేలు చుర్రుమంది. మరో సిగరెట్ ముట్టించాడు.

## ప్రకరణ 3

చవకబారు పుస్తకాలమీదికి దృష్టిని పోనీయవద్దని ఒకటి రెండుసార్లు తండ్రి తనను మందలించడం శాంతకు గుర్తు లేకపోలేదు. లోగడ చదివిన సీరియల్ నవల మూడవ పార్టు వస్తే తన స్నేహితురాలి దగ్గిర అది తీసికొంది. ఆదివారం విశ్రాంతిలో అది పూర్తి చేయాలనే అభిలాషతో ఆమె కాలేజీనుండి రాగానే అది చదవడంలో లీనమయింది. అది కాస్తా తండ్రి కంటబడింది. తండ్రిపట్ల ఆమెకు అపారమైన భక్తిగౌరవా లున్నాయి. ఆయన ఆజ్ఞలను, సలహాలను తు చ తప్పక పాటించాలని ఆమె అభిమతం. కాని పొరపాటు జరిగింది. "ఇకముందు ఎప్పుడూ ఈ చెత్తపుస్తకాల జోలికి పోకూడదు" అనుకుంది ఆమె. అయినా చేతిలోనున్న పుస్తకం త్వర త్వరగా చదివి రచయిత కథ ఎలా ముగించాడో తెలుసుకోవాలనే అభిలాష కూడా వుంది. కాని ఆమె మరల పుస్తకం తెరవకముందే గదిగుమ్మంలో రంగనాయకమ్మ కంఠం విన్పించింది. "యేమిటే అమ్మడూ! నాన్నగారు యేదో గట్టిగా మందలించి నట్లున్నారు?"

అత్తయ్యవంక చూస్తూ శాంత గతాన్ని మరచిపోయి కిలకిలా నవ్వింది. అత్తయ్యంటే ఆమెకు ఎంతో చనువు. ఆ యింట్లో తనను అందరూ అతి గారాబంతో చూస్తారు.

కాని అత్తయ్యదగ్గర మాత్రమే తన అల్లరి, మారాలు నిరాటంకంగా సాగుతాయి. శాంత సరాసరి అత్తయ్య ముందుకు వురికి తన రెండుచేతులతో ఆమె కంఠాన్ని పెన వేసుకుంది.

రంగనాయకమ్మ అతి కష్టంమీద శాంత చేతులు విడిపించుకొని "నే నడిగిన ప్రశ్నకు సమాధానం చెప్ప వేమిటే!" అంది.

శాంత మరల కిలకిలా నవ్వుతూ "ఓహో అదా! ఇదిగో యిందుకు" అంటూ తన చేతిలోనున్న పుస్తకం తిప్పి టైటిలుపేజీ రంగనాయకమ్మ కళ్ళముందు పెట్టింది.

రంగనాయకమ్మ విస్తుపోయి చూచింది "అదేమిటే? 'నాన్నగారు కోప్పడినట్లున్నారు దేనికే తల్లీ' అంటే, ఆ పుస్తకం తెచ్చి నా కళ్ళముందు పెడతావు దేనికి?" అని ప్రశ్నించింది.

"అవునత్తయ్యా! ఈ పుస్తకం చూశావుగా!"

"ఏం పాడు పుస్తకమోలే!"

"అలా అంటేకాదు. ఇదేమిటో చదువు"

"హంతకు లెవరు! అయితే!"

"యిలాటి పుస్తకాలు చదవ గూడదని నాన్నగారి అభిప్రాయం"

"మరి దేనికి ఆ పాడుపుస్తకాలు చదవటం?

"మొదటి రెండు భాగాలూ లోగడ చదివా నత్తయ్యా! ఇదికూడ చదువుదామని నా స్నేహితురాలిదగ్గర తెచ్చాను"

"ఏముంటుందీ ఆ చెత్తపుస్తకాలలో? 'గదిలో శవం' 'దొడ్లోశవం' 'పెట్టెలో శవం' ఈ ప్రపంచం అంతా హత్యల తోనూ, శవాలతోనూ వుాగులాడుతున్నట్లు వెధవ రాతలూ, వెధవపుస్తకాలూనూ. ఆ రాసేవాళ్ళకూ మతిలేదు, ఈ చదివేవాళ్ళ కంతకంటే మతిలేదు. ఏమికాలమో, ఏమి చదువులో! అదిసరేగాని నే నొకమాట... ..."

శాంత నవ్వుతూ మధ్య అడ్డుతగిలి "అత్తయ్యా, నువ్వు ప్లాట్‌ఫారం యెక్కితే చక్కగా ఉపన్యసించ గలుగుతా వనుకుంటాను!" అంది.

రంగనాయకమ్మ చిన్నగా నవ్వుకుంది. "అయ్యో నాపిచ్చితల్లీ! అలాంటి తెలివితక్కువ వూహ నీ కెలా కలిగిందమ్మా!

"నాకు కలగటం కాదు అత్తయ్యా! మా స్నేహితు రాలు వనజ లేదూ? వాళ్ళ పెద్దమ్మ విరూపాక్షమ్మగారు వుందే, ఆమెగారు అంది 'మీఅత్తయ్య అనర్గళంగా మాట్లాడు తుంది అమ్మాయీ!' అని"

"నా అనర్గళ వాగ్ధాటి ఆమె యెప్పుడు విన్నదట?"

"ఆమధ్య స్వామి శంకరాచార్యులవారు వచ్చినపుడు జరిగిన వేదాంత గోష్టిలో నీవు అరగంటసేపు అనర్గళంగా మాట్లాడావటగా?"

రంగనాయకమ్మ మందస్మితం చేసింది. ఆమె లోలోపల గర్వపడింది. శాంత అమాంతం అత్తయ్యమీద వాలి ఆమెను కౌగలించుకుని ఉక్కిరి, బిక్కిరి చేసింది. రంగనాయకమ్మ చికాకు అభినయిస్తూ "అయ్యో తల్లీ,

వుండవే!" అంటూ బలవంతంమీద శాంతచేతులను విడదీసింది. అయినా శాంత వదలిపెట్టలేదు.

అత్తయ్య రెండుభుజాలమీద చేతులువేసి సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ "అత్తయ్యా! యింకో విషయం చెప్పనా!"

"అయ్యో తల్లీ, చెప్పరాదు ఓ !

"ఆ విరూపాక్షమ్మగారే యింకా యేమందో తెలుసునా?"

"నీవు చెప్పితేగా నాకు తెలియడానికి?"

"నావి సాక్షాత్తూ మేనత్త పోలికలేనట!"

"అయితే కానీయి"

"ఏమో అత్తయ్యా! నేను నీ అంత అందగా వున్నానా అని."

"నా అందం తగులబడిందిలే?"

"అదేమిటి అత్తయ్యా! నీకళ్ళు చూచుకో యెంత అందంగా వున్నయో కలువరేకుల్లా!" అంటూ శాంత రంగనాయకమ్మను నిలువుటద్దం ముందుకు తోసింది. కాని రంగనాయకమ్మ అద్దంలో తన ప్రతిబింబం చూచుకుందుకు సాహసించలేదు. ప్రక్కకు తప్పుకుంది. కాని శాంత వదలిపెట్టలేదు. బలవంతంగా కవుగలించుకొని ఆమెను అద్దం వైపుకు తిప్పి నిలబెట్టింది. రంగనాయకమ్మకు చక్కిలిగింతలు పెట్టినట్లయింది. ఆమె అద్దంలోకిచూస్తూ నవ్వింది.

"అత్తయ్యా! నీవు నవ్వుతూ వుంటే నీ పలువరస యెలా వుందో చూచుకున్నావా?"

"యెలా వుందంటావు?"

"మంచిముత్యాల కూర్పులా"

రంగనాయకమ్మ పెదవులుబిగించి కొంగుతో మూతి తుడుచుకుంది. "యేమోనమ్మా, ఈ మధ్య మరీ ఆకతాయివి అయిపోతున్నావు." అంటూ ఆమె ప్రక్కకు తప్పుకో చూసింది. కాని శాంత ఆమెను అమాంతం కౌగలించుకొని నుదుటిమీద ముద్దుపెట్టుకుంది. రంగనాయకమ్మ చికాకు అభినయిస్తూ "యివేమి పాడుబుద్ధులే తల్లీ! యింకా చిన్న పిల్లవటే?" అంటూ శాంతను విడిపించుకొని దూరంగా నిలబడింది.

శాంత బుంగమూతిపెట్టి "చిన్నపిల్లను కాక పద మూడేళ్ళకే పెద్దదాన్ని అయిపోయానా ఏమ్మా!"

"అబ్బే లేదు, పసిపాపవు. యుక్తవయస్సు వచ్చినా వెకిలిచేష్టలు మానావుకావు."

శాంత చిన్నబుచ్చుకుంది. "అయితే ఈ రోజునుండీ నీదగ్గరకు రానులే అత్తయ్యా!"

రంగనాయకమ్మ మందస్మితం చేసింది.

"అయ్యో నా తల్లీ! ఈ మాత్రం భాగ్యానికే అంత కోపమైతే యెలాగే చచ్చేదీ నీతో?"

శాంత మాట్లాడలేదు. రంగనాయకమ్మ ప్రశ్నించింది. "అమ్మడూ! నిన్ను ఒకవిషయం అడగాలని వుంది. సమాధానం చెపుతావా?"

శాంత పెదవులు బిగించి, నొసలు చిట్లించింది. "అత్తయ్యా, ఈ రోజున నీ మాటలు వింతగా వున్నాయి"

రంగనాయకమ్మ నాలుక కరుచుకొంది. "ఎందుచేత నమ్మా?"

"ఇంతకుపూర్వం ఎన్నడైనా నన్ను ఈ విధంగా ప్రశ్నించావా?"

"సమయం వచ్చింది గనుక అడుగుదా మను కుంటున్నా!"

"అడుగు?"

రంగనాయకమ్మ తటపటాయించింది. శాంత చిరు నవ్వుతో హెచ్చరించింది.

"అమ్మడూ! ప్రక్కవీధి ఆ పెద్దమేడలో జడ్జీగారు వుంటున్నారు తెలుసునా?"

"ఆ తెలుసును"

"వారి అబ్బాయిని యెరుగుదువా?"

"యే అబ్బాయినీ?"

"నిరంజన్. మీ కాలేజీలో బి. యస్. సి. చదువు తున్నాట్ట"

"యెరుగను, కాని చూశాను"

"యెలా వుంటాడు అతను"

"పప్పు సుద్దలాగ"

రంగనాయకమ్మ తెల్లబోయింది. "అదేమిటే, పప్పు సుద్ద అంటావు? చక్కనిముక్కు, మూతి లక్షణంగా వుం టేనూ పిల్లవాడు!"

"అతను యెలావుంటే మనకెందుకు గాని, ఆ వివరాలు నీకు యిప్పుడు యెందుకు కావలసి వచ్చాయో చెపుతావా?"

"నిన్ను అతనికిచ్చి వివాహం చేయాలని..."

శాంత ఒక్కసారిగా నిర్ఘాంత పోయింది. కాని వెంటనే నవ్వేసింది. రంగనాయకమ్మ చేతులు రెండూ తన చేతులతో గట్టిగా పట్టుకొని ముందుకు లాగుతూ "ఒప్పుల కుప్పా వయ్యారిభామా తిరుగుదాం రా అత్తయ్యా! కల్యాణమే వైభోగమే మన రాముడు పెండ్లికొడు కామెనే–మన శాంతమ్మ పెండ్లికూతు రామెనే" అంటూ విరగబడి నవ్వింది.

"అత్తయ్యా, బహుబాగుంది కదూ"

"అదేమిటే, పెండ్లి అంటే నీకు అంత నవ్వులాటగా వుందీ?" అంది రంగనాయకమ్మ.

శాంత రంగనాయకమ్మ చేతులువదలి గంభీరంగా "కాకపోతే మరేమిటి అత్తయ్యా! అయినా నాకు పెండ్లేమిటీ ?"

"నీకు కాకపోతే మరి యెవరికే ?"

"నేను నిజం చెప్పనా"

"చెప్పు"

"నీకు కోపం వస్తుందేమో !"

"రాదులే"

"నీ... ...కు."

తుపాకి దెబ్బతిన్న పిట్ట చందాన రంగనాయకమ్మ చూపులు బెదరిపోయాయి. ఆమె ప్రాణం గిలగిలా కొట్టుకుంది. కుప్పలా కూలబడింది. మరుక్షణంలో ఆమె చెవులు రెండూ మూసుకుంది. "పాపం శమించుగాక" అంటూ ఆమె

లోలోన గొణుక్కుంది. పెదవులు వణికాయి. కట్టలు తెగి కన్నీరు ప్రవహించింది.

ఆ దృశ్యంచూచి శాంత కంగారుపడింది. అక్కడి నుండి పారిపోవా లనుకుంది. కాని అత్తయ్యను చూస్తుంటే ఆమెకు దుఖం పొర్లింది. అమాంతంగా ఆమె అత్తయ్య వడిలో తలదూర్చి గద్గద స్వరంతో "అత్తయ్యా, పొరపాటు చేశాను. క్షమించవూ!" అంది.

రంగనాయకమ్మ కొంగుతో కోడలి కళ్లు తుడిచింది. చెక్కిళ్ళు నిమిరి శాంత తలను తన హృదయానికి హత్తుకుంది. తరువాత కొద్దినిమిషాలు మౌనంగా గడిచాయి. మేడమెట్లమీద కామేశ్వరి కంఠం వినిపించింది. శాంత లేచి అద్దంముందు నిలబడి పౌడరుతో ముఖం తుడుచుకుంది. రంగనాయకమ్మ తన గదిలోకి పోతూ తలుపులు దగ్గరగా తోసింది.

కామేశ్వరి, ఆమె వెనుక అన్నపూర్ణ యిద్దరూ పైకి వచ్చారు. కామేశ్వరి శాంతను ప్రశ్నించింది. "అత్తయ్య యెక్కడవున్నారు?" శాంత పెదవులు బిగించి గదిలో అన్నట్టు ఆవైపుకు కళ్ళతో సౌంజ్ఞ చేసింది. కామేశ్వరి అల మారులోనున్న చదరంగం సామాన్లు తీసింది. అన్నపూర్ణ తివాసీదులిపి పరచింది. ఇద్దరూ ఆట ప్రారంభించారు.

"అమ్మా, నాకు ఆకలి అవుతూందే!" శాంత డిమాండు చేసింది. "కంచంలోపెట్టి మేడమీదకు తీసుకు రమ్మంటావా?" కామేశ్వరి ఎదురు ప్రశ్న వేసింది.

"అయితే నేను క్రిందికిపోతున్నా. యెవరైనా రండి."

కామేశ్వరి బిడ్డవంక చూస్తూ మందస్మితం చేసింది. "నాన్నగారికి యిప్పుడే కాఫీ యిచ్చివచ్చాను. నీవూ, అత్తయ్యా వెళ్ళి భోజనాలు చేయండి."

శాంత తల్లివైపు, ఆ తరువాత గదివైపు చూసింది. గది తలుపులు దగ్గరగా వేసివున్నాయి. రెండు నిమిషాల తరువాత ఆమె తలుపు తీసుకొని గదిలో ప్రవేశించింది.

రంగనాయకమ్మ చాపమీద వత్తిగిలి పరుంది. శాంత ఆమె పక్కలో కూర్చొని "అత్తయ్యా, యింకా కోపం పోలేదూ ?" సమాధానం లేదు. "భోజనం చేదాం రా అత్తయ్యా," ఉలుక లేదు, పలుక లేదు. "అయితే నేనూ యిక్కడే పరుంటాలే" అంటూ ఆమె అత్తయ్య పక్కలో పరుంది. రంగనాయకమ్మ చిన్నగా నవ్వుకుంది. కొద్ది క్షణాలు గడిచాయి.

"సరే పోదాం రా" అంటూ రంగనాయకమ్మ లేచి కూర్చుంది. శాంత ఆమెను కౌగలించుకొని "అత్తయ్యా! నీవు దయామయివి!" అంది.

◆ ◆ ◆ ◆

రంగారావు, డాక్టరు సుదర్శనం యిరువురూ సమవయస్కులు. బాల్యమిత్రులు. రంగారావు తండ్రి రెవెన్యూ ఉద్యోగి అయితే సుదర్శనం తండ్రి మిలిటరీ వుద్యోగి. ఒకరు బ్రాహ్మణులయితే రెండవవారు నాయుళ్ళు. రంగారావు శాకాహారి. శరీరపౌష్టవానికి మాంసాహారం అవసరమంటాడు

సుదర్శనం. వెంటనే రంగారావు "అయితే ప్రపంచంలోని జీవరాసు లన్నింటిలోను ఏనుగు చాలా బలంగా వుంటుంది. మరి అది మాంసాహారి కాదుగదా!" అంటాడు.

అది వితండవాద మంటాడు సుదర్శనం. ఆ యిరువురూ తమ చిన్ననాటినుండీ పాఠశాలలలోను, కళాశాలలలోను చదివే రోజుల్లో ఎన్నో విషయాలపై చర్చలు సాగించేవారు. అనేక సందర్భాలలో రంగారావుదే పై చేయిగా వుండేది.

రంగారావు కాలేజీలో లెక్చరర్‌గా చేరిన కొద్దికాలానికే సుదర్శనం డాక్టరు బోర్డు కట్టాడు. నాటినుండి రంగారావు గారి కుటుంబానికి సుదర్శనమే డాక్టరు.

రంగారావుతోపాటే సుదర్శనానికి యేనాడో వివాహ మైంది. కాని వారి దాంపత్య జీవితానికి ఆదిలోనే అవరోధాలు వాటిల్లాయి. సుదర్శనంభార్య మల్లిక రేడియో స్టేషన్లో ఆర్టిస్టు. ఆమె క్రొత్తగా కాపురానికివచ్చిన రోజుల్లో సుదర్శనంముసలితల్లి రాజమ్మ, తోబుట్టువు సుశీల అతనితోనే వుంటున్నారు. సుశీల అప్పట్లో బి. ఏ., చదువుతూంది. కొద్ది నెలలుమాత్రమే సాఫీగా గడిచాయి. మల్లిక తానే ఆ యింటికి యజమానురాలిగా వూహించుకుంది. అత్త, ఆడబిడ్డ యిద్దరూ తన అదుపు, ఆజ్ఞలలో మెలగాలని ఆమె అభిలాష. కాని సుశీల తెలివితేటలతో సమర్థించుకుంటూ మల్లిక ఆటలను సాగనివ్వలేదు. దానితో సూటీపోటీ మాటలు, నిందలు, కలతలు ప్రారంభ మయ్యాయి.

ఒక రోజు సాయంకాలం సుశీల కాలేజీనుండి వచ్చేసరికి ఇంట్లో అత్తా కోడళ్ళు పేచీపడుతున్నారు. సుశీల తల్లికి

సర్ది చెప్పింది. ఆమె సణుగుకుంటూ వంటయింట్లోకి పోయింది. తరువాత సుశీల తల్లిదగ్గర కూర్చుని సమాచారమంతా తెలుసుకుంది.

రాజమ్మ మామూలుగా సాయంకాలం అందరికీ టీ పెట్టి కోడలికికూడ ఒకగ్లాసు టీ మేడమీదికి పంపించింది. కాని మల్లిక తనకు టీ వద్దని తిప్పిపంపింది. నౌకరును హోటలుకుపోయి కాఫీ తీసుకురమ్మని ఫ్లాస్కు, డబ్బులు యిచ్చింది. రాజమ్మ అది తెలుసుకొని మండిపడి నౌకరుకు వేరేపని పురమాయించింది. మల్లిక మేడపైనుండి నౌకరును కేకలుపెట్టింది. వాడు పలుకలేదు. ఆమె క్రిందికి దిగి వచ్చింది. ఈలోపున రాజమ్మగారు ఒక గ్లాసు కాఫీ తయారుచేసి నౌకరు చేతిలో పెట్టింది. వాడు అది మల్లికకు అందించాడు. ఆమెగ్లాసు పుచ్చుకొని నేలకేసి కొట్టింది.

నౌకరు పండ్లికిలించాడు. రాజమ్మ ఉరిమి చూసింది. ఆమె నోటివెంట మాట పెగలలేదు. రెండు నిమిషాల తరువాత తమాయించుకుని "ఈ విధంగా ప్రవర్తించినందుకు మరొకరైతే పళ్ళు రాలగొట్టేవాళ్ళు" అంది రాజమ్మ.

"పదహారుసార్లు మళ్ళీ రాలగొడతారు. నీకంటే యిక్కడ యెవ్వరూ యేమంత తీసిపోరు" మల్లిక సవాలు చేసింది.

రాజమ్మ నోరు నొక్కుకుంది. ఆమె మళ్ళీ మాట అందుకునే లోపున సుశీల యింట్లోకి వచ్చింది.

తల్లి చెప్పిన ఈ కబుర్లు విని "అమ్మా! అన్నయ్యకు ఈ విషయమంతా తెలిస్తే ఎంతగా బాధపడతాడో గదా" అంది.

అరగంట తరువాత మల్లిక ముస్తాబై చేతిసంచి వూపు కుంటూ మేడదిగింది. సుశీల ఆమెను నిలబెట్టి అడిగేసింది. "రేడియోస్టేషన్లో ఉద్యోగం వెలగబెడుతూ నెలకు ఒక వందకు పైగా సంపాదిస్తున్నాననే ధీమా ఒకవేళ నీకేమైనా వుందేమో! నీ సంపాదనతో మాకేమీ నిమిత్తంలేదు. మా నాన్నగారు యిచ్చిపోయిన ఆస్థిమీద సంవత్సరానికి పదివేలకుపైగా రాబడి వస్తూంది. మా పెద్దన్నయ్య అది అంతా అమ్మకే కేటాయించారు. ఈ యిల్లుకూడా మా అమ్మదే. మాతో కలసిమెలసి వుండదలచుకుంటే బుద్ధిగలిగి వుండాలి. మరోసారి ఈ విధంగా ప్రవర్తిస్తే మేం సహించం. నీవు యెంత మూర్ఖంగా ప్రవర్తించినా మా అన్నయ్యను చూచి ఓర్పు వహిస్తున్నాం. దానికైనా మితంవుంది." అంది ఆమె నిబ్బరంగా.

మల్లిక ఆడబిడ్డవైపు నిర్లక్ష్యంగాచూచి సమాధానం కూడా చెప్పకుండా తప్పుకుపోవాలని చూసింది. కాని సుశీల సూటిగా ఆమె కళ్ళల్లోకిచూస్తూ "కాఫీగ్లాసు నేలకేసి కొడతావా? ఏమిటి ఈ తలతిక్క వ్యవహారం?" అని ప్రశ్నించింది మళ్ళీ.

"మీ అమ్మ పెట్టే కాఫీ, టీ నాకు సహించవు" మల్లిక సమాధానం చెప్పింది.

"ఆ విషయం ముందుగా చెపితే బాగుండేదిగదా! అయినా నీవు ఆడదానివి కావా? నీకు కావలసిన కాఫీ, టీ నీవే పెట్టుకోవచ్చుగా!"

సుశీల అన్న చివరి మాటలు మల్లికకు కటువుగా తోచాయి. ఆమె ముఖం జేవురించింది. "సుశీలా! హద్దు మీరి వాగుతున్నావు. ఇక అంతటితో కట్టిపెట్టు"

"కాఫీగ్లాసు నేలకేసిబాదిన దానికంటేనా" సుశీల రెట్టించింది. "అదేవద్దని చెపుతున్నా. నీవు నాకేమీ నీతులు చెప్పనవసరంలేదు. నీ బతుకేమిటో నువ్వు చూసుకో. సినిమాలకు, పార్కులకుపోయి అర్ధరాత్రివరకు తిరిగి వస్తావు. నీవేనా నాకు నీతులు చెప్పేది?" మల్లిక ఎదురు దాడి సాగించింది.

"సినిమాలకు పోయినా, పార్కుల్లో తిరిగినా నీతి నియమాలు గలవాళ్ళు తమ జీవితాలను మలినం చేసుకోరు నీలాగ నీ అక్కలాగ."

మల్లికకు చురక వేసినట్లయింది. ఆమె సమాధానం చెప్పక పూర్వమే వాకిట్లో కారు ఆగింది. డాక్టరు సుదర్శనం స్టెతస్కోపు వూపుకుంటూ లోపల ప్రవేశించాడు. అతన్ని చూస్తూ మల్లిక, సుశీల ప్రతిమల్లా నిలబడిపోయారు.

"ఏమిటీ విశేషం" అన్నట్లు అతను మల్లికవైపు, సుశీలవైపు చూశాడు. మల్లిక బలవంతంగా మందహాసం చేసింది. "ఏమీలేదు అన్నయ్యా!" అంది సుశీల.

"యేమోయ్, రేడియో స్టేషను కేనా బయలుదేరుతా? కారులో తీసుకెళ్ళి దిగబెడతాలే!" అన్నాడతను భార్య వైపు చూస్తూ. మల్లిక మాట్లాడలేదు.

"టీ తీసుకువస్తాను, అన్నయ్యా!" అంది సుశీల. అతను మళ్ళీ భార్యవైపు చూశాడు.

"నాకు ఈ రోజున ప్రోగ్రాంలేదు. బయటికి పోవాలనుకుంటున్నా" మల్లిక సమాధానం చెప్పింది.

"ఎక్కడికీ?"

"మా కో-ఆర్టిస్టు శారదగారింటికి"

"అయితే నాలుగునిమిషాలు ఆగు. నేనూ, సుశీలా పిక్చరుకు పోతాం. నిన్ను మీ స్నేహితురాలి యింటిముందు దిగబెడతాను." అన్నాడు సుదర్శనం.

మల్లిక ముఖం ధుమధుమలాడింది. "అవసరం లేదు. నేను రిక్షాలో పోతానులెండి." అంటూ ఆమె గుమ్మం దాటి బయటికి నడిచింది.

"సుశీ, బట్టలుమార్చుకో. పిక్చరుకు పోదాం" అన్నాడు అతను చెల్లెలివైపు చూస్తూ.

"యేం పిక్చ రన్నయ్యా!"

"అదేదో యింగ్లీషు పిక్చరులే"

రాజమ్మగారు ఒకప్లేటులో పకోడీలు, మంచినీళ్ళ గ్లాసు తెచ్చి బల్లమీద పెట్టింది.

సుదర్శనం స్టెతస్కోపు బీరువాలో పెట్టి బేసిన్‌లో చేతులుకడిగి కుర్చీలో చతికిలబడి ఆయాసంతో "యిస్సో" అన్నాడు.

"యేమిరా, నాయనా! నీరసంగా వున్నట్లున్నావు ?" కొడుకు వంక పరీక్షగాచూస్తూ రాజమ్మ ప్రశ్నించింది.

సుదర్శనం పకోడీలు తింటూ "అమ్మా! పకోడీలు చాలా బాగున్నాయి. జీడిపప్పు జోరుగా కలిపినట్టున్నావు" అన్నాడు.

"యేమో నాయనా! నేను చేసేపదార్థాలు నీకు రుచిగానే వుంటాయి. కాని మీ ఆవిడకు మాత్రం సహించవురా!"

"పోనీ, తినడం మానేస్తుంది. కాని మీరుమాత్రం ఆవిడ విషయంలో ఏమీ కల్పించుకోవద్దు అమ్మా!"

"యేమి కల్పిచుకోవడమురా నాయనా! మన ప్రారబ్ధం కాలిపోయింది. ఇంతముందు జరిగిన రభస విన్నావా ?"

"యేమిటీ ?" అన్నట్లు అతను చెల్లెలివైపు, తల్లివైపు చూశాడు.

సుశీల నోరునొక్కుకుంటూ చెప్పవద్దన్నట్లుగా తల్లిని అదమాయించింది.

పూసగుచ్చినట్లు రాజమ్మ అంతా చెప్పేసింది.

సుదర్శనం మందస్మితం చేశాడు. "ఈవిడ సంగతి నాకు ప్రారంభంలోనే, అంటే వివాహం అయిన తరువాత

వాళ్ళ యింటి దగ్గర వున్న కొద్ది దినాలకే తెలిసింది. జీవితం అంటే యేమిటో ఆవిడకు తెలియదు. అందుకే పది మందిలోనూ కలసిమెలసి తిరుగుతూంటే యేమైనా మార్పు వస్తుందేమోననే అభిప్రాయంతో ఆ రేడియో స్టేషను ఉద్యోగంలో ప్రవేశపెట్టాను" అన్నాడు సుదర్శనం.

*   *   *

మల్లిక కన్నవారిది గుంటూరు. తండ్రి రామారావు నాయుడు రిటైర్డు డిప్యూటీ కలెక్టరు. రామారావుగారికి లేకలేక కలిగిన సంతానం యిరువురూ ఆడపిల్లలే. పెద్దమ్మాయి మంజరి తరువాత రెండుసంవత్సరాలకు మల్లిక పుట్టింది. రెండో కాన్పు తప్పనిసరిగా మగబిడ్డేనని రామారావు దంపతులకు గాఢనమ్మకం. కాని మల్లిక పుట్టుకతో వారి వూహలు తల్లక్రిందు లయ్యాయి. ఆ తరువాత మరి సంతానమే లేదు. పోతే రామారావు దంపతులు మల్లికకు మల్లికార్జునరావు పేరుపెట్టి "బాబూ" అని పిలచుకునేవారు. పది సంవత్సరాల వయస్సువరకు మల్లిక బాబుగానే చలామణీ అయింది. నిక్కరు, చొక్కా, చిన్నకాఫు. యెక్కువగా మగపిల్లలతోనే కలసిమెలసి వుండేది. అసలు మల్లికను ఆడపిల్లల స్కూలులోగాక మగపిల్లల స్కూలులోనే చేర్చారు. పది సంవత్సరాల తర్వాతగాని ఆమెను ఆడపిల్లల స్కూలుకు మార్చలేదు. ఆరోజున అక్కడి పంతుళ్ళు, పిల్లలు యెంతో ఆశ్చర్యపోయారు. ఒక పంతులు అన్నాడు కూడాను. "అరె! ఈ అబ్బాయి రెండు సంవత్సరాలు నా క్లాసులో

వుంటే, అమ్మాయి అనే అనుమానం నాకు యేమాత్రం కలుగలేదు సుమండీ!" అని.

మంజరికంటే మల్లిక ఆటపాటలలో, చదువు సంధ్యల్లో పై చేయిగా వుండేది. యస్. యస్. యల్. సి. నుండి బి. ఏ., వరకు యిద్దరూ కలిసే చదివారు. వీణ, వైలిన్ వాయిద్యాల్లో ప్రావీణ్యత సంపాదించారు. ఇద్దరికీ ఒకే లగ్నాన వివాహాలు జరిగాయి. మంజరిభర్త యింజనీరు. మల్లికభర్త డాక్టరు. కాని సంవత్సరమైనా తిరగకముందే మంజరి భర్తకు విడాకు లిచ్చింది. అక్కస్థితికి మల్లిక జాలి పడేది. అయినా ఆమె తన అత్త ఆడబిడ్డలతో కలసి మెలసి వుండలేక పోయింది.

◆ ◆ ◆ ◆

మల్లిక రిక్షాలో స్నేహితురాలి దగ్గరకుపోతూ ఆలోచనలో పడింది. సుశీల తనను, తన అక్కనుగురించి అన్న వాక్యం ఆమె గుండెల్లో శూలంలా బాధిస్తూంది.

"బావకి వేరొక స్త్రీతో సంబంధంవుంది. అలాంటప్పుడు అక్క బావకు విడాకు లివ్వడంలో ఆక్షేపణేముంది? అయినా ఆమాత్రానికి అక్కకు నైతిక విలువలు లేవని అనడానికి యీ సుశీల యెవతె? త్వరలో దీని గర్వాం అణచాలి. లేకపోతే నేను మల్లికనే కాదు" అనుకుందామె.

గ్లాసు పగులగొట్టిన వుదంతం తనకేమీ తెలియనట్లే ప్రవర్తించాడు సుదర్శనం. మల్లికకూడా అతనికి సన్నిహితంగా మెలగుతూ వచ్చింది. "బహుశా మల్లిక పశ్చాత్తాప

పడి వుంటుంది.” అనుకున్నాడు సుదర్శనం. కొద్దిదినాలు మాత్రం గడిచాయి.

ఒకరోజు రాత్రి మల్లిక సుదర్శనంతో వేరేకాపురం పెడదామనీ, అందుకు కావలసినడబ్బు వగైరా తనపుట్టింటి నుండి తీసుకువస్తాననీ సూచించింది.

“డబ్బులేక వేరుకాపురం పెట్టలేదని అభిప్రాయ పడుతున్నావా?” అడిగాడు సుదర్శనం.

“మరి దేనికీ? అయినా వీళ్ళతో ఎంతకాలమని కలసి వుంటారు?”

“సుశీల వివాహం జరిగేంతవరకు”

“ఎప్పుడు జరుగుతుంది ఆ వివాహం?”

“కలసి వచ్చినప్పుడు”

“మనం వేరుగావుంటే మీ చెల్లెలి వివాహం జరుగదని సందేహమా?”

“సందేహమంటూ యేమీలేదు. కాకపోతే అన్నయ్యా, వారి కుటుంబము చాలాకాలంగా వాల్తేరులో వుంటున్నారు. అమ్మ, సుశీల, నేను యిక్కడ వుండిపోయాం. ప్రస్తుతం నేను ప్రాక్టీసు పెట్టాను. సుశీల యింకా చదువుతూంది. ఆమెపెండ్లికి కావలసిన యేర్పాట్లు అన్నీ అన్నయ్యే చూస్తారు. అయినా యిక్కడ ఆమెకు గార్డియన్ను నేనే. అందుచేత ఆ వివాహం జరిగేవరకు మనం వేరుగా వుండే ప్రసక్తిలేదు.” నిష్కర్షగా చెప్పేశాడు సుదర్శనం.

రెండునిమిషాలు మౌనంగా గడిచాయి. మల్లిక అందుకుంది. "మీవాళ్ళమీద అభిమానంకొద్దీ నన్ను చులకనచేసి కించపరుస్తున్నారు."

సుదర్శనం మందస్మితం చేశాడు. "మల్లికా! అదంతా నీ అనుమానం నిన్ను చులకన చేయడంగాని, కించపరచడంగాని అంతకు ముందెన్నడూ జరుగలేదు. నీవు కాఫీగ్లాసు నేలకేసి కొట్టినా ఎంతో ఓర్పుతో సహించి వూరుకున్నారు మావాళ్ళు. ఆ విషయంనాకు తెలిసికూడా మాటవరుసకైనా నిన్ను మందలించలేదు. అయినా లేనిపోని యీ ఆరోపణలు యెందుకో నాకు బోధపడ్డంలేదు."

"అవును మీకు బోధపడవు. మీరు నన్ను వివాహం చేసుకున్నది నాతోకలిసి కాపురంపెట్టడానికా, లేక మీ అమ్మా, చెల్లెళ్ళపంచన పడివుండడానికా? చెప్పండి." అంటూ నిలదీసి అడిగింది.

"మన వివాహంజరిగి యింకా రెండుసంవత్సరాలైనా గడువలేదు మల్లికా! సుశీల వివాహం అయిన తరువాత మనం వేరేవుందాం. నీకు ఓర్పు అంటూవుంటే కొద్దికాలం ఓపికపట్టు. తొందరపాటు మంచిదికాదు." అన్నాడు సుదర్శనం ముక్తసరిగా.

"నాకు అంత ఓపికలేదు. మీ అమ్మకు, చెల్లెలికి లొంగి ఇక్కడ పడివుండవలసిన అగత్యం నాకు అంతకంటే లేదు. రేపటినుండీ మీరు వేరుకాపురం పెట్టకపోతే నేను మా అమ్మా - నాన్న గార్ల దగ్గరకు వెళ్ళిపోతాను"

"నీ యిష్టం. అయినా బాగా ఆలోచించుకో"

"ఆలోచించే చెపుతున్నా"

తరువాత మాటలులేవు. సుదర్శనం దుప్పటి ముసుగు పెట్టాడు. మరుసటి వుదయం మల్లిక పెట్టె సర్దుకుని ప్రయాణమై వెళ్ళిపోయింది. ఆ వేసవిలో సుశీల వివాహం జరిగింది. సుదర్శనం మామగారికి, భార్యకు పెండ్లికి రమ్మని జాబులు వ్రాసి ఆహ్వానాలు పంపాడు. కాని వారినుండి సమాధానం లేదు. వివాహానికి కూడా యెవ్వరూ రాలేదు.

సంవత్సరాలు గడిచాయి. సుదర్శనం యేకాకి జీవితానికి అలవాటు పడ్డాడు.

# ప్రకరణ 4

రంగారావు భోజనంచేసి కాలేజీకి వెళ్ళాడు. శాంత యన్. సి. సి. పెరేడ్‌కువెళ్ళి యింకా తిరిగిరాలేదు. కామేశ్వరి, అన్నపూర్ణ భోజనాలు ముగించుకొని ఉన్ని జుబ్బాలు అల్లుతూ హాలులో కూర్చున్నారు. రంగనాయకమ్మ శాంత కొరకు నిరీక్షిస్తూ పోర్టికోలో నిలబడింది.

అరగంట గడిచింది. ఎన్నో రిక్షాలు వచ్చి పోతున్నాయి. శాంత జాడలేదు. "పన్నెండు కావస్తూంది. ఇది యింకా రాలేదేమి చెప్మా!" అని తనలో అనుకుంది రంగనాయకమ్మ. ఆమెకు విసుగు తోచింది. వరండాలోనున్న ఒక పడకకుర్చీ పోర్టికోలోకి లాగి దానిలో వాలింది.

లోపల కామేశ్వరి, అన్నపూర్ణ కబుర్లు సాగించారు. రంగనాయకమ్మ అవి ఆలకిస్తూ ధ్యాస అటు మరల్చింది.

"డాక్టరు సుదర్శనంగారి చెల్లెలు సుశీలకు యీ మధ్య బాగా జబ్బు చేసిందట. ఒకసారి పోయి చూచివద్దామా అక్కా!" అంటూంది అన్నపూర్ణ.

"పురిటిస్నానంరోజున పోదాములే" కామేశ్వరి సమాధానం చెప్పింది.

"పాపం కాన్పు వచ్చినప్పుడల్లా ఆమెకు చావు బ్రతుకుల సమస్యే! అయినా యిప్పటికి రెండుకాన్పులయ్యాయిగదా, ఈ మూడో దానికైనా వాళ్ళు జాగ్రత్తపడి వుండవలసింది అక్కా!"

"ఏమోనే అన్నపూర్ణా! సృష్టిని అరికట్టే యీ నిరోధాలు, గర్భస్రావాలు హత్యలతో సమాన మను కుంటాను. అయినా సుశీల విషయం వేరనుకో! ఈ బిడ్డతో యిద్దరు కొడుకులు, ఒక కూతురు అయ్యారు. ఇక జాగ్రత్త పడతారేమోలే!"

అన్నపూర్ణ సంభాషణ మార్చింది. "అక్కా, డాక్టరుగారి భార్య యిక రానట్టేనా?"

"రా దలచుకుంటే యిన్ని సంవత్సరాలు ఎడంగా ఎందుకుంటుంది?"

"వాళ్ళిద్దరిమధ్యా కలత లెందుకు వచ్చాయి అక్కా?"

"యేమో, పెద్ద కారణాలేమీ లేవంటారు!"

"ఆవిడను నేను చూడలేదు. ఎలా వుంటుంది అక్కా"

"ఎవరూ, మల్లికేనా! కొంచెం బొద్దుగా వుంటుంది. అందవికారం మాత్రం కాదు. బాగా చదువుకున్నది. సంపన్నుల ఇంటి బిడ్డ."

గేటుముందు రిక్షా ఆగింది. రంగనాయకమ్మ లేచి నిలబడింది. శాంత యన్. సి. సి. యూనిఫారంలో రిక్షాదిగి రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేసింది. గేటు తెరిచి లోపలకు వస్తూ పోర్టికోలో నిలబడివున్న అత్తయ్యను చూసింది. "హల్లో ఆంటీ!" అని పలుకరించి బూట్లు టకటక కొడుతూ లెఫ్ట్-రైట్, లెఫ్ట్-రైట్, అటెన్షన్ చెప్పుకుని రంగనాయ కమ్మకు శాల్యూట్ చేసింది.

రంగనాయకమ్మ ముసిముసి నవ్వుల్తో "ఇదెక్కడి పాడుమేళామే తల్లీ? రెండుఝాములు దాటిందిగదా, ఆకలి వేయడంలేదూ!"

"ఆకలికేమొచ్చెలే అత్తయ్యా! ఈ డ్రస్సుగాని నువ్వువేసుకుంటే మా సార్జెంటుకంటే దర్జాగా వుంటావు" అంటూ శాంత నెత్తిమీదవున్న యన్. సి. సి. టోపీతీసి రంగనాయకమ్మ తలకు తగిలించింది.

రంగనాయకమ్మ టోపీ తీసేసేందుకు పెనుగులాడింది. కాని శాంత ఆమెను వెనుకనుండి గట్టిగా వాటేసుకుని హాలులోకి తోసి అద్దంముందు నిలబెట్టింది. ఆ దృశ్యం చూస్తూ కామేశ్వరి నిర్ఘాంతపోయి సోఫాలోనుండి లేచి నిలబడింది. అన్నపూర్ణ నవ్వు ఆపుకోలేక చేతిలోవున్న ఊలుజుబ్బా బల్లమీదపెట్టి వంటయింట్లోకి పోయింది.

"శాంతా! హద్దు మీరిపోయావు. నీకు యింకా జ్ఞానం ఎప్పుడు వస్తుందో?" కామేశ్వరి మందలించింది.

శాంత బుంగమూతిపెట్టి రంగనాయకమ్మ కళ్ళల్లోకి చూస్తూ "అత్తయ్యా! నేను హద్దుమీరి ప్రవర్తించానా? నా మీద నీకూ కోపంగా వుందా? చెప్పవూ?" అంది.

రంగనాయకమ్మ మందస్మితం చేసింది. శాంత ఎగిరి గంతేసింది. ఆమె వుత్సాహంతో చిటికెలువేస్తూ "అత్తయ్యా! రెండు నిమిషాల్లో, నేను స్నానంచేసి బట్టలు మార్చుకువస్తాను. ఇద్దరం కలిసి భోంచేద్దాం" అంది. రంగనాయకమ్మ తల ఆడించింది.

శాంత స్నానాల గదిలోకి వెళ్ళింది. అన్నపూర్ణ వంట యింట్లోనే వుండిపోయింది.

కామేశ్వరి రంగనాయకమ్మ నుద్దేశించి "వదెనగారూ. శాంతను కాస్త అదుపాజ్ఞల్లో వుంచాలి. మీరు ఈ మధ్య దానికి చనువు మరీ యెక్కువ యిస్తున్నట్లున్నారు" అంది.

రంగనాయకమ్మ పెదవి విరిచింది. కామేశ్వరివైపు చూడకుండానే "అదుపాజ్ఞలుమీరి అదిచేసిన కానిపను లేమిటమ్మా?" అని ప్రశ్నించింది.

కామేశ్వరి నాలుక కరచుకొంది. చేతిలోవున్న పూలు జుబ్బా మడిచి బీరువాలో పెట్టింది. రంగనాయకమ్మ గుమ్మంలో నిలబడి తనవైపు చూస్తూంది. ఆమె మాటల కోసం తడుముకుంటూ "నా అభిప్రాయం అదికాదు వదెన గారూ! శాంతకు మనం చనువు యెక్కువ యిస్తున్నామనీ, అది తగ్గించి అప్పుడప్పుడూ కాస్త అదమాయించడం మంచి దనీ నా ఉద్దేశ్యం" అంది ఆమె. రంగనాయకమ్మ ఆమె వైపు తీవ్రంగా చూసింది. చూపుల్లో నిర్లక్ష్యభావం వ్యక్త మవుతూవుంది. ఆమెనుండి మళ్ళీ ఏమి సమాధానం వస్తుం దోనని కామేశ్వరి భయపడిపోయింది.

రంగనాయకమ్మ చెప్పుకుపోయింది. "ఓహో! అదా విషయం! అయినా నేను చెప్పేదికూడా కాస్త విని బాగా ఆలోచించుకోవమ్మా! శాంత మన రక్తస్పర్శ. మనబిడ్డలకు మనం చనువుయిచ్చినా, నెత్తినపెట్టుకున్నా ఆక్షేపణేమీ లేదు. కాని, ముక్కూ, మొహమూ తెలియని ఆ వంటా

విడతో యిరవైనాలుగుగంటలూ గుసగుసలు, సరస సల్లాపాలు చూచినవాళ్ళు యేమనుకుంటారో అని అయినా నీకు లక్ష్యం వుందటావా!"

కామేశ్వరి బిత్తరపోయి చూచింది. అన్నపూర్ణ ప్రస్తావన వచ్చినప్పుడల్లా యేదో పుల్లవిరుపుగా మాట్లాడటం రంగనాయకమ్మకు మామూలే. కాని యింత కటువైన మాటలు తనమీదకూడా విసురుతుందని ఆమె వూహించ లేదు. రంగనాయకమ్మకు తిరిగి సమాధానం చెప్పేధైర్యం ఆమెకు లేదు. అయినా తనలో అనుకుంది "నా యింట్లో నా కా మాత్రం స్వతంత్రంలేదా? మధ్యలో ఈవిడగారి నిష్ఠూరాలు దేనికి?"

శాంత తలుపుతోసుకుని లోపలికివస్తూ "అత్తయ్యా, రెడీ!" అంది.

తల్లీ, మేనత్తా యిరువురూ శాంతవైపు చూశారు. ఆమె లేతనారింజరంగు శిల్కుచీర కట్టి, తెల్లసిల్కు బ్లౌజు వేసుకుంది. తువాలుతో తల తుడుచుకుంటూ రంగనాయకమ్మ ముందుకువచ్చి నిలబడింది.

"అదేమిటే అమ్మడూ! యిప్పుడు తలారా స్నానం చేశావా?"

"పెరేడ్‌లో చెమటపట్టింది అత్తయ్యా!"

"అయితే తలఅంటేవాళ్ళాం గదా!"

"షాంపూ పెట్టేను, శుభ్రంగా వుంది"

శాంత చేతిలోని తువాలు రంగనాయకమ్మ తీసుకొని ఆమె తలఅంతా వత్తి తుడిచింది.

శాంత తల్లివైపుచూచి "అమ్మా! ఆకలే, అన్నం పెట్టవూ ?" అంది.

"అత్తయ్య నీకోసం ఎదురుచూస్తూ యింకా భోజనం చెయ్యలేదు. అన్నపూర్ణ వంటయింట్లోనే వుంది. మీ రిద్దరూ వంటయింట్లో కూర్చుంటారో లేక డైనింగుహాలులో కూర్చుంటారో చెబితే తీసుకొచ్చి పెడుతుంది" అంది కామేశ్వరి.

రంగనాయకమ్మ ప్రశ్నార్థకంగా శాంత కళ్ళల్లోకి చూసింది "సరే! వంటింట్లోనే తింటాంలే" అంటూ శాంత, రంగనాయకమ్మ భుజాలమీద చేతులువేసి వంటింటివైపు నడిచింది. అన్నపూర్ణ అన్నీ అమర్చి బయటికి వెళ్ళిపోయింది.

భోజనాల దగ్గర శాంత చదువు ప్రస్తావన వచ్చింది. "అత్తయ్యా! మా పరీక్షలు దగ్గరపడుతున్నాయి. బాగా చదవాలి"

"చదువుతూనే వున్నావుగదుటే!"

"క్లాసు వస్తుందో రాదో అని భయంగా వుంది అత్తయ్యా !"

"క్లాసు సంపాదించి ఏమిచేస్తావే ?"

"యం. బి. బి. యస్. చదువుతాను"

"సీ యం. బి. బి. యస్. బండలుగాను! అది మెందుకే తల్లీ, నానా కల్మషమూ! రాత్రిఅనక పగలుఅనక అందరికీ చాకిరీ చెయ్యాలి. లక్షణంగా బి. యస్. సి. చదువుకోరాదూ!"

"అదేమి టత్తయ్యా! నువ్వుకూడా అలా మాట్లాడతావు? మానవసేవే మాధవసేవ అన్నారుగా పెద్దలు!"

రంగనాయకమ్మ కళ్ళు పెద్దవిచేసి "అమ్మడూ! నువ్వు యీ మధ్య పెద్దకబుర్లు నేర్చినట్లున్నావే?"

"అవునత్తయ్యా! పెద్దలమధ్య తిరిగేప్పుడు పెద్దకబుర్లు గాక చిన్న కబుర్లు ఎలా అలవడతాయి?"

"అది సరేగాని అమ్మడూ! నువ్వు యం. బి. బి. యస్. ఎక్కడ చదవాలనుకుంటున్నావు?"

"యేమో అత్తయ్యా! అసలు క్లాసు రావాలిగా! వచ్చినా సీటు యెక్కడ దొరుకుతుందో!"

"సీటు దొరకడమేమిలే, డబ్బుకడితే సీటు యిస్తున్నారటగా!"

"ఇస్తున్నారనుకో, డబ్బు కట్టవలసివస్తే నాన్నగారు ఏమంటారో?"

"నాన్నగారు అనేదేమిటమ్మా? మొన్ననే మీ అమ్మగారిద్దయనుగా నీపేర పాతికవేలు బ్యాంకులో జమ కట్టించాను"

"హమ్మయ్యో, పాతికవేలే! ఎందుకు అత్తయ్యా అంతపెద్దమొత్తం?"

"నీ చదువులకీ, పెండ్లికీ"

భోజనాలు ముగించి యిద్దరూ మేడమీదికి బయలుదేరారు. మెట్లు ఎక్కుతుండగా అన్నపూర్ణ పిలిచింది.

"శాంతా! అమ్మ నిన్ను ఒకసారి వచ్చివెళ్ళమంటున్నారు"

"ఎందుకో అడుగు"

"ఎందు కేమిటే! అమ్మ పిలుస్తూందని చెబితే ఒకసారి వెళ్ళిరాకూడదూ!" రంగనాయకమ్మ మందలించింది.

శాంత చరచరా మెట్లుదిగి తల్లివున్న గదిలోకి వెళ్ళింది. కామేశ్వరి మంచంమీద ఒకప్రక్కకు తిరిగి పడుకొని వుంది.

శాంత తల్లిప్రక్కలో కూర్చొని "యేమ్మా! అలా పడుకున్నావేం?" అంది.

"వట్టినే! ఏమీ లేదులే"

"నన్ను పిలిపించావు ఎందుకూ?"

"కుట్టుపనివాడు వచ్చాడు; పావడాలు, బ్లౌజులు కొలతలు తీసుకుంటాడు."

"నాకు పావడాలు వద్దమ్మా! నేను యిక చీరెలు మాత్రమే కట్టుకోవా లనుకుంటున్నా"

"అదేమిటే? నిన్ననేగా వందరూపాయలుపెట్టి బట్టలు తెప్పించింది"

"ఎవరు తెప్పించ మన్నారు?"

"నాదేముందమ్మా! మీ అత్తయ్యే తెప్పించారు."

"చాలా మంచిరకాలు శాంతా! యేం చక్కగా వున్నాయి!" అన్నపూర్ణ అంది. ఆమెకళ్ళు తేలి ఆడాయి.

"అయినా, నాకవేమీ అక్కర్లేదు. మిషనతన్ని మా పరీక్ష లయ్యాక రమ్మనిచెప్పు." శాంత మంచందిగి అన్నపూర్ణకు ఎదురుగా నిలబడి "ఆ బట్టలలో నీకు నచ్చినవి

రెండు తీసుకొని మీ బేబీకి లంగాలు, చొక్కాలు కుట్టించు అన్నపూర్ణా!" అంది

అన్నపూర్ణ విస్తుపోయి చూచి "అది కాస్తలేదు, యింత ఖరీదుగల గుడ్డలు దానికెందుకు శాంతా!" అంది ఆమె అమాయకంగా.

"ఫరవాలేదు. నువ్వేమీ ఖరీదుపెట్టి కొనబోవడం లేదుగా! బేబీకి నేను ప్రజంటు యిచ్చాననుకో" అంటూ ఆమె మేడపైకి పోయింది.

రంగనాయకమ్మ తనగదిలో తుంగచాప పరచుకొని పరుంది. "ఇప్పుడు పడకేమిటి అత్తయ్యా?" అంటూ శాంత వెళ్ళి ఆమెపక్కలో కూర్చుంది.

"పడుకోక చేసే పనేముందే!"

"నీతో మాట్లాడాలి"

"ఏమిటా రహస్యం?"

"మనలో మనకు రహస్యా లేముంటాయి అత్తయ్యా!"

"అయితే చెప్పరాదూ?"

"హాలులోకి పోయి సోఫాలో కూచుందాం"

"నేను లేవలేనే తల్లీ!"

"అయితే నేను లేవదీస్తానులే!" అంటూ శాంత రంగనాయకమ్మ భుజాలు రెండూ పట్టుకొని లేపి కూర్చోబెట్టింది.

"నీతో చావువచ్చిందే తల్లీ!" అంటూ రంగనాయకమ్మ లేచి నిలబడింది.

శాంత ఫాన్ స్విచ్ వేసింది. యిద్దరూ సోఫాలో కూర్చున్నారు.

రంగనాయకమ్మ ప్రశ్నించింది. "అమ్మడూ, ఎందుకే మీ అమ్మ పిలుస్తా?"

"కుట్టుపనివాడికి కొలతలు యివ్వడానికి."

"మరి అప్పుడే వచ్చేశావేం?"

"నేను ఆ బట్టలు కుట్టించుకో దలచుకో లేదు"

"అయ్యో, అదేమిటే! అలా అంటావు? నిన్న దుకాణాలన్నీ తిరిగితిరిగి కొనుక్కొస్తేనూ!"

"ఇకనుండీ నేను చీరెలుమాత్రమే కట్టాలనుకుంటున్నా."

"పోనీ అలానే కట్టుకో. ఈ సారికిమాత్రం యివి కుట్టించుకో."

"వద్దు అత్తయ్యా!"

"జాకెట్లుకూడా వద్దా?"

శాంత చిన్నగా నవ్వింది. "పరీక్ష లయినతరువాత కుట్టించు కుంటాను అత్తయ్యా!"

"అయినా. అమ్మడూ! యీ వయస్సులో చీరెలేమిటే ముసలమ్మలా?"

"మొన్న నీవే అన్నావుగా అత్తయ్యా! పెద్దదాన్నయ్యాననీ, పెండ్లీడు వచ్చిందనీ!"

"అవునమ్మా! ఆ యదార్థం అవుపిస్తూనే వుంది. కాదని అనటానికి ఎవరి వశం?"

"అందుకే యికమీదట చీరలే కట్టుకుంటాను అత్తయ్యా!"

"అయితే పెండ్లికూడా చేసుకో."

"ఆ విషయమే నేను చెప్పా లనుకుంటున్నాను."

"మా అమ్మే! నా బంగారుతల్లివి గదూ! చెప్పు."

శాంత రెండునిమిషాలు తటపటాయించింది.

"మరి నీకు కోపంవస్తుందేమో అత్తయ్యా!"

"పాడుమాట లంటే కోపమూ, విచారమూ కూడా!"

"అయితే చెప్పనులే."

"పిచ్చిపిచ్చిమాటలు కట్టిపెట్టి నీ అభిప్రాయ మేమిటో బయటపెట్టు."

"నేను అసలు వివాహమే చేసుకోను."

"మళ్ళీ ఆ పాడుమాట లేమిటే!"

"నిజం అత్తయ్యా! నేనూ నీలా అవివాహితగా వుండిపోతాను."

రంగనాయకమ్మ చెవులు రెండూ మూసుకుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

నాలుగు నిమిషాలు మౌనంగా గడిచాయి. రంగ నాయకమ్మ కొంగుతో కళ్ళుతుడుచుకుంది.

"అమ్మడూ? నా కర్మ యిలా కాలిపోయింది. విధి వ్రాత తప్పించడం ఎవరి వశమమ్మా! నాతో వంతు పెట్టుకో వద్దే తల్లీ! నీకు మా అమ్మపేరు పెట్టుకున్నాను. నువ్వు

సిరిసందలతో సుఖంగా నూరేళ్ళు వర్ధిల్లాలనే నా అభిలాష. ఆ భగవంతుడు దయతలిస్తే నేనూ చూచి ఆనందిస్తాను."

శాంత ఒకటి రెండుసార్లు ఆవులించి సోఫాను చేరబడింది. రంగనాయకమ్మ లేచి తన గదిలోకిపోయి కూర్చుని భగవధ్యానంలో లీనమైంది. శాంత సోఫాలో నిద్రపోయింది.



కామేశ్వరి మంచంమీద అటూఇటూ దొర్లింది. అన్నపూర్ణ విషయంలో రంగనాయకమ్మ తన్ను కటువుగా మందలించడం సహించరానిదిగా తోచింది. ఆమె మాటలలోగాని, క్రియలలోగాని రంగనాయకమ్మను తను వ్యతిరేకించడం ఎన్నడూ జరుగలేదు. భర్తతోపాటు తనూ ఆడబడుచుపట్ల అపారమైన శ్రద్ధాసక్తులూ, గౌరవమూ కలిగి వుంది. అయినా రంగనాయకమ్మ తనను సూటీపోటీగా తూలనాడడం ఆదినుండీ సాగుతూనే వుంది. అది యిటీవల మరీ శృతిమించింది. తనకు తానుగా రంగనాయకమ్మను యెదుర్కోలేదు. ఆ విధంగాచేస్తే కుటుంబంలో అశాంతి ప్రారంభం అవుతుంది. భర్త చికాకుపడతాడు. అందరి మధ్యా శాంత నలిగిపోతుంది. రంగనాయకమ్మ కుటుంబ విషయాలలో జోక్యంకల్పించుకున్నట్లు అవుపించదు. కాని ఆచరణలో ఆమె ప్రమేయం లేకుండా యింట్లో ఏపనీ జరుగదు.

అన్నపూర్ణను బయిటికి పంపించివేయాలనే పట్టుదల యిటీవల రంగనాయకమ్మలో బాగా ఎక్కువయింది. అందుకు తనభర్త సమ్మతించరు. ఇక వుక్రోషం ఆపుకోలేక తన మీాద వెళ్ళగక్కుతూందని కామేశ్వరి అనుకుంది. ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా రంగనాయకమ్మమీాద ప్రతీకారచర్య తీసుకోవాలనే నిర్ణయానికి వచ్చింది ఆమె.

అన్నపూర్ణ కూతురు బేబీకి మార్చి పదహారో తేదీతో నాలుగు సంవత్సరాలునిండి - అయిదు జొరబడుతుంది. ఆ రోజున పుట్టినరోజు పండుగ. అక్షరాభ్యాసం చేయించుకోవాలనీ, అదికూడా రంగారావుగారిచేత చేయించే యేర్పాటు చెయ్యమనీ అన్నపూర్ణ అంతకుపూర్వమే కామేశ్వరిని ప్రాధేయపడి అడిగింది. ఆ రోజున కామేశ్వరి అన్నపూర్ణతో అవుననిగాని, కాదనిగాని చెప్పలేక పోయింది. రెండు నిమిషాలు ఆలోచించిన తరువాత "సరే మా వారితో సంప్రదిస్తానులే" అనిమాత్రం అనగలిగింది. కాని తరువాత తనలోతాను తర్కించుకొంది "ఈ పని నావలన అవుతుందా? యేమో! ఆయనగారికి చెబితే కాదని అనరు. కాని ఆ రంగనాయకమ్మో! ఆవిడ కల్పించుకోనిదే యీ ఇంట్లో చీమకూడా చిటుక్కుమనదే! ఎలా జరగనున్నదో!" అనుకుందామె.

అన్నపూర్ణ గుమ్మంలోనిలబడి "అక్కయ్యా! టీ తీసుకురమ్మంటారా?" అని అడిగింది.

కామేశ్వరి లేచినిలబడి "నేను వంటింట్లోకి పోతున్నా నులే. నువ్వు మేడమీదికిపోయి శాంతను నేను ఒకసారి రమ్మన్నానని చెప్పిరా" అంది.

ఆ సమయంలో రంగనాయకమ్మ సామాన్యంగా మేడదిగి క్రిందికి రాదు. ఒకవేళ వచ్చినా వంటఇంట్లోకి పోదు. అందుచేత శాంతతో సావకాశంగా మాట్లాడాలంటే వంటయిల్లే అనుకూలంగా వుంటుందని కామేశ్వరి శాంతను అక్కడికే పిలిచింది. తల్లీ, కూతుళ్ళకు టీ యిచ్చి అన్నపూర్ణ బయటికి వెళ్ళింది. కామేశ్వరి సంభాషణ ప్రారంభించింది.

"శాంతా! నీకుగాను తెచ్చినబట్టల్లోది పెద్దాపురం సిల్కు ఒకటీ, ఆగ్రా జరీబార్డరు సిల్కు ఒకటీ అన్నపూర్ణ కూతురికి రెండు లంగాలు, రెండు జుబ్బాలు కుట్టించాను."

"బాగున్నాయా, అమ్మా!"

"చాలా బాగున్నాయి."

"అన్నపూర్ణ ఏమంది?"

"వాళ్ళబేబీకి యీ నెల పదహారున పుట్టినరోజు పండుగట! ఆ రోజున నీ బహుమతిగా బేబీకి యిచ్చు కుంటుందట."

"ఛీ! అదేమిటే అమ్మా! పుట్టినరోజుపండుగ అయితే బహుమతిగా మరేదైనా యిద్దాం. ఈ బట్టలు మామూలుగా కట్టుకోనీ!"

"ఏమి యివ్వదలచుకున్నావు, బహుమతిగా!"

"యేమో, నాకేమీ అభిప్రాయం లేదు. నువ్వు చెప్పు. ఏమియిస్తే బాగుంటుందో!"

కామేశ్వరి నీరసంగా నవ్వింది. యిలాంటి విషయాలలో నాకు అంతగా అనుభవంలేదుగా! మీ అత్తయ్యకు బాగా తెలుసు."

"అయితే అత్తయ్యను అడుగుతాను!"

"మరోవిషయం. బేబీకి ఆ రోజుతో నాలుగు సంవత్సరాలు నిండి అయిదు జొరబడుతుందట. ఆ రోజే అక్షరాభ్యాసం. మీ నాన్నగారు చేయిస్తారు."

శాంత కిలకిల మంటూ నిండుగా నవ్వింది. "అమ్మా! కాస్తలేదు, ఆ నత్తిముండకు అక్షరాభ్యాసమేమిటే ?"

"నీకూ ఆ వయస్సులోనే అక్షరాభ్యాసం చేయించారు, మీ అత్తయ్య."

"అమ్మా! బేబీ మెంచక్కగా వుంటుందే, పుత్తడి బొమ్మలా! దానిమాటలు ఎంతో ముద్దులొలుకుతూంటాయి."

కామేశ్వరి మందస్మితం చేసింది.

అన్నపూర్ణ చేటతో పప్పు తెచ్చి "అక్కా! పప్పు శుభ్రంగా బాగుచేశాను. విసరమంటారా ? మిల్లు పట్టిద్దామా ?"

"విసరడమా, పాడా! ఆనక లక్ష్మి వచ్చాక మిల్లు పట్టించుకు రమ్మనిచెప్పు. సరేగాని ఆ పళ్ళగంపలో బత్తాయిలున్నాయి. ఒకగ్లాసు రసంతియ్యి" అంది కామేశ్వరి.

ఆ తరువాత ఆమె శాంతవైపు తిరిగి "శాంతా! నీవు పైకి పోతే అత్తయ్యకు పండ్లరసం తీసుకుపోతావు గదూ ?"

అన్నపూర్ణ నాలుగు బత్తాయిలు తెచ్చి ఒక గ్లాసు నిండా రసంతీసి శాంతవైపు చూస్తూ "నీవు పోతావా, నేను పోయి యిచ్చివచ్చేదా ?" అని ప్రశ్నించింది.

శాంత మాట్లాడకుండా ఆ గ్లాసు తీసుకుని మేడమీాది కెళ్ళింది. రంగనాయకమ్మ గుమ్మంలో నిలబడి వంట యింటి వైపు చూస్తూంది. శాంత అందించిన గ్లాసు పుచ్చుకుంది. "ఏమిటమ్మా, వంట యింట్లో కూర్చొని దీర్ఘంగా చర్చిస్తున్నట్లున్నారు ?" అని ప్రశ్నించింది.

"చర్చ లేమున్నాయి అత్తయ్యా? నేనూ, అమ్మా టీ తాగాం. పైకివస్తుంటే అమ్మ యీగ్లాసు తీసికెళ్ళి నీకు యిమ్మని చెప్పింది"

"అన్నపూర్ణ యేమిచేస్తుందే !"

"పప్పు బాగుచేసింది"

"ఇప్పుడు పప్పు బాగుచేయడం ఏమిటే ? మొన్న నేగా పప్పులన్నీ బాగుచేయించి డబ్బాలలో పోయిస్తా !

"ఏమో ఆ వివరాలు నాకు తెలియవు అత్తయ్యా ! నాకు ఒకసలహా కావాలి చెప్పు."

"ఏమి టదీ !"

"అన్నపూర్ణగారి బేబీ పుట్టినరోజు పండుగ."

రంగనాయకమ్మ మూతి విరిచి "ఊహూఁ" అంది.

"అంతేకాదు. ఆ రోజునే అక్షరాభ్యాసం"

"అక్షరాభ్యాసమా! సరే. యింకా ఏమున్నాయి ?"

"అదికూడా నాన్నగారే చేస్తారు"

రంగనాయకమ్మ ముఖం ముడుచుకొంది. "అయితే యిందులో నాసలహా ఎవరికి కావాలిటా ?"

"నీ సలహా కావాలిసింది ఎవరికో కాదు, నాకే అత్తయ్యా! బేబీకి నేను ఏదైనా మంచి ప్రజంటు యివ్వాలనుకుంటున్నాను. ఏమి యిస్తే బాగుంటుందో నీవు సలహా యివ్వాలి."

శాంత అడిగిన ప్రశ్నకు రంగనాయకమ్మ సూటిగా సమాధానం చెప్పలేదు. "వంటచేసుకు బ్రతికేదానికి యీ వేడుకలన్నీ దేనికో ?"

"అత్తయ్యా! అన్నపూర్ణ వంటచేసుకు బ్రతుకుతూందని యెవ్వరూ అనుకోరు. ఆమె మనకుటుంబంలో ఒక వ్యక్తిగా కలసిమెలసి తిరుగుతూంది. మనం కూడా అందుకు తగినట్లు గానే సమర్థించుకోవాలని నా అభిప్రాయం"

"ఎవరటా, ఆ సమర్థించుకోవాలిసిందీ? నీవా, మీ అమ్మా, నేనా ?"

"అందరం కలిసే అత్తయ్యా! అన్నపూర్ణతో సహా."

"అయితే ఆ పిల్లకు ఒకజత బట్టలుకుట్టించితే సరిపోదూ ?"

శాంత నీరసంగా నవ్వింది. "బట్టలు యిదివరకే కుట్టించాను."

"యేమిబట్టలు కుట్టించావు ?"

"నీవు నాకోసం తెచ్చినవాటిల్లోవి."

రంగనాయకమ్మ నోరు నొక్కుకుంది. "అవ్వ! అయితే, ఆ బట్టలన్నీ మన్నుచేశా వన్నమాట"

శాంత మళ్ళీ పేలవంగా నవ్వింది. "మన్నుచేయడ మేమిటే అత్తయ్యా! బేబీ అవికట్టుకుని కళకళలాడుతూ మన అందరిమధ్యా తిరుగుతూంటే మనకు కనులపండుగ్గా వుండదూ ?"

"వుండవే నీయిల్లు బంగారంగానూ! ఎవరో పరాయి వాళ్ళ కన్నబిడ్డను పట్టుకుని పాకులాడితే మనకు నిండుతుం దటే పిచ్చిదానా!"

"బేబీ పరాయిపిల్లని ఎలా అనుకుంటాం అత్తయ్యా! అది మనయింట్లో వున్నంతసేపూ అక్కా, అక్కా అంటూ నా కొంగుపట్టుకు తిరుగుతూ గలగలా మోగుతుంటుంది. దాగుడుమూత లాడుతూ ఒక్కనిమిషం అగుపించక పోతే బిక్కముఖం వేస్తుంది. మరో నిమిషం జాగు అయితే ఏడుపుకుసిద్ధం. అది పరాయిపిల్ల అని నేను అనుకోవడం లేదు అత్తయ్యా!"

"ఏమోతల్లీ! నీ ప్లీడరు ఆర్గ్యుమెంట్లకు సమాధానం చెప్పగల సామర్థ్యం నాకులేదు."

"అయితే అత్తయ్యా! లాయరుపరీక్షకు చదవమం టావా?"

"ఆహా! చదవవలసిందే! బమ్మిని తిమ్మిని, తిమ్మిని బమ్మినిచేసి బల్లగుద్ది వాదించడానికి."

"దానితోపాటు డబ్బూ, దర్పమూ చేకూరుతాయిగా! అయితే అత్తయ్యా! నేను ప్లీడరుగా వున్నప్పుడు నీ వేమో హెడ్ గుమస్తాగా వుండాలి."

రంగనాయకమ్మ విరగబడి నవ్వింది. శాంత శృతి కలిపింది. వారి నవ్వులతో ఆ మేడ ప్రతిధ్వనించింది. రంగ నాయకమ్మ పళ్ళరసం తాగి గ్లాసు ప్రక్కన పెట్టింది.

శాంత అందుకుంది. "యేం అత్తయ్యా, చెప్పవూ?"

"న న్నేమి చెప్పమంటావే?"

"అదే, బేబీకి ప్రజంటుసంగతి!"

"నీ యిష్టమొచ్చింది యిచ్చుకో."

"నా యిష్టమొచ్చింది యిచ్చుకుంటే నిన్ను ప్రాధేయ పడటం ఎందుకూ?"

"అయితే ఒక వుంగరం చేయించియివ్వు."

"అబ్బే, ఉంగరం ఏం బాగుంటుంది?"

"మరి యేమి యివ్వాలని?"

"లాకెట్ బాగుంటుంది."

రంగనాయకమ్మ కోడలివైపు కోపంగా చూసింది. "యీ అభిప్రాయం వున్నదానివి మొదట్లోనే చెబితే పోయే దిగా! నన్ను అనవసరంగా వాగించడం దేనికి?"

శాంత రంగనాయకమ్మ మెడకు రెండుచేతులూ మెలివేసి "కోప్పడక త్తయ్యా! యీ లాకెట్ అభిప్రాయం నాకు యిప్పుడే కలిగింది. ఒట్టు అత్తయ్యా!"

రంగనాయకమ్మ మందస్మితం చేసింది. తన మెడ చుట్టూవున్న శాంతచేతులను వదలించుకొని "లాకెట్ సాదాదా? రాళ్ళదా?" అని అడిగింది.

శాంత సమాధానం చెప్పలేదు. రంగనాయకమ్మను మరొకసారి కౌగలించుకొని "అత్తయ్యా! నువ్వు దేవతవు! యిక అవన్నీ నీయిష్టం" అంటూ ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకుంది.

"అబ్బా, ఇవేమి వికారపుచేష్టలే తల్లీ!" రంగనాయకమ్మ కొంగుతో నుదురు తుడుచుకొంది.

"సరే. లాకెట్, చెయినుకలసి మూడు వందలు పైగా అవుతాయి" అంది ఆమె.

"హమ్మయ్యో! మూడు వందలే!" అంటూ శాంత కళ్ళుపెద్దవిచేసి ఆశ్చర్యంగా చూసింది.

"మరి వట్టినే వస్తుందా బహుమానం?"

"పోనీలే అత్తయ్యా! నీపేర బ్యాంకులలో వేలకువేలు మూలుగుతున్నాయి."

"అయితేమాత్రం విరజిమ్ముకుంటారా!"

"ఇది విరజిమ్మటం కాదులే అత్తయ్యా?"

గడియారం నాలుగుగంటలు కొట్టింది. "అమ్మడూ! నేను పురాణకాలక్షేపానికి పోవాలి. నువ్వుకూడా కాసేపు చదువుకో" అనిచెప్పి రంగనాయకమ్మ మేడదిగింది. శాంత సోఫాలో కూర్చుని పుస్తకంతెరచి చదువులో లీనమయింది.

ఒక గంటతర్వాత అన్నపూర్ణ గుమ్మంలో నిలబడి "శాంతా! నాన్నగారు రమ్మంటున్నారు" అంది.

శాంత పుస్తకం మూసిపెట్టి, కిందికి వచ్చింది. రంగారావు కుర్చీలో కూర్చుని టీ తీసుకుంటున్నాడు. కామేశ్వరి అతని ప్రక్కన నిలబడివుంది. శాంత లోపల ప్రవేశించగానే "యేమ్మా, బాగా చదువుతున్నావా?" అంటూ పలుకరించాడు రంగారావు.

"చదువుతూనే వున్నాను నాన్నగారూ!"

"పరీక్షలింకా ఎన్నిరోజులున్నాయి?"

"వారం రోజులు. వచ్చే సోమవారం."

"సబ్జక్టులన్నీ ఒకసారి అయినా రివైజుచేశావా?"

"ఒకసారికాదు. రెండుసార్లు రివైజు చేశాను నాన్నగారూ! ప్రస్తుతం నోట్సులు తిరగేస్తున్నాను."

"ఏమీ కంగారుపడవద్దు. పరీక్షలు రెండు రోజులున్నాయనగా చదవటం ఆపేసేయి. యెక్స్పెక్టెడ్ కొశ్చన్సు ఏమైనావుంటే వాటి ఆన్సర్లుకూడా ఒకసారి చూసుకో. ప్రొద్దుపోయేవరకూ చదుతూ కూర్చోక పెందలకడే పండుకో. తప్పనిసరిగా పరీక్షఅవుతావు. క్లాసుకూడా వస్తుంది.

"యేమో, భయంగావుంది నాన్నగారూ!"

రంగారావు మందస్మితం చేస్తూ "పరీక్షలముందు అలానే వుంటుందమ్మా" అన్నాడు.

"బేబీ పుట్టినరోజుపండుగ అయిన మరుసటిరోజే నన్నమాట మీ పరీక్షలు ప్రారంభమవుతా!" కామేశ్వరి సంభాషణ మార్చింది.

"అవును" అన్నట్లుగా శాంత తల ఊపింది.

"సరేగాని, బేబీకి ఏదో ప్రజంటు యిస్తా నన్నావటగా! యేమి కావాలో చెప్పమ్మా, తీసుకువస్తాను!" రంగారావు ప్రశ్నించాడు.

"అత్తయ్యా తీసుకువస్తానంది నాన్నగారూ!"

"నీవు ప్రజంటుచేసే దేమిటో మాకుకూడా కాస్త చెపుతావా?"

శాంత చిరునవ్వు నవ్వుతూ తల్లివైపు చూచింది.

"యేమిటోయ్! నీకూ తెలుసునా? చెప్పవేం!" కామేశ్వరివైపుచూస్తూ రంగారావు అడిగాడు.

"అయ్యొకర్మా! నా కేమీ తెలియదండోయ్!" కామేశ్వరి అమాయకంగా తల ఆడించింది.

"అయితే?" అతను ప్రశ్నార్థకంగా శాంతవైపు చూశాడు.

ఆమె చెప్పింది. "లాకెట్ విత్ చైన్"

"భేషో! మంచి ప్రజంటే యిస్తున్నావు. ఎవరిదట యీ ఐడియా?" రంగారావు ప్రశ్నించాడు.

శాంత తడుముకోకుండా "అత్తయ్యది" అన్నది. కాని తరువాత నాలుక కరచుకొంది.

రంగారావు చూపుల్లో ఆశ్చర్యం ప్రకటించాడు. కామేశ్వరి విస్తుపోయి చూచింది.

85

## ప్రకరణ 5

అన్నపూర్ణ బిడ్డ బేబీ పుట్టినరోజు పండుగ అనుకున్న దానికంటే బాగా జరిగింది. అన్నపూర్ణ తల్లికి, తోబుట్టువులకు రంగారావు చేనేతబట్టలు తెప్పించి యిచ్చాడు. కామేశ్వరి అన్నపూర్ణకు నీలంబోర్డరు లేతగులాబీరంగు నూరోనెంబరు సేలంచీరె, తెలుపు లాన్ జాకెట్టు కుట్టించింది. ఉదయం అక్షరాభ్యాసం జరిగిపోయింది. సాయంకాలం రంగారావు తనకు బాగా పరిచయమున్న కొద్ది మందిని టీకి ఆహ్వానించాడు. అందులో డాక్టర్ సుదర్శనం ఒకడు. రంగారావు తానే స్వయంగా డాక్టరును పిలిచేందుకు అతని హాస్పిటలుకు వెళ్ళాడు. కాని అక్కడ డాక్టరు లేడు. ఇంటికి కబురుచేస్తే అక్కడ లేనట్లు చెప్పారు "సరే, డాక్టరు రాగానే నేను ఫోన్ చెయ్యమన్నా నని చెప్పు" అని కంపౌండరుతో చెప్పి అతను తిరిగి వచ్చేశాడు. ఒక గంటతరువాత ఫోన్ మోగింది. రంగారావు రిసీవరు ఎత్తాడు.

"నేను రంగారావును. ఎవరు?"

"సుదర్శనం"

"ఈ ఉదయం నీ కోసం వచ్చానోయ్! లేవు. ఇంటి దగ్గరా లేవన్నారు. ఎక్కడికి పోయావ్?"

"పేషెంటును చూడటానికి"

"సాయంకాలం నాలుగుగంటలకు మా యింటికి ఒకసారి వస్తావుగదూ! ఒక చిన్న టీ పార్టీ యిస్తున్నాం"

"ఏమిటీ విశేషం, ఎవరిదైనా పెండ్లా?"

"మా యింట్లో ఎవరున్నారని పెండ్లికి?"

"ఎవరూ లేకేమిటి, ఒకరుగాకుండా ముగ్గురు వుంటేనూ?"

"ఎవరబ్బా ఆ ముగ్గురు?"

"ఒకటి మీ వంటామె, రెండు మీ అమ్మాయి. మూడు మీ... చె... ల్లె... లు."

"ఛా... ఛా"

"ఛా ఛా లేదు, ఛీ ఛీ లేదు ఆ ముగ్గురిలో ఎవరినైనా సరే పెండ్లి చేసుకోడానికి నేను సిద్ధం"

"మా అమ్మాయి చిన్నపిల్ల గదుటోయ్!"

"పోనీ, ఆ పై యిద్దరిలో ఒకర్ని"

"వాళ్ళ అంగీకారం కావాలిగదా! ప్రయత్నించు."

"నువ్వు అవకాశం కల్పిస్తే..."

"నేను నిమిత్తమాత్రుణ్ణి. సరేగాని సాయంకాలం వస్తావు గదూ!"

"విషయ మేమిటో చెప్పేవుకాదు."

"ఓ, సారీ! అన్నపూర్ణకూతురు బేబీ పుట్టినరోజు పండుగ. ఆ సందర్భంలో చిన్న టీ పార్టీ"

"సరే వస్తాను."

ఆ రోజంతా రంగనాయకమ్మ మేడపైనుండి క్రిందికి రానేలేదు. వేళకు శాంత వెళ్ళి పిలిస్తే వచ్చి భోజనంచేసి

వెంటనే పైకి వెళ్ళింది. మధ్యాహ్నం మూడు గంటలకే పురాణ కాలక్షేపాని కంటూ బయటికి పోయింది.

సాయంకాలం టీ పార్టీకి డాక్టరుగాక కాలేజీ. లెక్చరర్లు యిద్దరు, అన్నపూర్ణతరఫు బంధువులు నలుగురూ శాంత స్నేహితురాండ్రు యిద్దరు మాత్రం వచ్చారు. ఫలాహారాలు టీ, అన్నపూర్ణ, కామేశ్వరి పంచారు. సుదర్శనం రంగారావు ప్రక్కనే కూర్చుని ఫలాహారాలు తింటూన్నంతసేపూ ఏవో కబుర్లు చెపుతూనే వున్నాడు. ఒకసారి రంగారావు చెవిలో "మీ అన్నపూర్ణ ఫ్రెంచి యాక్ట్రెస్‌లా వుందిరా!" అన్నాడు. మరోసారి "మీ ఆవిడకు నువ్వు అంటే యిష్టమేనా!" అని అడిగాడు. రంగారావు నవ్వుకున్నాడు.

బేబీకి బొమ్మలు, ఆటవస్తువులు తలాఒక బహుమతీ యిచ్చారు. డాక్టరు చిన్న వెండిపళ్ళెమూ, గ్లాసూ యిచ్చాడు. అతిథు లందరూ వెళ్ళిన తరువాత సుదర్శనం, రంగారావు క్లబ్బుకు వెళ్ళారు. వరండాలో ఒకమూలగా రెండు కుర్చీలు వేయించి సుదర్శనం ఒకదానిలో కూర్చుంటూ "రంగా! కబుర్లు చెప్పరా! మనం స్వేచ్ఛగా మాట్లాడుకొని ఎంతకాలమైందో!" అన్నాడు.

రంగారావు సిగరెట్ ముట్టించి "ఆ కబుర్లుచెప్పడం నీవంతు. వినడం నావంతూరా భాయ్!"

సుదర్శనంకూడా సిగరెట్ ముట్టించి కుర్చీకి చేరబడి "మీ అన్నపూర్ణను ఒప్పించి పెండ్లిచేసే మార్గం చూడరా బ్రదర్!"

రంగారావు మందస్మితం చేశాడు. "మల్లిక వ్యవహారం ఏమైనట్లు?"

"పాపం! ఆవిడ చాలా దెబ్బతిందిరా."

"ఎవరివల్ల?"

సుదర్శనం గట్టిగా సిగరెట్టు దమ్ములాగి పొగ పైకి వదలి చెప్పుకు పోయాడు. "నా దగ్గరనుండి వెళ్ళిపోయిన తరువాత మల్లిక అక్కడ కాలేజీలో లెక్చరర్‌గాపనిచేసింది. అప్పుడే ఆవిడకు మరో లెక్చరర్‌తో పరిచయం ఏర్పడి అది ప్రేమలోకి దిగింది. ఆరోజుల్లోనే విడాకులకోసం నాకు నోటీసుకూడా యిచ్చింది. సరే. నేనేమో నా అభ్యతరం ఏమీ వుండదని తెలియజేశాను. విడాకులు సంపాదించి ఆ లెక్చరర్‌ను వివాహం చేసుకోవాలని మల్లిక అభిప్రాయం. కాని వాళ్ళ తల్లీ, తండ్రీ అంగీకరించలేదు. కారణ మేమిటంటే ఆ లెక్చరర్ క్రిస్టియను. అయినా మల్లికమాత్రం ఆ లెక్చరర్‌తో రెండు సంవత్సరాలు కలసి మెలసి తిరిగింది. తరువాత ఏమిజరిగిదంటే గడచిన జూలైలో అతను యిక్కడ నుండి ఢిల్లీకి వెళ్ళిపోయాడు. అక్కడ వివాహంకూడా చేసుకున్నాట్ట. దాంతో యీావిడ పాపం చాలా కుంగిపోయింది. ఉద్యోగం మానేసింది. దానికితోడు వాళ్ళ నాన్నగారుకూడా పోయారు. అప్పుడే నే నొకసారి వాళ్ళ యింటికి వెళ్ళాను. మల్లిక నన్ను తప్పుకుని తిరిగింది. వాళ్ళ అక్క మంజరి నన్ను యెంతో ఆప్యాయంగా పలుకరించి చాలాసేపు మాట్లాడింది. మల్లిక జీవితాన్ని ఒకదారికి తీసుకురావలసిందని

ప్రాధేయపడింది. మల్లిక అంగీకరిస్తే నా అభ్యంతరం ఏమీ వుండదని చెప్పాను.

'సరే, మల్లికను మీ దగ్గరకు పంపుతాను' అని చెప్పి మంజరి వెళ్ళిపోయింది.

ఇంటినిండా బంధువు లున్నారు. అయినా మేడ మీదిగదులు నాకోసం ప్రత్యేకించారు. ఒంటరిగానే కూర్చున్నాను. అరగంట గడచిన తరువాత మేడపైకివచ్చే మెట్ల మీద మాటలు వినవచ్చాయి. నేనులేచి కిటికీ దగ్గరగా నిలబడ్డాను. అది మంజరి కంఠం. 'చెల్లాయ్! నా మాట వినవూ? నా తల్లిగా! వెళ్ళు. నేను అతనితో మాట్లాడి వచ్చాను. అతను సహృదయుడు. నిన్ను ఏమీ అనడు. నే చెపుతున్నాగా, వెళ్ళమ్మా!'

'అక్కా! నా అంతరాత్మ అంగీకరించదు. నేను పో... లే... ను అక్కా!' మల్లిక అంటోంది. ఆమె కుమిలి-కుమిలి ఏడుస్తోంది. మంజరికూడా చీదివేస్తోంది. నాలుగు నిమిషాలు మౌనంగా గడిచాయి.

మంజరి మళ్ళీ అందుకుంది. 'నామాట వినుచెల్లీ! ఆయన నీకోసం నిరీక్షిస్తూ వుంటారు.'

'ఏమో! ఆయనగారి ముఖం నేను చూడలేనుఅక్కా!'

ఆతరువాత మంజరి చెల్లెలి నుద్దేశించి గంభీరంగా మాట్లాడింది. 'మల్లికా! మన అమ్మ గర్భవాసాన మనంయిద్దర మే పుట్టాం. మన యిద్దరివీ తీరూ దారి లేని జీవితా లయ్యాయి. మన భవిష్యత్తును గురించి అమ్మా, నాన్నా కన్న కలలన్నీ

కల్ల లయ్యాయి. నాన్నగారు మనలను గురించి మనో వ్యాధితో చీకి-చీకి చనిపోయారు. ఇక అమ్మకూడా ఆట్టే కాలం జీవిస్తుందనే ఆశ అగుపించదు. అమ్మ అనంతరం నేను ఏ ఆశ్రమంలోనైనా చేరిపోవాలనే నిర్ణయానికి వచ్చాను. ఇక నీవు ఏకాకిగా మిగిలిపోతావు. అది నేను భరించలేను. యీ స్థితిలో ఆశ్రమంలో చేరినా నాకు మన శ్శాంతి వుండదు. నామాటవిను. అతను నిన్ను నిరాక రించడు పద. నేనుకూడా వస్తాను నడువు.'

మల్లిక తేరుకుని 'నీవు వద్దులే అక్కా! నేను పోతాను.' అంటూ పైకి వచ్చింది.

నేనుపోయి నామామూలుస్థానంలో కూర్చున్నాను. మల్లిక తలవంచుకుని గదిలో అడుగుపెట్టింది. బొద్దుగా, ఆరోగ్యంగా వుండే మల్లిక పూర్తిగా శుష్కించి రోగిష్టిలా వుంది. కళ్ళు ఎర్రనై నిప్పుల్లా వున్నాయి. ఆమెలోవుండే కళా కాంతులన్నీ మాయమయ్యాయి. ఆమె నిర్జీవంగా అగు పించింది. నాలుగజాలు ఎడంగా నిలబడి చేతులురెండూ జోడించి 'నమస్తే' అంది.

నేను లేచి ఆమె రెండుచేతులూ పట్టుకుని నాదగ్గరగా తీసుకునేందుకు ప్రయత్నించాను. కాని ఆమె నా పట్టు విడిపించుకుని దూరంగా జరిగి నిలబడింది. ఆమెను చూస్తుంటే నాకు కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి ఆమె వలవల విలపించింది. ఆ స్థితిలో ఆమెను మళ్ళీ దగ్గరకు తీసుకోవాలని నా మనస్సు ఆరాటపడింది. కాని ఆమె వారించింది.

తరువాత ఒక గంటసేపు ఆ గదిలోనే ఒకరి కొకరం ముదురెదురుగా కూర్చుని మాట్లాడుకున్నాం. పర్యవసాన మేమిటంటే ఆమె యెట్టి పరిస్థితులలోనూ తిరిగి నా దగ్గరకు వచ్చేందుకు అంగీకరించలేదు. పైగా నన్ను మళ్ళీ పెళ్ళి చేసుకో వలసిందిగా ప్రాధేయపడింది. జీవితాంతం వరకూ వుభ యులం మంచి స్నేహితుల్లా వుండిపోవాలనే అభిలాష వెల్ల డించింది.

మరి నీభవిష్యత్తు యెలా గడపాలని అనుకుంటున్నావు? మళ్ళీ ఉద్యోగంలో చేరతావా? అని ప్రశ్నించాను.

ఆమె వెంటనే 'లేదు.' అని సమాధానం చెప్పింది. ఇంకా యిలా అంది. 'మా నాన్నగారు మాకు వదలివెళ్ళిన ఆస్థి రెండు లక్షలకు పైగా వుంటుంది. మాఅక్క యే ఆశ్రమంలోనో చేరిపోవాలనే నిర్ణయానికి వచ్చింది కాని ఆమెను ఆ ప్రయత్నంనుండి విరమించుకునేట్టు చేసి ఇద్దరం కలిసి ఒక 'అనాధశరణాలయం' స్థాపించాలనే అభిప్రాయంలో వున్నాను. ప్రభుత్వం, తమబోటి పెద్దలూ సహకరిస్తే నా ప్రయత్నాలు సఫలమౌతా యనే ఆశిస్తున్నా. ముందు మీ ఆశీర్వాదం ఇవ్వండి.' అంటూ ఆమె లేచి నా పాదాలకు నమస్కరించింది.

నేను నిజంగా నిర్ఘాంతపోయాను. మల్లికలో యింత మార్పు వస్తుందని నేను ఏనాడూ వుహించలేదు. అందు చేత ఆమెకు వెంటనే కావలసిన సమాధానం చెప్పలేదు. మొత్తంమీద ఆమెను అభినందించకుండా వుండలేక

పోయాను. ఇదీ మల్లిక వ్యవహారం. తెలిసిందా !" అంటూ సుదర్శనం రంగారావువైపు చూసి మళ్ళీ సిగరెట్టు వెలిగించాడు.

రంగారావు జాలిగా "పూర్ ఉమన్" అన్నాడు. అతనుకూడా సిగరెట్టు ముట్టించాడు.

"అన్నపూర్ణకు వివాహం చేసుకోవాలనే అభిప్రాయమేమైనా వుందా ?" సుదర్శనం ప్రశ్న వేశాడు.

"యెలా తెలుస్తుంది ? ఆమె నూటికి నూరు పాళ్లూ పూర్వాచార పరాయణుల కుటుంబంలో పుట్టి పెరిగింది. కొంతకాలంగా మా యింట్లో ఉంటూందనుకో! అయినా ఆమె మనస్తత్వం తెలుసుకునేందుకు నేను యెన్నడూ ప్రయత్నించలేదు. అసలు మా ఇంట్లో అన్నింటికీ పెద్ద అడ్డంకి మా చెల్లెలు. ఆమె మారదు. ఇతరులు మార్పు చెందడం ఆమె సహించదు. మా కుటుంబ వ్యవహారాలలో యిటీవల ఆమె మరీ కంటకంగా తయారవుతూంది. ఆమెతో యెలా నిగ్రహించుకోవాలో నాకు బోధపడడం లేదు. ముందుకు పోవాలంటే నుయ్యి, వెనక్కుపోతే గొయ్యి అన్నట్టుంది నా పరిస్థితి. అయినా కామేశ్వరిద్వారా అన్నపూర్ణ మనస్తత్వం తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాను" అన్నాడు రంగారావు.

"యేమోరా, బ్రదర్ ! యీ అన్నపూర్ణను దాదాపు సంవత్సరంనుండి చూస్తున్నాను. ప్రథమ పర్యాయం చూసినప్పుడే ఆవిడ మీద నాకు మనస్సుపోయింది. వాళ్ళ పెద్ద

లంతా ఛాందసులని తెలుసు. అయినా మీా యింట్లో వుంటోందిగనుక ఆవిడతో పరిచయం కలుగజేసుకోవడం ఏమంత కష్టంకూడా కాదు. కాని ... ” అంటూ సుదర్శనం ఆగిపోయాడు.

రంగారావు ప్రశ్నించాడు. “యేమిట్రా ఆ కాని ?”

సుదర్శనం చిన్నగా నవ్వి “ఆఁ, చెపుతా !” అంటూ చేతిలోవున్న సిగరెట్టు బయటికి విసిరి, బాయ్‌ని పిలిచి రెండు కూల్ డ్రింకులు తీసుకురమ్మన్నాడు.

“యేమి డ్రింకులు సార్”

సుదర్శనం రంగారావువైపు చూసి “ఏరా నీకు ఏం కావాలి ?”

“యేదో ఒకటి తెమ్మనవోయ్ !”

“వింటో తీసుకురమ్మంటా”

“నాకు లెమన్ చాలు”

“ఒకటి లెమన్, ఒకటి వింటో. గోల్డుఫ్లేక్ సిగరెట్ ప్యాకెట్ ఒకటి.” బాయ్ వెళ్ళిపోయాడు.

“యేమిటిరా యీా ఉదయంనుండి నీ ధ్యాసఅంతా పెండ్లిమీాద పోతూంది ?” రంగారావు ప్రశ్నించాడు.

“నిజమేరా నాన్నా ! యీా ఉదయంనుండే కాదు. యిక్కడికి వారం రోజులనుండీ తొందర్లో వివాహం చేసుకోవాలని ఆరాట పడుతున్నా. అందులో సందేహంలేదు.”

బాయ్ డ్రింకులు, సిగరెట్ పెట్టె తెచ్చి బల్లమీాద పెట్టాడు. సుదర్శనం బాయ్‌కి డబ్బులు యిచ్చి పంపేశాడు.

గ్లాసులు ఖాళీచేసి, మళ్ళీ సిగరెట్లు వెలిగించారు. సుదర్శనం చెప్పడం ప్రారంభించాడు. "మా హాస్పిటల్ నర్సు శారద నీకు తెలుసుగా! ఆవిడతో అయిదారు మాసాల నుండీ నేను సన్నిహితంగా మెలుగుతున్నాను. ఆవిడకు కూడా నా పట్ల సదభిప్రాయం యేర్పడినట్లు గ్రహించిన తరువాత వివాహం ప్రపోజలు పెట్టాను. ఆవిడ అవునూ, కాదనీ తేల్చకుండా నెలలు గడిపేసింది. వారంరోజుల క్రితం మొదటిఆట సినిమాకుపోయి తిరిగివస్తూ హాస్పిటలుకు వెళ్ళాను. క్రింద యిద్దరు పేషెంట్లు వున్నారు. వాళ్ళుకూడా నిద్రలో వున్నారు. నేను చప్పుడు చేయకుండా మేడపైకి వెళ్ళాను. డాబాపైన వెన్నెట్లో మా కాంపౌండరు, ఆవిడ పరుపు వేసుకుని పడుకునివుండడం చూశాను. నేను నిశ్శబ్దంగా వెనక్కితిరిగి యింటికి వెళ్ళిపోయాను.

ఆ మరుసటిఉదయం మామూలుగా ఆవిడ హాస్పిటలుకు వచ్చింది. హాస్పిటలుపని ముగించుకుని నేను పైకిపోయి కూర్చుని ఆమెకు కబురుచేశాను. చిరునవ్వులు చిందిస్తూ ఆవిడ వచ్చి నా యెదురుగా నిలబడింది. నిజంగా ఆవిడను చూడడానికే నాకప్పుడు చాల అసహ్యం వేసింది. అయినా తాపీగా 'మన వివాహం విషయమై యింతకాలంగా నేను అడుగుతూంటే నీ సమాధాన మేమిటో చెప్పావుకాదేమిటి శారదా?' అని ప్రశ్నించాను.

ఆవిడ ధీమాగానే జవాబు యిచ్చింది, 'మావాళ్ళు అంగీకరించడం లేదండీ' అని.

ఆ సమాధానం వినేసరికి నాకు మండిపోయింది. 'అయితే మీవాళ్ళు వ్యభిచరించడానికి అంగీకరించా రన్న మాట' అన్నాను.

"ఆవిడ హఠాత్తుగాలై ఒక్కక్షణం నావంక చూసింది. ముఖం వెలవెల పోయింది. వెంటనే తల క్రిందికి దించుకుంది. కళ్ళవెంట నీళ్ళు జలజల రాలాయి. నేను యిక అక్కడ వుండలేకపోయాను. వెంటనేలేచి క్రిందికి వచ్చేశాను. నేను డిస్పెన్సరీలో వుండగా శారద వెళ్ళిపోయింది. ఆ తరువాత ఆమె మళ్ళీ హాస్పిటలుకు రాలేదు. రెండుదినాలు గడిచాక కాంపౌండరును కూడా పనినుండి మాన్పించాను."

"ఇంతకూ పర్యవసానమేమిటీ ?" రంగారావు ప్రశ్నించాడు.

"యేముంది పర్యవసానం ? నీమొహం, నామొహం! రామాయణం అంతావిని రాముడికి సీత ఏమికావాలన్నాడట నీబోటి దద్దమ్మ ఒకడు. అలానే వుంది నీప్రశ్న. ఒరే భయ్యా! సంసారం కోసం, పిల్లలకోసం నా మనస్సు ఆరాట పడుతూంది. త్వరలో పెండ్లిచేసుకోవాలని వుందిరా బాబూ, అని అఘోరిస్తూంటేనిగదరా" అన్నాడు సుదర్శనం కొంత కోపమూ, కొంత చలోక్తీ మిళితంచేసి.

రంగారావు నవ్వుతూ కుర్చీలోనుండిలేచి సుదర్శనం భుజాలు చేతులతో పట్టి అతన్ని పైకిలేపి "అరే భాయీ కోప్పడకురా! అన్నపూర్ణతో మాట్లాడి రేపు నీకు సమాచారం అందజేస్తాను," అన్నాడు.

రంగారావు ఇంటికిపోతూ అన్నపూర్ణతో మాట్లాడ వలసిన పద్ధతిని గురించి ఆలోచించాడు. ఆమెతో తనే స్వయంగా మాట్లాడడం మంచిదని అతను అభిప్రాయ పడ్డాడు.

రెండవది అన్నపూర్ణ పినతండ్రి సుబ్బరామయ్య కాలేజీలో గుమాస్తా. అతని సిఫార్సుతోనే అన్నపూర్ణను తనఇంట్లో వంటపనికి నియమించడం జరిగింది. సుబ్బ రామయ్య అభ్యుదయభావాలు గలవాడనే వినికిడి. ఒకప్పుడు కాలేజీలో కమ్మ యువకుడు, బ్రాహ్మణ యువతికి జరిగిన వివాహసందర్భంలో సుబ్బరామయ్య ఆ దంపతులను అభినం దిస్తూ ఆశీస్సులను తెలిపాడు. కాబట్టి అన్నపూర్ణ యిష్ట పడితే సుబ్బరామయ్యతో కూడా సంప్రదిస్తే సరిపోతుంది అనుకున్నాడు రంగారావు.

రంగారావు ఇల్లు చేరేసరికి రాత్రి తొమ్మిది గంట లయింది. ఇల్లుఅంతా ఖాళీగావుంది. వంటఇంటిలోనుండి మాటలు వినిపిస్తున్నాయి. రంగారావు నెమ్మదిగా లోపలకు తొంగిచూశాడు. కామేశ్వరి, అన్నపూర్ణ, అన్నపూర్ణతల్లి రాజమ్మ, చెల్లెలుగాయత్రి వున్నారు. రంగారావు అక్కడ నుండి మేడపైకి వెళ్లాడు. శాంత సోఫాలో కూర్చుని చదువుతూంది. రంగనాయకమ్మ తుంగచాపమీద పరుంది. రంగారావు ప్యాంటు జేబులోనుండి ఒకకాగితంతీసి శాంతకు యిస్తూ "దీనిలో కొన్ని కొశ్చన్సు వున్నాయిచూడమ్మా!" అన్నాడు.

శాంత రెండు మూడుసార్లు ఆ కాగితాన్ని అటూ ఇటూ తిప్పి చదివింది. "యీ కొశ్చన్సు వస్తాయా నాన్నగారూ!" అంది.

"యేమో! బహుశా అందులో చాలవరకు రా వచ్చనే అంటున్నారు. వాటికి నీవు జవాబులు వ్రాయ గలవా?"

"ఓ! నూటికి నూరుపాళ్ళు వ్రాస్తాను నాన్నగారూ!"

"అయితే తొమ్మిదిదాటింది. యిక పరుండరాదూ?"

"ఇంకోనోట్సు మాత్రంవుంది. అదికూడా తిరగవేసి పరుంటాను నాన్నగారూ!"

"అత్తయ్య వట్టిచాపమీద పరున్నదేం, నిద్ర పోతూందా?" శాంత సమాధానం చెప్పలేదు. ఆమె తండ్రి వంక చూస్తూ వూరుకుంది.

"లేదు అన్నయ్యా!" అంటూ రంగనాయకమ్మ లేచి కూర్చుంది.

"చెల్లెమ్మా! మనిద్దరం రేపు ఒకసారి ఉయ్యూరు వెళ్ళి రావాలి."

"దేనికి అన్నయ్యా!"

"లోగడ సత్రంకోసమంటూ మనం కేటాయించిన స్థలం బోర్డువాళ్ళకు యిచ్చాను. అది రేపు రిజిస్టరుచేసి యివ్వాలి. ఆస్థలంలో వాళ్ళు బాలికాపాఠశాల కట్టిస్తారు."

"అదేమిటి అన్నయ్యా! సత్రంకట్టిస్తేనే పోయేదిగా!"

"చెల్లెమ్మా! స్త్రీ లీనాడు ఎలా వినియోగపడు తున్నాయో మనంచూస్తున్నాం. సన్యాసులకు, జూద గాళ్ళకు, దొంగలకు, వ్యభిచారులకు ఉపయోగపడుతున్నా యంటే అతిశయోక్తిగాదు. అన్నీ ఆలోచించినతరువాతనే ఆ స్థలం పాఠశాలకు యివ్వడం మంచిదని అలాచేశాను."

రంగనాయకమ్మ మరి మాట్లాడలేదు. రంగారావు యింకా చెప్పుకుపోయాడు. "చెల్లెమ్మా! అంతేకాదు. నీ పేరుతో పదివేలు డబ్బుకూడా యిస్తున్నాను. ఆ పాఠశాల నీ పేరనే కడతారు."

"ఎందుకన్నయ్యా! నాపేరిట దేనికి?"

"నీపేరిటగాక యింకొకరి పేరుతో ఆ పాఠశాల నిర్మించడం భావ్యంకాదు చెల్లెమ్మా! ఆ యాస్థికంతటికి అధి కారిణివి నీవు. ఆ యాస్థిని గురించే కదా యిహలోక సుఖా లన్నీ త్యజించి యీ కఠోర జీవితం గడుపుతున్నావు?"

అన్నగారి మాటలలోని భావం రంగనాయకమ్మ గ్రహించిందో లేదోగాని "అంతా విధికృతం. అది తప్పించు కోవడం ఎవరితరం" అనుకుంది లోలోపల.

రెండు నిమిషాల తరువాత రంగారావు కిందికి వెళ్ళాడు. కామేశ్వరి, అన్నపూర్ణ బంధువులను సాగ నంపుతూ గేటుదగ్గర నిలబడ్డారు. అన్నపూర్ణ చెల్లెలికి చెపు తూంది.

"మేమేయ్ గాయత్రీ! బేబీకి నిద్రవస్తే ఏడుస్తుందేమో నీదగ్గర పడుకోబెట్టుకో."

"ఆ, ఫరవాలేదులే అక్కా! నేను చూసుకుంటాలే" కదలిపోతూన్న రిక్షాలోనుంచి గాయత్రి సమాధానమిచ్చింది.

గేటుమూసి అన్నపూర్ణ, కామేశ్వరి వెనక్కు తిరిగారు, కామేశ్వరి అంది. "శాంతకు పరీక్షలయిన తరువాత బేబీని యిక్కడే అట్టి పెట్టుకుందాం"

రంగారావు బట్టలు మార్చుకుని వంటయింటి గుమ్మంలోనిలబడి "కామూ! నాకు యీపూట భోజనంవద్దు. కాస్తకాఫీ పెట్టి యివ్వగలవా?" అడిగాడు భార్యవంక చూస్తూ.

"ఆ... ఆ. నాలుగు నిమిషాలలో తయారు చేస్తాను. కాస్త ఫలాహారం కూడ యేమైనా తెమ్మంటారా?" కామేశ్వరి అడిగింది.

"యేమీవద్దు. వట్టికాఫీ మాత్రం"

"అయితే యిక్కడ కూర్చుంటారా? హాలులోకి తెమ్మంటారా?"

"ఇక్కడే వుంటాను నువ్వు త్వరగా యివ్వగలిగితే"

కామేశ్వరి గ్యాసుపొయ్యిలు రెండు వెలిగించి నీళ్ళు-పాలు పెట్టింది. అన్నపూర్ణ కిటికీదగ్గరగా నిలబడింది.

రంగారావు అన్నపూర్ణవైపు చూస్తూ "ఏమమ్మా! బేబీ పుట్టినరోజు వేడుకలు సంతృప్తికరంగా వున్నాయా?"

"మీ దయవల్ల"

"మాదయ ఏముందమ్మా! నీమంచితనం"

"దయామయులగువారి అండవుంటేనేకదా ఆ మంచి తనమైనా ఫలించేది!"

"నీవు మాటలు నేర్వలేదనుకున్నానమ్మా, గడుసు దానివే!"

అన్నపూర్ణ ముభావంగా నవ్వింది.

"ఈరోజుల్లో మాటలు నేర్వనివాళ్ళు ఎవరున్నా రండీ!" కామేశ్వరి వ్యాఖ్యానం చేసింది.

"నీ విషయం చెప్పుదూ!" రంగారావు ప్రశ్న వేశాడు. కామేశ్వరి మనస్ఫూర్తిగా నవ్వింది. "నాదే ముందండీ, మీతోపాటే నేనూను"

యీసారి రంగారావు నవ్వుకున్నాడు. రెండు నిమిషాలు మౌనంగా గడిచాయి.

రంగారావు ప్రారంభించాడు. "అన్నపూర్ణా! నిన్ను ఒక ముఖ్యమైన విషయం అడుగుతాను. బాగా ఆలోచించుకొని సమాధానం చెప్పు."

అన్నపూర్ణ వెలా తెలా పోయి కామేశ్వరివైపు చూసింది. కామేశ్వరి "అడగండి" అంది.

"నీ వకాలత్ ఎందుకోయ్, మధ్యలో?"

"ఆమె భయపడుతుంటేనూ!"

"నా దగ్గర భయం దేనికమ్మా! నిన్ను ఒక బిడ్డలాగా చూస్తుంటిమిగా!"

"అందుచేతనే భయం" మళ్ళీ కామేశ్వరి సమాధానమిచ్చింది.

రంగారావు అన్నపూర్ణవైపు తిరిగి "యిటు చూడమ్మా! నేను చెప్పేమాటలు శ్రద్ధగా విని బాగా

ఆలోచించుకొని సమాధానం చెప్పు. నీకు యింకా చిన్న వయస్సు. నీ జీవితమంతా పరాయికొంపల్లో చాకిరీ చేసి బ్రతకాలనుకోవడం మంచిదికాదు. ఆ పరిస్థితులలో నీకుగాని, నీ బిడ్డకుగాని మంచి భవిష్యత్తు వుంటుం దనుకోవడం భ్రమ. నా సలహా యేమిటంటే నీవు తిరిగి వివాహం చేసుకోవడం మంచిదని. నీవు అందుకు అంగీకరిస్తే నే నొక మంచిసంబంధం చూశాను. అతను నా వయస్సువాడే! విద్యావంతుడు, సంపన్నుడు, యోగ్యుడుకూడాను!"

అన్నపూర్ణ తల వంచేసింది.

"యెవరండీ ఆయన! మన డాక్టరు సుదర్శనం గారేనా!" వెంటనే అడిగింది కామేశ్వరి.

రంగారావు అవు నన్నట్లు తలవూపాడు.

కామేశ్వరి మళ్ళీ అంది "చాలా అదృష్టవంతురాలివి అన్నపూర్ణా!"

రంగారావు చిన్నగా నవ్వాడు "ఆవిడ అంగీకారం తెలపకుండానే నీ అభినందన లేమిటోయ్!"

"అంగీకరించక బ్రతికినంతకాలం వంటకత్తెగా వుంటుం దేమిటండీ!" కామేశ్వరి సమాధానం చెప్పింది.

అన్నపూర్ణ వంచినతల ఎత్తకుండానే "మావాళ్ళు యెవ్వరూ ఆమోదించ రనుకుంటానండీ!"

"నా సలహా నీకు నచ్చితే మిగతా విషయాలన్నీ నేను చూసుకుంటాను."

"అయితే మీ యిష్టప్రకారం జరపండి."

రంగారావు ఎగిరి గంతేశాడు. కామేశ్వరి కాఫీగ్లాసు తెచ్చి రంగారావుముందు పెట్టింది. రంగారావు పరమానందంతో ఆ గ్లాసు పైకిఎత్తి చూపుతూ "అన్నపూర్ణా! నీవు యికనుండీ సుఖప్రదమైన జీవితం గడుపుతావనడంలో యేమాత్రం సందేహం లేదు. సుదర్శనం, నేనూ మా చిన్నతనం నుండీ కలసి మెలసి వుంటున్నాం. యీ రోజువరకు అన్నదమ్ములకంటేకూడా సన్నిహితంగా వుంటాం. వాడు కేవలం డాక్టరుమాత్రమే కాదు. మేధావి, రచయిత, చిత్రకారుడు, అన్నింటినీమించి రసికుడు. కాబట్టి నీ భవిష్యత్తు ఆనందంగా గడపగలుగుతావని నేను హామీయిస్తున్నా" అన్నాడు.

అన్నపూర్ణ మాట్లాడలేదు. కామేశ్వరి ప్రశ్నించింది. "మరి మల్లిక వ్యవహారం ఏమిటండీ?"

"వాళ్ళు ఏనాడో విడాకులు పుచ్చుకున్నారు. ఆ పేచీ యేమీ లేదు. పైగా మల్లిక అనాధశరణాలయం ఒకటి పెట్టి సంఘసేవలో నిమగ్నురాలయింది. సుదర్శనం యీ వివాహం చేసుకుంటే ఆవిడ చాలా సంతోషిస్తుంది కూడాను!"

రంగారావు కాఫీ చప్పరిస్తూ లోపలికి పోయాడు. అన్నపూర్ణ గుండెమీద చెయ్యిపెట్టి "అక్కా! చాలా భయంగా వుంది" అన్నది.

"పిచ్చిదానా, భయం దేనికమ్మా! పరాయికొంపల్లో వూడిగంచేసే దుర్గతి తొలగిపోతున్నందుకు సంతోషించక!"

"యేమో అక్కా !"

"యేమోలేదు గీమోలేదు. నీకు యీ సంబంధం దొరకడం పేదవాడికి పెన్నిధి దొరికినచందంగా వుందే తల్లీ !"

"అక్కా, రంగనాయకమ్మగారు ఏమంటుందో?"

"రంగనాయకమ్మబెడద నీ కెందుకే! నీకు పెండ్లి అయిన మరుక్షణంలో నీ మేడలో నీవు ప్రవేశిస్తావు. అనుకూలుడైన భర్త, కారు, సినిమాలు, షికార్లు. నీకేమే, రాణిలా అనుభవిస్తావు !"

"యిదంతా మీ చలువే. మీ మేలు నేను ఎన్నడూ మరచిపోను అక్కా !" అంటూ అన్నపూర్ణ కామేశ్వరిని కౌగలించుకుంది. కామేశ్వరి అన్నపూర్ణ చెక్కిళ్ళునిమిరి నుదుటిమీద ముద్దుపెట్టుకుంది.

"అక్కా, నీకో విషయం చెప్పనా !"

"చెప్పు !"

"డాక్టరుగారు మొదటినుండీ నావంక అదోలా చూసేవారు."

కామేశ్వరి చిరునవ్వు నవ్వింది. "బహుశా యింత చిన్నవయస్సులో ఈ చక్కనిచుక్క వైధవ్యం అనుభవిస్తూందే అని జాలితో చూచి వుంటారు."

# ప్రకరణ 6

అన్నపూర్ణ, డాక్టరు సుదర్శనంగార్ల వివాహం ఆడంబరా లేమీ లేకుండా జరిగిపోయింది. రిజిస్ట్రేషను అయినతరువాత రంగారావు క్లబ్బులో యిచ్చిన టీ పార్టీకి లాయర్లు, డాక్టర్లు, ఆఫీసర్లు చాలామంది హాజరయ్యారు. మల్లికకూడా వచ్చింది. దంపతులను అభినందిస్తూ పలువురు ప్రసంగించారు. మల్లిక తన వివాహ సందర్భంలో సుదర్శనం తనకుపెట్టిన నెక్ లెసూ, రవ్వలగాజులూ తీసి స్వయంగా అన్నపూర్ణకు అలంకరించింది. విలువైన చీరెలు, జాకెట్లు పసుపు కుంకుమతో అన్నపూర్ణకు అందించింది. సుదర్శనం కళ్ళు వత్తుకున్నాడు అన్నపూర్ణ మల్లికపాదాలకు నమస్కరించింది.

కామేశ్వరిపక్కనే కూర్చున్న శాంత తల్లిభుజంమీదికి వంగి "అమ్మా! అన్నపూర్ణవివాహం స్టేజీమీద డ్రామాలో తంతుమాదిరిగా వుందే!" అంది. కామేశ్వరి కనుకొనల నుండి ఆనందబాష్పాలు రాలాయి.

అన్నపూర్ణ యెడబాటు కామేశ్వరికి భరించరానిదే అయింది. దానికితోడు రంగనాయకమ్మ పస్తుపడుకుంది. కామేశ్వరికి యేమీ తోచుబడి కాలేదు. "ఒకసారి అన్నపూర్ణదగ్గరకు పోయివస్తే!" అనుకుంది. శాంత స్నేహితురాలి దగ్గరకిపోయి యింకా తిరిగిరాలేదు రంగారావు కాలేజీకి వెళ్ళాడు. రెండుగంటలకుగాని తిరిగి రాడు. ఈ లోపున

తను అన్నపూర్ణ ఇంటికి వెళ్ళనూవచ్చు, తిరిగి రానూవచ్చు. కాని రంగనాయకమ్మ తెల్లవారి మొహంకూడా కడిగినట్టు లేదు. తనువెళ్ళి భోజనానికి రమ్మని పిలిచింది. ఆమె అసలు పలుకనేలేదు. పదినిమిషాలు నిలబడి తను వచ్చేసింది. అన్న పూర్ణ పెండ్లి చేసుకున్నందుకు రంగనాయకమ్మ తమను యిలా సాధించడానికి తలపడిందని కామేశ్వరి అనుకుంది.

ఇంటిముందు కారుహారన్ మోగింది. నౌకరు గేటు తెరిచాడు. రంగారావు లోపలకువస్తూ భార్యవైపుచూచి "యేమిటోయ్ ! నీ అవతారం దివాళాతీసినవాడి మొహంలా వుందే! అన్నపూర్ణకోసం బెంగపెట్టుకో లేదుగదా ?" అన్నాడు.

కామేశ్వరి నీరసంగా నవ్వింది. "వదినెగారు తెల్లవారి లేవలేదు. మొహంకూడా కడుగలేదు."

"కారణం యేమిటో ?"

"యేమో ! నేనువెళ్ళి పిలిచాను. కాని ఆమెగారు పలుకనే లేదు."

రంగారావు బట్టలుమార్చుకుని మేడమీదికి వెళ్ళాడు. రంగనాయకమ్మ గచ్చునేలమీద చెంగుపరచుకుని పరుంది. అతను ఆమెకు దగ్గరగా నిలబడి "చెల్లెమ్మా" అని పిలిచాడు.

రంగనాయకమ్మ లేచి కూర్చుంది. ఒకప్రక్కకు జరిగి గోడకు ఆనుకొని కళ్ళు తెరవకుండానే "ఏమిటి అన్నయ్యా ?" అంది.

"భోజనం చెయ్యలేదుటగా !"

"నాకేమీ బాగుండలేదు అన్నయ్యా !"

"బాగులేనిదానివి ఆ కటిక గచ్చునేల మీద పండు కోవడం ఎందుకమ్మా! డాక్టరును పిలుస్తాను."

రంగనాయకమ్మ కళ్ళు తెరచి రంగారావువైపు చూసింది. "అన్నయ్యా! నామనస్సు బాగులేదు. నేను ఉపవాసాలు చెయ్యదలచుకున్నాను. డాక్టరును పిలువవలసిన అవసరం లేదు."

"చెల్లెమ్మా! ఎవరిమీద నీ కోపం! యేమి సాధిద్దామని యీ ఉపవాసాలు ?"

"నా కోపతాపాలతో యెవరికీ నిమిత్తంలేదు బాబూ! నా ఆత్మసంతృప్తికోసమే ఉపవాసాలు చెయ్యదలచుకున్నాను."

"అదేమిటి చెల్లెమ్మా! నీ కోపతాపాలతో యెవరికీ నిమిత్తంలేదని నీవు ఎందు కనుకోవాలి ? నీ కష్టసుఖాల్లో భాగస్వాములుగా వుంటూన్నవాళ్ళం ఇంట్లో ముగ్గురం వున్నాం గదా !"

"యేమో అన్నయ్యా! నేను చాలా విరక్తి చెందాను. నా మనస్సు విరిగిపోయింది. అనాదిగా వుంటూన్న మన మతసాంప్రదాయాలను, ధర్మాలను, ఆచారాలను మీరు పాటించకపోతే పోవచ్చు. కాని వాటిని తూలనాడి శాస్త్ర విరుద్ధమైన వివాహం చేయించారు. అది నేను సహించలేకుండావున్నాను. అందుకోసమే ఈ ఉపవాసాలు.

అంతేకాదు. ఈ ఇంట్లో నేను ఒక్కఘడియకూడా వుండ లేను, వుండను. నాదారి నేను చూసుకుంటాను."

రంగారావు ఖిన్నుడయ్యాడు రెండునిమిషాల తరువాత "చెల్లెమ్మా! నీ నమ్మకాలను వదలుకోమని మేమెవ్వరమూ నిన్ను నిర్బంధించవేదు. నీపట్ల నాకెప్పుడూ సానుభూతి వుంది. అయినా మనఇంట్లోనుండి నీవు వెళ్ళిపోయేంతటి దుర్భర పరిస్థితులు ఏమివచ్చాయో నేను వూహించలేకుండా వున్నాను. ఈ పరిస్థితులలో నీవు ఇల్లు బయలుదేరి యెక్కడికి పోయినా యెన్నో అపవాదులు వస్తాయి. పైగా నేను నిందలకు గురిఅవుతాను. మన కుటుంబశ్రేయస్సు దృష్టితో నేనొక సలహా యిస్తాను. యేమిటంటే, ఒక వారంరోజుల్లో మా కాలేజీ మూసి వేస్తారు. సెలవల్లో నేనూ, కామేశ్వరీ బెంగుళూరుకు పోతాము. నీవూ, శాంతా యిక్కడే వుండిపొండి. పోనీ నీకు ఇక్కడవుండడం అంతగా యిష్టంలేకపోతే నేను తిరిగివచ్చిన తర్వాత ఇతరయేర్పాట్లను గురించి ఆలోచిద్దాం" అన్నాడు.

"శాంతకూ, నాకూ అసలు పొసగదు అన్నయ్యా!"

"అదేమిటిచెల్లెమ్మా, నీ చేతులలో పెరిగిన బిడ్డే గదా!"

"యేమో అన్నయ్యా? అది ఈ మధ్య ఒక వితండ వాదం ప్రారంభించింది."

"యే మని?"

"నేను వివాహం చేసుకోవాలట. లేకపోతే తనూ అవివాహితగానే వుండిపోతుందట."

రంగారావు నవ్వకుండా వుండలేకపోయాడు. ఆ వుత్సాహంలో అతను అనర్గళంగా మాట్లాడుకుపోయాడు.

"చెల్లెమ్మా! నీపట్ల మన శాంతకు యెంతటి అవ్యాజప్రేమో ఆ మాటలనుబట్టి మనం గ్రహించవచ్చు. శాంత వయస్సులో చిన్నదే కావచ్చు. కాని ఆమె హృదయం పరిపక్వం చెందిందనే నేను అనుకుంటున్నాను. ఇంతకాలంగా యే భావాలనైతే నేను నీ ముందు సూచనగానైనా అన డానికి సాహసించలేక పోయానో వాటినే, సరిగ్గా ఆ భావా లనే శాంత నిష్కల్మష హృదయంతో నీకు చెప్పగలిగింది. ఒక అమాయిక బాలికగా వూహిస్తున్న మన చిన్నారిశాంత తనలో రగులుతూన్న ఈ నిగూఢభావాలను నీ ముందు పెట్టడం నాకూ, నీకూ ఒకమార్గం చూపించిందనే నేను అభి ప్రాయ పడుతున్నాను."

రంగనాయకమ్మ నోరు తెరిచేలోగా మళ్ళీ రంగారావు అందుకున్నాడు.

"చెల్లెమ్మా! హాస్పిటల్లో శాంత పుట్టినసమయంలో దానినిగురించి నీవు అన్నవాక్యాలు నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకమున్నాయి. 'పిల్ల సాక్షాత్తూ మన అమ్మే అన్నయ్యా' అని ఆ నాడు నీవు అన్నమాటలు అక్షరాలా నిజమని నేను యిప్పుడు అనుకుంటున్నాను. నిజంగా శాంత నీకూ, నాకూ కూడా అమ్మే! మన అమ్మే శాంతనోటిద్వారా ఆ వాక్యాలు చెప్పించిందని నీవు యెందుకు అనుకోకూడదు!"

రంగనాయకమ్మ రెండు చేతులతో గుండె బాదుకుంది. అమ్మా! నువ్వు యెక్కడ వున్నావే అమ్మా! అమ్మా!

నా బ్రతుకు యింత దుర్భరంచేసి పోయావా? నన్ను ఏమి చేయమంటావే అమ్మా! నాకు దారిచూపవా అమ్మా, అమ్మా!" అంటూ రోదించింది.

కామేశ్వరి కంగారుగా పైకి పరుగెత్తుకు వచ్చింది. ఇంటినౌకర్లంతా క్రింద పోగయ్యారు. రంగారావు చెల్లెలి నోదార్చేందుకు సతమత మయ్యాడు. ఒకచేతిని ఆమెనోటికి అడ్డుపెట్టాడు. రెండోచేత్తో ఆమెగడ్డం పట్టుకుని "ఊరుకో చెల్లెమ్మా! నువ్వు యిలా శోకాలుపెడితే వీధి వీధంతా యిక్కడ పోగవుతారు. అపహాస్యంపాలు అవుతాం. నా మాటవిను చెల్లెమ్మా!" అంటూ ఆమెను బ్రతిమాలి, జాలిగా ఆమెకళ్ళల్లోకి చూశాడు.

రంగనాయకమ్మ తేరుకుంది. కాని మరుక్షణంలో నెత్తినున్న ముసుగు ముఖంమీదికంటా లాక్కుంది. గచ్చు నేలమీద బోర్లపడి "అమ్మా! నా బ్రతుకు యిలా బండలవు తుందని నువ్వు అనుకోలేదా అమ్మా!" అంటూ శోకం పెట్టింది. కామేశ్వరి బిత్తరపోయి చూసింది.

రంగారావు లేచి నిలబడ్డాడు. అతని కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. పెదవులు వణికాయి. మాటలు తడబడ్డాయి. భార్యవైపు చూస్తూ "కామూ! మన శాంత యెక్కడ?" అన్నాడు.

భర్త దీనావస్థను చూడలేక కామేశ్వరి హడలి పోయింది ఆమె ఒక్కసారిగా అతన్ని కౌగిట్లోకి తీసుకుని ఓదార్చా లనుకుంది. కాని తమాయించుకుని "వాళ్ళ

స్నేహితురాలి అక్క పెండ్లి. యీ ఉదయం వాళ్ళు కారులో వచ్చి తీసికెళ్ళారు." అంది.

"పెండ్లివారి యిల్లు ఎక్కడ ?"

"ముందువీధిలో దక్షిణామూర్తిగారి మేడ ప్రక్క డాబా."

రంగారావు క్రిందికిదిగి కారుయెక్కి వెళ్ళాడు. పది నిమిషాల తరువాత కారు తిరిగివచ్చింది. యీ సారి శాంత కూడా వచ్చింది.

మొత్తంమీద శాంత ప్రయత్నాలు ఫలించాయి. రంగనాయకమ్మ లేచి మొహంకడిగింది. శాంతా, ఆమే కలసి భోజనంచేశారు. ఆ రాత్రి శాంత తండ్రితో చెప్పింది. "నాన్నగారూ! అత్తయ్య ఉయ్యూరు వెళుతుందట. అక్కడి యిల్లు బాగుచేయించమని మీకు చెప్పమంది."

"సరే, అలానే బాగుచేయిస్తానని చెప్పు." అన్నాడు రంగారావు.

◆ ◆ ◆ ◆

రెండువారాలు గడిచాయి. ఉయ్యూరులో ఇంటి మరమ్మతులు పూర్తిఅయినట్లు కబురువచ్చింది. రంగనాయకమ్మ తన ప్రయాణం దశమీ గురువారం బాగుందని ఆ రోజున నిశ్చయించుకుంది. కాని గుమాస్తా శాస్త్రిగారు, దశమీ గురువారంకంటే సప్తమీ సోమవారం ప్రయాణాలకు దివ్యమైన రోజని సలహా యిచ్చారు. రంగనాయకమ్మ గుమాస్తాగారి సలహా ఆమోదించింది. శాస్త్రిగారు లగ్నాలు,

ముహూర్తాలు నిర్ణయించడంలో ఘటికులని రంగనాయమ్మ విశ్వాసం.

శాస్త్రిగారి అసలు పేరు పప్పు గణపతిశాస్త్రి. వయస్సు యాభై సంవత్సరాలకు పైగావుంటుంది. బట్టతల, మొహాన విభూతిరేకలు, విశాలమైన ఛాతీ, అలవికాని ఉదరమూ, పిళ్ళగోచీ, మోకాళ్ళదిగని కట్టుపంచె, పొట్టిగా, గుండ్రగా రుబ్బుపాత్రంలా అగుపిస్తాడు.

శాస్త్రిగారు ఒకప్పుడు కిరాణాకొట్లో, మరొకప్పుడు బట్టలకొట్లో, ఆ తరువాత ఫ్యాక్టరీలో గుమస్తాగా వున్నాడు. కిరాణాకొట్టు ఆసామికీ శాస్త్రిగారికీ యెందుచేతనో కలిసిందికాదు. అందుచేత ఆయన శాస్త్రిగారిని పనినుండి తొలగించాడు. తరువాత బట్టలకొట్టు దివాళా తీసింది. ఇక ఫ్యాక్టరీలోమాత్రం శాస్త్రిగారి నెత్తిమీద బ్రహ్మాండమైన అభాండం పడింది. ఫ్యాక్టరీకి ధాన్యం తోలిన ఒకరైతుకు రెండువేలు పైచిలుకు రొక్కంయిచ్చి రశీదు పుచ్చుకున్నానన్నాడు శాస్త్రిగారు- కుమ్మోక్కయ్యేరో, పదిరోజులు పేకమేరు చుట్టూ తిరిగినాచిల్లిగవ్వకూడా తనకు ముట్టలేదన్నాడు రైతు. మొత్తం వ్యవహారం కోర్టు కెళ్ళింది. పాపం శాస్త్రిగారికి రెండేళ్ళుకఠినశిక్ష పడింది. ఆపైగా జరిమానాకూడా వేశారు.

శాస్త్రిగారు జైలునుండి విడుదల అయి వచ్చాక ఎక్కడా వుద్యోగం కుదరలేదు. శాస్త్రిగారికి యిద్దరు కుమార్తెలు. పాపం యిద్దరూ విధవలే. పెద్దకుమార్తె పార్వతికి రంగనాయకమ్మకు పురాణకాలక్షేపంలో పరిచయమైంది.

అది క్రమేపీ మైత్రిగా పరిణమించింది. పార్వతి తమ కుటుంబగోడు రంగనాయకమ్మకు చెప్పుకుంది. రంగనాయకమ్మ అన్నగారితో సంప్రదించి శాస్త్రిగారికి గుమాస్తా వుద్యోగం యిప్పించింది.

శాస్త్రిగారిపట్ల రంగనాయకమ్మకు సానుభూతీ, గౌరవమూకూడా వున్నాయి. శాస్త్రిగారు సనాతనాచారాలన్నీ తుచ తప్పక పాటించేవారు. సంధ్యావందనం, జపతపాలు, దేవునిదర్శనం మొదలైనవన్నీ ఆయన నిత్యకృత్యాలలో భాగాలు. రంగనాయకమ్మ అప్పుడప్పుడు శాస్త్రిగారి సలహాలను కోరడంకూడా కద్దు. ఆ యింట్లో ఒక్క రంగనాయకమ్మ మినహా మిగతా వారికెవరికీ శాస్త్రిగారిపట్ల సదభిప్రాయం లేదు. రంగారావుగాని, కామేశ్వరిగాని అసలు శాస్త్రిగారి వునికినే గుర్తించినట్లు వుండేవారుకాదు. శాంత తరచు శాస్త్రిగారిని వేళాకోళం చేస్తూండేది.

శాస్త్రిగారు వుద్యోగంలో చేరినమొదటిరోజునే శాంత శాస్త్రిగారినిచూచి "ఏమండీ, మీరేనాగణపతిశాస్త్రిగారు?"

"అవును తల్లీ!"

"అయితే మీరుకూడా వుండ్రాళ్ళు కావాలని అనరు కద!"

శాస్త్రిగారు విస్తుపోయి ఆమెవంక చూశాడు.

శాంత చెప్పుకుపోయింది. "యేమండోయ్, చూశారా? ఆ రాతిగణపతికి వుండ్రాళ్ళు పొయ్యడమంటే నాకు సుతరామూ కిట్టదుసుమండీ!"

"అదేమిటి తల్లీ! అలా అనరాదు!"

"అది సరేగాని, మీరు పుట్టినప్పుడే యిలావున్నారా, ఏమిటండీ, మీ కా పేరు పెట్టారూ మీవాళ్ళు?"

"యేపేరు తల్లీ!"

"అయ్యో! తెలియడంలేదూ! గణపతండీ గణపతి!"

"యేమోతల్లీ"

"యేమండోయ్! మీకూ, ఆ గుళ్ళో రాతిగణపతికీ ఒకతేడా మాత్రం వుందండీ!"

"యేమిటితల్లీ ఆ తేడా?"

"ఆ గణపతికి యేనుగుతొండం వుంది. మీకు అది లేదు."

"యేదో పెద్దముండా వాణ్ణి. అలా వేళాకోళం పట్టించకు తల్లీ!"

"అయ్యో, అయ్యో. ఎంతమాట సెలవిచ్చారు! వేళాకోళంకాదండీ! మీరు సాక్షాత్తూ ఆగణపతి అపరఅవతారులనే నేను చెప్పేది!"

మేడపైనుండి రంగనాయకమ్మ పిలిచి "అమ్మడూ చెప్పినపని ఏమిచేశావు?" అంది.

శాంత తత్తరబిత్తరగా "అయ్యో, అయ్యో! శాస్త్రిగారూ మరచిపోయానండీ. అత్తయ్య మిమ్ములను అర్జంటుగా అంటే జరూరుగా మేడమీదికి రమ్మంటోందండీ!"

శాస్త్రిగారి గుండెలు కుదుట పడ్డాయి. "హమ్మయ్య, ఎక్కడి అసాధ్యపు పిల్లరా బాబూ!" అనుకున్నాడు.

ఫలాహారాలేమైనా మిగులుగావుంటే రంగనాయకమ్మ అప్పుడప్పుడు శాస్త్రిగారికి అందిస్తూవుండేది. ఒక రోజు మధ్యాహ్నం రంగనాయకమ్మ ఒకప్లేటునిండా ఉప్మాపెట్టి అది శాస్త్రిగారికి యిమ్మని శాంతకు చెప్పింది. శాంత ఆ ప్లేటు తీసుకొని "అత్తయ్యా! యీ గణపతిశాస్త్రికి నిత్య నైవేద్యం పెట్టాలేమో" అంది.

"అదేమిటే, ఆయనకు నువ్వు రోజూ ఫలాహారాలు పెడుతున్నావుటే అలా అంటావ్?"

"అదికాదు అత్తయ్యా! రాతిగణపతికి సంవత్సరానికోమారు ఉండ్రాళ్ళు పోస్తే సరిపోతూంది. మరి యీ మానవ గణపతికి నిత్య నైవేద్యం చెల్లించవద్దా అని నా సందేహం."

"పెద్దలను అలా అనరాదమ్మా! తప్పుకదూ?"

"పెద్దలంటే నిర్వచనం ఏమిటో కొంచెం చెప్పవూ అత్తాయ్యా! వయస్సునుబట్టా, సైజునుబట్టా, బుద్దినిబట్టా లేక నడవడినిబట్టా! అదేమిటోకాస్త తెలియ చెప్పు!" అంది.

రంగనాయకమ్మ నోరు పిసుక్కుంది "కలమో, వైష్ణవ మాయయో" అన్నట్టు కోడలి కళ్ళల్లోకి చూసింది. శాంత మందస్మితం చేసింది.

"నీతో వేగలేనే తల్లీ! ఆయన ఆఫీసుగదిలో వుంటారు. పోయి యిచ్చి రావే"

"ఆ ఆ పోతున్నా అత్తయ్యా!" అంటూ రంగనాయకమ్మ వైపు తిరిగి "ఓరోరి గణపాతిరా–నీకుఉండ్రాళ్ళు పెట్టే

దరా" అంది. రంగనాయకమ్మ నవ్వుతూ "అమ్మదూ! ఆయన దగ్గరకూడా అలా అంటావేమో! అనకూడదు తప్పుతల్లీ!"

అన్నపూర్ణను రంగనాయకమ్మ ఎంతగా అసహ్యించుకునేదో శాస్త్రిగారు అన్నపూర్ణను చూచి అంతగా ఈర్ష్య పడేవారు. అన్నపూర్ణ తనలా ఒకనౌకరుగానో, గుమస్తాగానో, పరాయిదానిగానో గాక రంగారావుగారి కుటుంబంలో ఒకవ్యక్తిగా వారిలో కలసి మెలసి పోయింది. ఒక్క రంగనాయకమ్మ మినహా మిగతావారంతా అన్నపూర్ణను అదే విధంగా చూడటం అతనికి ఆశ్చర్యం కలిగించింది. "బహుశా దీనికంతకూ ఏదో ప్రబల కారణం వుండి వుండాలి" అనుకున్నాడతను. కాని ఎంతకాలం వేచిచూసినా అతని అనుమానానికి ఆధారాలేమీ అవుపించలేదు. అయినా అన్నపూర్ణంటే అతనికి మితిమీరిన ద్వేషం.



రంగనాయకమ్మ ప్రయాణం యిక రెండు దినాలు మాత్రమే వుంద. శాస్త్రిగారు సూచించిన విధంగా సప్తమి సోమవారం బయలుదేరడానికే నిర్ణయించుకుంది. ఉదయం కాఫీ అనంతరం శాంత మేడపైన హాలులో సోఫాలో పడుకుని నవలచదువుతోంది. రంగనాయకమ్మ గుమ్మంప్రక్కగా చాపమీద కూర్చుని వేదాంత గ్రంథం తిరగవేస్తూంది. శాస్త్రిగారు గుమ్మంలో నిలబడి "ఏం, అమ్మా! శ్రీ రంగనాయకమ్మ తల్లీ! ఏమిటి సెలవు" అన్నాడు.

రంగనాయకమ్మ తలపైకెత్తి "ఓహో శాస్త్రిగారా! కూర్చోండి" అంటూ తనకు ఎదురుగావున్న ఒక కుర్చీని చూపించింది.

"దేనికిలే తల్లీ! నన్ను రమ్మనికబురు బెట్టారు. అది ఎందుకో కాస్త శెలవుయిస్తే...."

"యేమీలేదు. నాపుస్తకాలు, బీరువా ఉయ్యూరు చేర్చాలి."

"లారీమీద పంపుదామంటారా?"

"ఈ కాస్తభాగ్యానికి లారీకూడా దేనికండీ! ఒక యెద్దుబండి మీద పంపించకూడదూ?"

"పంపించవచ్చు ననుకోండి. ఉయ్యూరు పోడానికి ఒకలారీ మాట్లాడమని నిన్నసాయింకాలమే అన్నయ్యగారు నాతో చెప్పారు"

"ఎందుకో!"

"యేమో తల్లీ! వివరాలు మాత్రం నాతో ఏమీ చెప్పలేదు."

"సరేలెండి. అన్నయ్యతో నేను మాట్లాడతాను."

శాస్త్రిగారు చేతులునలుపుతూ "అమ్మా! ఉయ్యూరులో తమరు ఒంటరిగానే వుండ దలచుకున్నారా?

"ఒంటరిగా గాక నాకు తోడు ఎవరువస్తారండీ?"

"అయ్యో! అదేమిటి తల్లీ! మీరు కోరాలేగాని కోటిమంది సిద్ధమవుతారు."

"ఎవరటా ఆ కోటిమందీని?"

"ఎవరో ఎందుకు తల్లీ! మీరు అంగీకరిస్తే మా పార్వతి వస్తుంది."

"ఆమె వచ్చుకోవద్దూ?"

"అయ్యో తల్లీ! ఎంతమాట! కాకితో కబురుపెడితే రెక్కలుకట్టుకు వాలదూ, మీముందు!"

రంగనాయకమ్మ మందస్మితం చేసింది. "అయితే పిలిపించండి. కొంతకాలం యిద్దరమూ కలసివుంటాం."

"మీ దయ"

"అయితే శాస్త్రిగారూ! అన్నపూర్ణ వివాహాన్ని గురించి మీ అభిప్రాయ మేమిటండీ?"

శాస్త్రిగారు నలువైపులాదృష్టిని పోనిచ్చాడు. ఎవరూ లేరని రూఢిచేసుకున్న తరువాత ఆయన గొంతు తగ్గించి చెప్పకు పోయాడు.

"ఇదిగో రంగనాయకమ్మ తల్లీ! ఆ వివాహాన్ని గురించి నా అభిప్రాయం అడిగావు కాబట్టి చెబుతున్నా. అసలు యీ వివాహమనేది చాలా పవిత్రమైనది. అది వేదోక్తంగా జరుపుకోవడం ఆచారంగా వస్తోంది. ఇంకా యితర పద్ధతులు కూడా వున్నాయనుకో. మనకు సంబంధించినంతవరకు వేదోక్తంగా జరిపిన వివాహాలనే వివాహాలుగా గుర్తిస్తున్నాం.

ఇకపోతే అన్నపూర్ణ వివాహం శాస్త్రవిరుద్ధం. వర్ణ సంకరం కూడాను. అది అసలు వివాహం అని అనిపించు కోదు. నేను ఒక్క విషయం అడుగుతాను. వాళ్ళను సమాధానం చెప్పమనండి. రేపు అన్నపూర్ణకు, సుదర్శనం

గారికి కలిగే సంతానం యే కులంలో చలామణి అవుతారు? బ్రాహ్మణులా? కారు. కాపులా? అంతకంటే కారు. ఇక పోతే మిగిలింది వర్ణ సంకరం. వీళ్ళ గ్రహచారం ఏమి కాలిపోయింది? అయినా ఆ ముండమోపికి పెండ్లి ఏమిటే? యేదో ఆ సుదర్శనంగారు తమవాంఛ తీర్చుకోడానికి ఈవిడను చేరదీశాడు. అంటే ఆవిడ వుంపుడుకత్తెగా చలామణీ కావలసిందే."

శాంత సోఫాలోనుండి ఒక్కసారిగా లేచినిలబడింది. చదుతూవున్న పుస్తకం అవతలికి గిరవాటుపెట్టి చెప్పుతీసి చేత్తో పట్టుకుంది.

శాస్త్రిగారు ఆ చప్పుడు ఆలకించి కంగారుగా ఆమె వైపు చూశాడు. శాంత చెప్పు ఊపుతూ "కబడ్దార్" అన్నట్లు సంజ్ఞ చేసింది.

శాస్త్రిగారు తబ్బిబ్బై "ఆఁ! అంతపనే? అంత పనే!" అన్నాడు.

రంగనాయకమ్మ ఏమీ అర్థంకాక "అదేమిటండీ? అంత కంగారు పడతారు! యేమైంది అక్కడ!" అంటూ వెనక్కి తిరిగింది. కాని శాంత ఆలోపున మళ్ళీ సోఫాలో పడుకుంది. రంగనాయకమ్మ ప్రశ్నించింది. "శాస్త్రిగారూ! విషయ మేమిటో చెప్పరూ?"

శాస్త్రిగారి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. ఏముంది తల్లీ, చెప్పేందుకు? మీ కోడలు, కాదు మేనకోడలు చెప్పుతో కొడతా నంటోంది."

"ఇదెక్కడి విడ్డూరమండీ! అది సోఫాలో నిద్ర పోతుంటేనూ!"

"యదార్థం తల్లీ! నా యజ్ఞోపవీతం సాక్షిగా చెబుతున్నాను." అటూ శాస్త్రిగారు జంఝ్యం తడుముకున్నాడు.

"అమ్మడూ !" రంగనాయకమ్మ స్వరం కటువుగా వినబడింది.

శాంత లేచినిలబడింది. యీసారి ఆమె చేతిలో పుస్తకంవుంది. "యేమిటి అత్తయ్యా !" ఆ కంఠధ్వని కూడా కటువుగానే వుంది.

"యేమిటే ఆ పని?"

"అవును అత్తయ్యా! శాస్త్రిగారి వాగుడు మన స్త్రీ జాతి అంతకూ అవమానకరం. నేను సహించలేక పోయాను."

"ఆయనగారు చెప్పిన విషయాలన్నీ యదార్థాలే కదా !"

"యేమిటి అత్తయ్యా, ఆ యదార్థాలు! నీవుకూడా అలా మాట్లాడతావేం? అన్నపూర్ణ డాక్టరు సుదర్శనంగార్లు రిజిస్టరు వివాహం చేసుకున్నారు. ఆ వివాహం చట్టబద్ధమైనది. ఈ శాస్త్రిగారు కాదుగదా, యీయన్ను సృష్టించిన దేవుడుకూడా యెవడైనావుంటే వాడు దిగివచ్చినా ఆ వివాహానికి చలనంలేదు. పైగా అన్నపూర్ణ ఉంపుడుకత్తె అంటాడా! యీ శాస్త్రిగారి మిడిమిడి జ్ఞానం కబుర్లు నీకు ఆమోదమైతే కావచ్చు కాని నేనుమాత్రం సహించలేను.

సహించను అత్తయ్యా!" అంటూ ఆమె అక్కడినుండి మెట్ల వైపుకు నడిచింది."

రంగనాయకమ్మ ఖిన్నురాలైంది. ఆమె తలక్రిందికి దించుకుంది. శాస్త్రిగారు కళ్ళు వత్తుకున్నారు.

లారీ వచ్చి ఇంటిముందు రోడ్డుమీద నిలబడింది. రంగారావు మేడపైకి పోతూంటే మధ్యలో శాస్త్రిగారు తప్పుకున్నారు.

రంగనాయకమ్మ గుమ్మంలో నిలబడి "అన్నయ్యా! లారీ వచ్చినట్టుంది. మనకోసమేనా?" అంది.

"అవునమ్మా! అక్కడికి యేమేమి అవసరమో చెపితే అవన్నీ లారీకి ఎక్కిస్తారు"

"నా పుస్తకాలు, ఆ బీరువా ఎక్కిస్తే సరిపోతాయి అన్నయ్యా!"

"అదేమిటమ్మా? రెండు మంచాలు, పరుపులు రెండు, మూడుసోఫాలు, ఒక డ్రాయరుకూడా పంపుదాం"

"దేనికి అన్నయ్యా అవన్నీను? నాకు రెండుచాపలు సరిపోతాయిగదా!"

"నీకు చాపలే సరిపోతాయనుకో. ఒకవేళ యెవరైనా బంధువులు వస్తే ఇంట్లో యేమీలేకపోతే యిబ్బంది పడవలసి వస్తుందిగదా!"

రంగనాయకమ్మ మౌనం వహించింది. రెండు నిమిషాల తర్వాత "అన్నయ్యా, మన శాస్త్రిగారి కుమార్తె పార్వతిని నాకు తోడుగా వుండేందుకు తీసుకుపోతున్నా" అంది.

రంగారావు కనుబొమలు చిట్లించాడు. ఒక నిముషం తరువాత "నీయిష్టం అలానే తీసుకువెళ్ళమ్మా" అన్నాడు.

రంగనాయకమ్మ ప్రయాణమై బయలుదేరేవరకు శాంత ఆమెను తప్పుకుని తిరిగింది. "శాస్త్రిగారికి చెప్పి చూపెట్టి పొరపాటు చేశానేమో!" అనుకుంది శాంత.

శాంత తన మొహం చాటువెయ్యడం రంగనాయకమ్మకు ఆ రెండు దినాలు బాధగానే తోచింది. "శాస్త్రిగారి సంభాషణ శాంత లేతహృదయాన్ని గాయపరచింది" అనుకుంది రంగనాయకమ్మ.

సామాన్లతోపాటు పార్వతికూడా ముందుగానే లారీలో ఉయ్యూరు చేరింది. సోమవారం సాయంకాలం నాలుగు గంటలకు రంగారావు తన ప్లిమత్ కారు బయటికి తీశాడు. శాంత, కామేశ్వరి పోర్టికోలో నిలబడ్డారు. రంగనాయకమ్మ యింకా బయటికి రాలేదు.

"శాంతా! నీవుకూడా వస్తావామ్మా? అత్తయ్యను దిగబెట్టి వద్దాం" అన్నాడు రంగారావు.

ఇంట్లోనుండి అప్పుడే వెలుపలికి వచ్చిన రంగనాయకమ్మ జాలిగా శాంతవైపుచూస్తూ "అమ్మడూ, రావు లే నన్ను దిగబెట్టడానికి?"

విలుకాడు వదలిన బాణంలా శాంత రివ్వున ముందుకు దుమికి అత్తయ్య చేతుల్లో వాలింది. ఒకరినొకరు గాఢంగా బంధించుకున్నారు. శాంత అత్తయ్య గుండెల్లో తలదూర్చి వలవల విలపించింది. రెండునిమిషాల తరువాత రంగనాయ

కమ్మ తేరుకుని ఆప్యాయంగా శాంత తల నిమురుతూ "నా చిట్టితల్లివి కదూ ! నేను ఏ దూరప్రాంతాలకు పారిపోతున్నాననీ, యింతయిది అవుతావు! పోదాం కార్లో ఎక్కు." అంది. తరువాత ఆమె కామేశ్వరివైపు తిరిగి "వెళ్ళి వస్తాను వదినా" అని చెప్పింది.

కామేశ్వరి ముకుళిత హస్తాలతో "వదినాగారూ!! నా వల్ల ఏమైనా పొరపాట్లు జరిగివుంటే క్షమించరూ" అంటూంటే ఆమె మాటలు తడబడ్డాయి. కళ్ళవెంబడి నీటిధారలు కారాయి.

రంగనాయకమ్మ కామేశ్వరి చేతులు రెండూ పుచ్చుకుని "ఇంతకాలంగా లేని పొరపాట్లు యిప్పుడేమి వచ్చి పడ్డాయమ్మా అలా అనుకోడానికి?" అంది.

రంగారావు కారు స్టార్ట్ చేశాడు. శాంతా, రంగనాయకమ్మా కార్లో ఎక్కి కూర్చున్నారు. కారు కదలిపోయింది.

# ప్రకరణ 7

వుయ్యూరులో వున్న యిల్లు పురాతనపుదే అయినా అంతా బాగుచేయించి విద్యుద్దీపాలు అమర్చారు. ఇంటి చుట్టూ పెద్ద ఆవరణ. ఆవరణలో పలురకాల పూల మొక్కలు, పెరట్లో బాదంచెట్లు, జామచెట్లు, కొబ్బరి మొక్కలతో ఇల్లు కళకళలాడుతూ ఆకర్షణీయంగా అగు పిస్తోంది. దక్షిణపువైపు ఆవరణను ఆనుకొని చిన్న తోట కూడా వుంది.

రంగనాయకమ్మ మామగారి మరణానంతరం రంగారావు కొంతకాలం వుయ్యూరులోనే వుండి తనకు బాగా పరిచయంవున్న ఖాసిం అనే రైతుకు అక్కడి భూములు, తోటలు, ఇల్లు వగైరాల మీద అజమాయిషీ అప్ప జెప్పాడు. ఖాసిం వయస్సు అరవై దాటాయి. తెల్లటి గడ్డము స్వచ్ఛమైన చూపులు, సన్నగా, బారుగా వుంటాడు. భూములు, తోటలు అమరకానికి యివ్వడము, ఫలసాయం వసూలు చెయ్యడం అన్నీ ఖాసింద్వారానే జరుగుతాయి.

ఖాసింకు యిద్దరు భార్యలు. మొదటిభార్య రజియాబీకి ముగ్గురు కుమార్తెలు. ఖాసిం ఆ ముగ్గురికి వివాహాలు చేసి అత్తవారిళ్ళకు పంపించివేశాడు. ఆ తరువాత ఖాసిం ఒంటరితనం అనుభవించాడు. అందులో రజియాబీకి అనారోగ్యం. అప్పటికి అతనివయస్సు నలభై దాటాయి. ఆపరి

స్థితులలో ఖాసిం రెండోవివాహం చేసుకున్నాడు. రెండో భార్య చాంద్ బీబీ. అందాలరాణి. ఖాసిం ఆమెను అతిగా ప్రేమించాడు. ఆమెకు మంచి మంచి చీరెలు, ఆభరణాలు తెచ్చి యిచ్చేవాడు. అది చూచి రజియాబీ సహించలేక పోయింది. ఒకరోజున ఆమె ఖాసింను నిలబెట్టి అడిగేసింది.

"అరే చాంద్ బీబీకి మగడా! నీ రజియా బీ యింకా చచ్చిపోలేదు. చాంద్‌బీబీ వొక్కతే నీదీ పెండ్లాంకాదు. రజియాబీకూడా నీపెండ్లామే. నీకి తెచ్చే సాడీ, కపడా గట్రా నీదీ యిద్దరి పెండ్లాల్కి సమంగా పంచీ యియ్యాలి! అట్లాగు చెయ్యను అంటావు, నాది నాకి యివతల్కి పారేయ్. నాదారిని నేనూ పోతాన్" అన్నది.

. ఖాసిం కులాసాగా నవ్వుకున్నాడు. రోగిష్టిగానున్న రజియాబీని మందలించకూడ దనుకున్నాడు. అతను ఆప్యాయంగా రజియాబీ భుజంపట్టుకుని ప్రక్కకు తీసుకుపోయి కూర్చోబెట్టి నెమ్మదిగా చెప్పాడు.

"మే ఆపాకీమా! జగడా మత్ కరో, రజియా! నీవు పోట్లాటకు దిగడం మంచిదికాదు. కాని లోగడ జరిగిన విషయాలు కొన్ని నీ దృష్టికి తీసుకురావడం అవసరం. మన పెద్దమ్మాయి ఆపా పెడ్లికి వెయ్యి రూపాయిలు, రెండో అమ్మాయి నూరూ పెండ్లికి ఎనిమిది వందలు, మూడో అమ్మాయి జేబున్నీసా పెండ్లికి యెనిమిదివందలు ఖర్చు పెట్టాం. మన పెండ్లినాడు మా నాయిన నీకు వెయ్యి రూపాయల వస్తువులు పెట్టాడు. వందరూపాయలు పెట్టి బనారసు చీరె తెచ్చాడు. ఇకపోతే యిప్పుడు చాంద్‌బీబీకి

పెట్టిన వస్తువులన్నీ కలసి అయిదువందలుకూడా చెయ్యవు. అంతేగాదు, నేను చాంద్‌బీబీకి తెచ్చిన చీరెలన్నీకలసి నీ ఒక్క బనారసు చీరె ఖరీదు చెయ్యవు. ఇక అసలు విషయం చెపుతా విను. ప్రస్తుతం మనకు ఆరు యకరాలు సాగుభూమి వుంది. అందులో నీకు యెంత కావాలో సబబుగా అడుగు, యిస్తాను నీ యిష్టం వచ్చినచోట వుండువుగాని" అన్నాడు.

రజియాబీ మెత్తబడింది. "ఓ నా ఖాసిం! నీకీ యెంత మంచివాడివీ! నాకీ భూమీ గట్రా యేమీ వద్దు. సంవత్స రానికి ఫదీ బస్తాల్ గింజెల్ యిస్తే మన అమ్మాయిలా దగ్గరకుపోయీ అక్కడా వుంటాన్," అని చెప్పింది.

ఖాసిం రెండో వివాహం అయిన సంవత్సరానికే చాంద్‌బీబీ కొడుకును కన్నది. తరువాత మరి సంతానంలేదు. ఆ కొడుకునుచూసి ఖాసిం మురిసిపోయాడు. రహీం అని నామకరణం చేశాడు. "మావాడికి పెద్దచదువులు చెప్పించి వుద్యోగస్తుణ్ణి చెయ్యాలి" అనేవాడు ఖాసిం.



రంగనాయకమ్మ వుయ్యూరులో మకాం వెయ్యడం పట్ల ఇరుగు పొరుగు, ముఖ్యంగా జ్ఞాతులు తలొక రీతిగా వ్యాఖ్యానించారు.

"ఈవిడ అన్నగారి భార్యతో పేచీవచ్చి ఇక్కడకు చేరింది" అన్నారు ఒకరు.

"తన ఆస్తి అంతా అన్నగారు కాజేస్తున్నాడని తనే స్వయంగా వ్యవహారాలు చూసుకునేందుకు ఇక్కడ కాపురం పెట్టింది" అన్నారు యింకొకరు.

"అవేమీ కాదు. యీవిడకు పెండ్లి చేసుకోవాలనే అభిప్రాయం కలిగిందట! అన్నగారు అభ్యంతరం చెబితే యిక్కడకు వచ్చేసింది" అన్నారు మరొకరు.

రంగనాయకమ్మ పెదమామగారికొడుకు కుటుంబరావు యేదో పనికల్పించుకుని ఒకటికి పదిసార్లు రంగనాయకమ్మగారి యింటిముందు తిరగడం సాగించాడు.

భర్తపోయిన నాటినుండీ రంగనాయకమ్మ అప్పుడప్పుడు వచ్చి షయ్యార్లులో యే ఒకటి, రెండు దినాలో వుంటూ పోతూ వచ్చినప్పటికీ ఆమె యేనాడూ జ్ఞాతుల యిండ్లకుగాని యిరుగుపొరుగు యిండ్లకుగాని పోవడం జరగలేదు. అదీగాక రంగనాయకమ్మభర్త పోయినప్పుడు జ్ఞాతులతో వచ్చిన విబేధాలు సమసిపోలేదు. అయినా కుటుంబరావు తన యింటిముందు తరచు యెందుకు తిరుగుతున్నాడా! అని రంగనాయకమ్మ ఆలోచనలో పడింది.

పగలంతా యెలా గడిపినా రాత్రిళ్ళు బిక్కు బిక్కుమంటూ వుండేవాళ్ళు. తనూ, పార్వతీ లోపల పండుకుని తలుపులు గట్టిగా బిగించుకునేవాళ్ళు. ముసలిఖాసిం ముందు వసారాలో పరుండేవాడు. రంగనాయకమ్మ ఆలోచనలు పరిపరి విధాల పోయాయి. తను బెజవాడనుండి కదలిరావడం అనాలోచితమనుకుంది. భర్తపోయినా, తల్లిపోయినా యింతకాలం అన్నగారి సంరక్షణలో నిశ్చింతగా గడిచి

పోయింది. కాని వుయ్యూరువచ్చి కొద్దిదినాలే గడిచినా తనకు యెన్నో సమస్యలు యెదురయ్యాయి. దాయాది కుటుంబరావు చీకటిపడిన తరువాతకూడా తన యింటి ముందు పచార్లు సాగిస్తున్నాడు. పార్వతి కొరకరాని కొయ్యగా తయారైంది. పగలంతా పని వున్నా, లేక పోయినా వీధిగుమ్మంలో నిలబడి వచ్చే పోయే వారివంక చూస్తూ వుంటుంది. అది తగదని పార్వతిని తను రెండు మూడుసార్లు హెచ్చరించింది. అయినా పార్వతి "నాకు యీ యింట్లో యేమీ తోయ్యడంలేదు తల్లీ! యేమి చెయ్య మంటావు?" అని ముభావంగా సమాధానం యిచ్చింది. కాని వీధివాకిట్లోకి పోవడంమాత్రం మానుకోలేదు.

"ఈ విషయాలన్నీ అన్నయ్యకు చెప్పడం మంచి దేమో!" అనుకుంది రంగనాయకమ్మ. కాని అభిమానం ఆమెకు అడ్డుతగిలింది. అన్నగారితో అనవసరంగా పేచీపెట్టు కుని ఆయన వద్దన్నా తను బయలుదేరి వచ్చేసింది. యింకా రెండువారాలైనా సరిగా గడవలేదు. యీలోపున యెన్నో సమస్యలు యెదురయ్యాయి. "అయినా కొంతకాలం వేచి చూద్దాం" అనుకుందామె. ఆ పరిస్థితులలో ఖాసిం కుటుంబం ఆమెకు ఆత్మీయులుగా అగుపించారు. వారితో సాన్ని హిత్యం పెంపొందించుకొంది ఆమె.

ఒకనాటి సాయంకాలం ముసలిఖాసిం తన కుటుంబ పరిస్థితులను గురించి రంగనాయకమ్మను చెప్పుకున్నాడు. "నా బిడ్డ రహీం యిక్కడ మిల్లులో నాలుగు సంవత్సరాలు పనిచేశాడు. నెలకు ఎనభైరూపాయలు జీతం యిచ్చేవారు.

మావాడికి మంచిచదువే చెప్పించాను, కాని యేమిలాభం? యఫ్. ఏ. ఒకసారి తప్పిపోయాడు. అంతే. యిక మళ్ళీ కాలేజీకి పోనని పేచీపెట్టుకున్నాడు. సరే, ఒక్కగాను ఒక్క బిడ్డ. వాడిని నేనేమీ వత్తిడి చెయ్యలేదు. పెండ్లి చేశాను. వెంటవెంటనే ముగ్గురు సంతానం కలిగారు. నాలుగో కాన్పుకు మా కోడలికి చాలా కష్టమైపోయింది. హాస్పిటలులో చేర్పించాను. మారోజులు బాగులేవు తల్లీ! రెండో రోజు ఆపరేషనుచేసి శిశువును తీసివేశారు. యేమిలాభం? ఆ సాయింకాలానికే తల్లికూడా చనిపోయింది.

నా బిడ్డతోబాటు నేనూ విచారంలో మునిగిపోయ్యాను. అట్లా యెంతకాలం వుండగలుగుతాం? మళ్ళీ పెండ్లిచేసుకోమని చెప్పాను. కాని వాడు అంగీకరించలేదు. చూడుతల్లీ! నాకు డెభ్భయ్యోపడి. ఇంకా కాస్త పుష్టిగలవాడిని గనుక యీ మాత్రం తిరుగుతూన్నా. నా తోటివాళ్ళు చాలామంది చచ్చిపోయ్యారు. కొందరు మంచంపట్టారు. అయినా మా వాడికి గ్రహింపులేదు. పెండ్లి చేసుకోకుండా యెంతకాలమని వుంటాడు యిట్లా! ఆ పిల్లలను ముగ్గురినీ సాకలేక ముసలిదాని పనికాస్తా అయిపోతూంది అమ్మాయిగారు!" అన్నాడు ఖాసిం.

"మీవాడు వుద్యోగం చేస్తున్నాడని అన్నావుగా! వివాహం చేసుకునేందుకు అతనికి అభ్యంతరం యేమిటి?" రంగనాయకమ్మ ప్రశ్నించింది.

"లేదు తల్లీ! ఇక్కడకు అయిదారు నెలలక్రితం మిల్లులో సమ్మెజరిగింది. కొద్దిరోజుల తరవాత రాజీపడి

పనివాళ్ళంతా పనులలోకి పోయారు. కాని మిల్లుయజమానులు కొద్దిమందిని పనులలోకి తీసుకోలేదు. అందులో మావాడు ఒకడు. పనిపోతే పోయింది. భుక్తికేమీ లోపం లేదుగా అమ్మా మీ దయవల్ల! ఆరు ఎకరాలు మాగాణి భూమివుంది. మన పొలాలతో పాటు అదీ కట్టుబడికి ఇస్తున్నాను కాస్తాకూస్తా బకాయిపెట్టినా వందబస్తాలు పైచిలుకు వస్తున్నాయి. కాని వాడి అభిప్రాయం యేమిటో 'పెండ్లిమాత్రం వద్దు' అంటాడు"

రంగనాయకమ్మ నవ్వుతూ అంది "మళ్ళీ వివాహం చేసుకుంటే సంతానం మోపు అవుతారని భయపడుతూన్నాడేమో మీ వాడు!"

"సంతానం మోపుఅవుతారని వయస్సులో వున్నవాడు పెండ్లిమానేస్తాడా అమ్మా! రహీంకు యిప్పుడు యిరవై ఆరో సంవత్సరం."

"పాపం చిన్నవయస్సే!"

"రేపు మీ దగ్గరకు తీసుకువస్తాను. మీరు కాస్త కూకలువేసి గట్టిగా చెప్పి చూడండి అమ్మా!"

రంగనాయకమ్మ బెదురుతూ చూసింది. "వద్దు ఖాసిం! అతనితో నాకు పరిచయం లేదుగా!"

"మీ కాళ్ళదగ్గర బతికే వాళ్ళం. మాతో పరిచయమేమిటి తల్లీ!"

రంగనాయకమ్మ నాలుక కరచుకుంది. "నేను అతన్నెప్పుడూ చూడలేదు ఖాసిం!"

"మీరు చూసివుండక పోవచ్చు కాని మా రహీం మిమ్ములను బాగా ఖెరుగును తల్లీ! బెజవాడలో మన యింటికి అప్పుడప్పుడు వస్తూవుంటాడు. అన్నయ్యగారు మావాడిని సరసను కూర్చోబెట్టుకుని భోజనంకూడా పెట్టించే వారట! మిమ్ములను తెలియక పోవడ మేమిటి తల్లీ!"

"నాకు ఆవిషయాలు తెలియవు ఖాసిం! ఇక్కడనుండి యెవరైనా బెజవాడవస్తే అన్నయ్యతోగాని లేక గుమాస్తాలతోగాని మాట్లాడిపోతారు. అంతేగాని నేను యెన్నడూ యెవరినీ పలుకరించను."

"యేమో మీదయ."

"ఖాసిం! రేపు మీ బీబీని పంపించు. అబ్బాయి విషయం అన్నయ్యవచ్చినప్పుడు చూద్దాం."

"చిత్తం తల్లీ!"

మరునాటి మధ్యాహ్నం రెండు గంటలవేళ రంగనాయకమ్మగారి యింటిముందు జట్కాబండి ఆగింది. బండిలోనుండి ముందు ఖాసిం దిగాడు. తరువాత నాలుగుసంవత్సరాల వయస్సువున్న పిల్లను అతను అందిపుచ్చుకున్నాడు. తరువాత బీబీ దిగింది. బీబీ నెత్తిమీద ముసుగు సర్దుకుని ఖాసింవెనుక నెమ్మదిగా అడుగులువేస్తూ లోపల ప్రవేశించింది.

రంగనాయకమ్మ, పార్వతి ఆమెకు ద్వారందగ్గర యెదురయ్యారు. వారివైపుచూసి బీబీ మందహాసం చేసింది. ముసుగుతీసి పక్కనేవున్న బల్లమీద పెట్టింది.

బీబీ పచ్చగా ముగ్గిన దబ్బపండులా మిసమిస లాడు తూంది. తలలో యెక్కడా తెల్లవెంట్రుక వున్నట్టు లేదు. మధ్యపాపటితీసి వదులుగాదువ్వి పాయలుతీసి మెలిపెట్టి పొందికగా చుట్టచుట్టి పిన్నులు దోపింది. గుండ్రని మొహం, విశాలమైన కాటుకకళ్ళు, తాంబూలంనమిలిన యెఱ్ఱని మూతి, చెవులకు లోలాకులు, పసుపురంగు వాయిల్‌చీరె, కెంపువర్ణం సిల్కుజుబ్బా, రెండుచేతులనిండా యెఱ్ఱని గాజులు, 'రాణీవాసం మహిళలా వెలిగిపోతున్న యీ మేనా ఖాసింసాహెబ్ బీబీ!' అనుకుంటూ రంగనాయకమ్మ కళ్ళు అప్పగించి చూస్తూ నిలబడిపోయింది.

"అమ్మా! పొద్దుటనగా చెపితే మా బీబీ ప్రయాణం యిప్పటికిగాని తెమలలేదు తల్లీ!" అన్నాడు ఖాసిం.

రంగనాయకమ్మ తేరుకుని బీబీవైపు చూస్తూ "బీబీ! ఒక్కపిల్లనుమాత్రం తీసుకువచ్చావు. మిగతా యిద్దరినీ కూడా తీసుకువచ్చివుంటే యీరోజు యిక్కడగడిపి రేపు వెళ్ళేవారుగా మీ యింటికి!" అంది.

బీబీ పొడిగా అవ్యక్తంగా నవ్వుకుంది. పార్వతి చాప తెచ్చి పరిచింది. రంగనాయకమ్మ బీబీచేతిని తన చేతుల్లోకి తీసుకుని సోఫాదగ్గరకు నడిచింది. ఖాసిం పిల్లను అక్కడ దించి "చాంద్! బిడ్డను నీ దగ్గరకు తీసుకో. నేను ముందు వసారాలో కాసేపు వుంటాను" అన్నాడు.

చాంద్‌బీబీ "రోషన్! ఆవ్ బేటీ ఆవ్" అంటూ బిడ్డను పిలిచింది. కాని ఆ బిడ్డ కదలలేదు. బిక్కమొహం వేసింది. రంగనాయకమ్మ వచ్చి పిల్లను "యేమ్మా! నీకు భయం

వేస్తూంధా !" అంటూ బుజ్జగించింది. కాని పిల్ల మేడుపు ప్రారంభించింది. పిల్లను బీబీ అందుకుంది.

సోఫాల్లోకూర్చుని పిచ్చాపాటీ చాలా సేపుమాట్లాడారు. రంగనాయకమ్మ యెన్నో ప్రశ్నలు కురిపించింది. బీబీ అతి వినయంగా సమాధానాలు చెప్పింది.

పార్వతి కాఫీ తయారుచేసి తెచ్చింది. రంగనాయకమ్మ ఖాసింనుగూడా కాఫీకి పిలిచింది. ఖాసిం "వద్దుఅమ్మా" అన్నాడు. కాని ఆమె బలవంతం చేసింది. అతను లేచి వచ్చాడు. దంపతు లిరువురినీ సోఫాలో కూర్చోబెట్టి వారికి పళ్ళు, బిస్కట్లు, కాఫీ అందించింది. ఆమె బీబీవంక పరీక్షగా చూస్తూ "బీబీ! నీ వయస్సు ఎంత ?" అని ప్రశ్నించింది.

బీబీ మందస్మితంచేస్తూ "నలభై రెండు బేటీ!" అంది.

రంగనాయకమ్మ ఖాసింవైపుతిరిగి "ఖాశింసాహెబ్ ! నీవు మా బీబీకి చాలా అన్యాయం చేశావు" అంది.

ఖాసిం తెల్లబోయి చూశాడు. "నేనా! చాంద్‌బీబీకి అన్యాయం చేశానంటారా ? లేదుతల్లీ ! అలా యెప్పుడూ చెయ్యలేదు, చెయ్యను. నా బీబీకి అన్యాయంచేస్తే అల్లా క్షమిస్తాడా నన్ను!"

"అదికాదు సాహెబ్! బీబీ యీ రోజువరకు చందమామను వెక్కిరించేట్టుగా వుందిగదా! యీ అందాలరాణిని యింత పెద్దవయస్సులోవున్న నీవు వివాహంచేసుకోవడం ఆమెకు అన్యాయంచెయ్యడం కాదూ!"

ఖాసిం తృప్తిగా నవ్వుకున్నాడు. "అదేముంది తల్లీ! నా అనంతరం ఆమె కావాలనుకుంటే మళ్ళీ వివాహం చేసుకుంటుంది."

రంగనాయకమ్మ నిర్ఘాంతపోయింది. ఆమె బీబీవైపు జాలిగా చూసింది. "బీబీ! సాహెబ్ చెపుతూన్నట్టు నీవు మళ్ళీ వివాహం చేసుకో గలవా?"

"లేదు బేటీ! నా రహీంను వదలి నేను యెక్కడికీ పోలేను. యింత చిన్నవయస్సులో భార్యచనిపోతే మళ్ళీ వివాహానికి వాడు సిద్ధపడడంలేదు. ఇక యీ వయస్సులో నేనా!" బీబీకళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

రంగనాయకమ్మ ఖాసింను బజారుపంపి బీబీకి చీర, రవిక, పిల్లకు గౌను, పండ్లు తెప్పించింది. ఆమె బీబీని బండి వరకూ సాగనంపి "బీబీ! అప్పుడప్పుడూ వస్తావుంటావు కదూ!" అంది.

బీబీ రంగనాయకమ్మను ఆప్యాయంగా కౌగలించుకుని చెక్కిళ్ళునిమిరి తన కణతలకు నొక్కుకుంది. "హాఁ బేటీ! తప్పకుండా వచ్చి పోతుంటాను" అంది.

బీబీ వెళ్ళినతరువాత రంగనాయకమ్మకు ఆమెను గురించిన ఆలోచనలు పోయాయి. "బీబీ యెంత నిండైన విగ్రహం!" అనుకుం దామె. తనను 'బేటీ' అని పిలచింది. అంతేకాదు. అప్యాయంగా కౌగలించుకుని చెక్కిళ్ళునిమిరి కణతలకు నొక్కుకుంది. ఆ పిలుపు, ఆ స్పర్శ యేదో అవ్యక్త మధురానుభూతిని గుర్తుకు తెచ్చింది. తనతల్లి జీవించి వుంటే ఆమెకూడా దాదాపు బీబీవయస్సులోనే వుండివుండేది.

కన్నతల్లి ఆదరణకు తను నోచుకోలేదు. బీబీ తనను కన్న తల్లిలా ఆదరిస్తుందా! అన్న ఆలోచన పోయింది. "ఇదెక్కడి రుణానుబంధం! వాళ్ళు సాహెబులు. మనం హిందువులం!" అనుకుందామె.

కొద్దిరోజులు గడిచాయి. ఒకనాటి సాయంకాలం రంగారావు ప్లిమత్ కారు రంగనాయకమ్మ ఇంటిముందు ఆగింది. రంగనాయకమ్మ స్వయంగావచ్చి వీథితలుపు తెరిచింది. ఆమెచంకలో రహీంబిడ్డ 'రోషన్' వుంది. రంగారావు ప్రశ్నించాడు. "నీచేతుల్లోవున్న బిడ్డ యెవరు చెల్లెమ్మా?"

"మన ఖాసింసాహెబ్ మనుమరాలు అన్నయ్యా!"

"యెవరు తీసుకువచ్చారు?"

"వాళ్ళ నాయనమ్మ వచ్చింది."

"గొప్పవిశేషమే చెల్లెమ్మా! కొత్తస్నేహితుల్ని పోగుచేసుకుంటున్నా వన్నమాట!"

"ఈ పిల్ల చక్కగా వుందికదూ, అన్నయ్యా!"

రంగారావు పిల్లవైపు చూశాడు, బంగారుఛాయ, మెరని మూతి, చక్రాల్లాటి కళ్ళు. "ఆహా! బొమ్మలా వుంది చెల్లెమ్మా!"

"అన్నయ్యా! వీళ్ళ నాయనమ్మ ఖాసింభార్య యెంత అందంగా వుంటుం దనుకున్నావు! నిండైన విగ్రహం!"

రంగారావు మందస్మితం చేశాడు "ముసలమ్మ కదమ్మా!"

"అయ్యో! లేదు అన్నయ్యా! ఆవిడ వయస్సు నలభై రెండు సంవత్సరాలేనట! పేరు చాంద్‌బీబీ. సరిగ్గా పేరుకు తగినట్టుగా వుంటుంది అన్నయ్యా!"

"మధ్యతరగతి ముస్లింకుటుంబాల స్త్రీలు చాలా మంది అలానే వుంటారు. వాళ్ళ అబ్బాయి రహీంకూడా చాలా బాగుంటాడమ్మా!"

"అతన్ని నేను చూడలేదు అన్నయ్యా!"

"ఆరు అడుగుల పొడుగూ, మంచిఆరోగ్యమూ, చక్కని ముఖవర్చస్సూ నేటి సినిమాస్టార్లను మరిపించేట్టు వుంటాడు."

"లోపలకు పోదాం అన్నయ్యా! నిలబడే మాట్లాడుతూన్నాం."

రంగారావు లోపల ప్రవేశించగానే చాంద్‌బీబీ వంటయింట్లోకి పరుగుతీసింది. పార్వతి లబలబ లాడింది. అయ్యో బూబమ్మా! వంటయిల్లుకాస్తా మైలబడిపోయె! అయ్యో తల్లీ! ఆ మూలకు పోకు. అక్కడ పచ్చడి జాడీలు వున్నాయమ్మా తల్లీ!"

రంగనాయకమ్మ వచ్చి వెనుకవైపు వసారాతలుపు తెరిచింది. బీబీ బయటికి నడిచింది. రంగనాయకమ్మ పార్వతిని మందలించింది. "అదేమిటమ్మా పార్వతీ! బీబీకి తెలియక లోపలికి వచ్చిందే అనుకో! ఆ మాత్రానికి అంత లబలబ లాడాలటమ్మా!"

"ఓహో, బాగుంది! నేను యేమన్నానటా బూబమ్మనీ! వంటయిల్లు మైలపడతుం దనేగదా నేను అంటా!"

"నీ మడీ, నీ ఆచారం నేను చూస్తూనే వున్నానులే!"

రంగనాయకమ్మ చాప తెచ్చి వసారాలో పరిచి బీబీతో మాట్లాడుతూ కూర్చుంది. ఖాసిం లోపల రంగారావుతో మాట్లాతున్నాడు.

రంగారావు నవ్వుతూ అన్నాడు "ఖాసిం! మీా బీబీ నన్నుచూచి లోపలికి పారిపోయింది."

"దానికి వల్లమాలిన సిగ్గు బాబుగారూ!"

"చిన్నవాళ్ళముందు సిగ్గు దేనికయ్యా!"

"వయస్సులో పిన్నలైనా తమరు అనుభవంలో పెద్దలే కదా, బాబూ!"

"ఖాసిం! నీవూ పెద్దకబుర్లు నేర్చావు!"

"మీా దయ."

రంగనాయకమ్మ గుమ్మంలో నిలబడి "మీా బీబీ యింటికిపోవా లంటూంది ఖాసింసాహెబ్!" అంది.

"అయితే నేను బయటికిపోయి రిక్షా తీసుకువస్తాను బాబూ!" అన్నాడు ఖాసిం లేచి నిలబడి.

"వద్దులే, కూర్చో ఖాసిం! కారులో తీసుకుపోయి మీా యింటిదగ్గర దిగబెట్టి వద్దాం."

"తమకు అంతశ్రమ యెందుకు బాబూ!"

రంగారావు నవ్వుతూ అన్నాడు. "ఖాసిం! కారు నడపడం యేమంత పెద్దశ్రమ కాదు! మిమ్ములను మోసేది

కారు. నా పని స్టీరింగు తిప్పడంమాత్రమే." అంటూ రంగారావు ఖాసింను కారుదగ్గరకు తీసుకుపోయాడు. అతను స్టీరింగుముందు కూర్చుని రంగనాయకమ్మవైపు తిరిగి "చెల్లెమ్మా! బీబీని తీసుకువచ్చి కారులో యెక్కించు" అని చెప్పాడు.

బీబీ బురఖా సర్దుకుని కారులో యెక్కి కూర్చుంది. రంగనాయకమ్మ రోషన్‌ని బీబీకి అందించింది. ఖాసిం ముందుసీటులో కూర్చున్నాడు.

కారు బయలుదేరే సమయానికి రహీం సైకిలుమీద వచ్చి గుమ్మంలో దిగాడు. రంనాయకమ్మ అతనివైపు చూసింది.

ఖాసిం కారుదిగి "క్యా బేటా! క్యా హోగా!" అన్నాడు కంగారుగా.

"కుచ్ బీ నహీ బాబా!" అన్నాడు రహీం ప్రశాంతంగా. ఆ తరువాత అతను తల్లివైపు తిరిగి "అమ్మా! మన యింటికి బంధువులు వచ్చారమ్మా! మీ చెల్లెలూ ఆమె భర్తా. అందుకే మీ కోసం వచ్చాను!" అన్నాడు.

ఖాసింగుండెలు కుదుటపడ్డాయి.

రహీం రంగారావువైపు తిరిగి "నమస్తే లెక్చరర్ సాబ్!" అన్నాడు.

"నమస్తే రహీం సాహెబ్!"

రంగనాయకమ్మ చూస్తూ గుమ్మంలో నిలబడింది. కొత్తగావచ్చిన అతను ఖాసిం కొడుకు రహీం అని ఆమె వూహించింది.

రంగనాయకమ్మతో "అమ్మా! వీడేనమ్మా నాబిడ్డ రహీం" అన్నాడు. రహీం సైకిలు స్టాండు వేసి రంగనాయకమ్మ వైపు చూస్తూ చేతులురెండూ జోడించి "నమస్తే" అన్నాడు.

రంగనాయకమ్మ ప్రతినమస్కారం చెయ్యలేదు. కాని బీబీతో "బీబీ! మీ చెల్లెలిని ఒకసారి మనఇంటికి తీసుకు వస్తావుకదూ!" అంది.

"హా బేటీ" అంది బీబీ.

రహీం మందస్మితం చేశాడు. కారు కదిలిపోయింది. రహీం సైకిలు కారుముందుకు పోనిచ్చాడు.

రంగనాయకమ్మలో వచ్చిన మార్పుకు రంగారావు పరమానందభరితు డయ్యాడు. విజయవాడలో వుండగా ఆమె శాంతనుమినహా యే ఒకరినీ ఆప్యాయతతో చూడటం అతను గమనించలేదు. కొద్దిరోజుల్లో ఖాసిం కుటుంబంతో ఆమె అతి సన్నిహితంగా మెలగడం, రహీంబిడ్డను యెత్తుకుని తిరగడం అతనికి ఆశ్చర్యంగా తోచాయి. ఆమె విజయవాడ వదలిరావడం ఒకవిధంగా మంచి జరిగిందనే అతను అభిప్రాయపడ్డాడు.

ఖాసిందంపతులను దించి రంగారావు తిరిగివచ్చాడు. అన్నగారిని చూస్తూనే రంగనాయకమ్మ "అన్నయ్యా! అమ్మడిని తీసుకురాలేదేం?" అంటూ ప్రశ్నించింది.

"అవునమ్మా! నీకు చెప్పటం మరచిపోయాను మన శాంత పరీక్షలో నెగ్గింది. క్లాసుకూడా వచ్చింది. నిన్న స్నేహితులతోకలసి దుర్గగుడికి వెళ్ళిందట. ఆ కొండ

మెక్కి దిగేసరికి కాళ్ళు నొప్పులుచేశాయి. తెల్లవారి ఎక్కడికీ కదలలేదు. లేకపోతే తీసుకువచ్చేవాడినే!"

"అయితే వచ్చేసంవత్సరం చదువు ఎక్కడా?"

"యం. బి. బి.యస్. చదివిద్దాం. బహుశా వాల్తేరు లోనే చేర్పిస్తే బాగుంటుందని నా అభిప్రాయం."

వాల్తేరు చాలా దూరంగదా అన్నయ్యా! గుంటూరులో సీటుదొరకదంటావా?"

"సీటుదొరకటం సమస్యగాదు చెల్లెమ్మా! వాల్తేరు వాతావరణం బాగుంటుంది. మనడాక్టరు సుదర్శనంకూడా శాంతను అక్కడే చేర్పించడం మంచిది అంటున్నాడు. వాళ్ళ అన్నగారికుటుంబం, తల్లీ అంతా వాల్తేరులోనే వున్నారు. పైన వాళ్ళుకూడా కాస్త జాగ్రత్త తీసుకుంటూ వుంటారు."

రెండునిమిషాలు మౌనంగా గడిచాయి. రంగనాయకమ్మ వంటయింటివైపు చూసింది. పార్వతి గుమ్మంలో నిలబడి తమవైపు చూస్తూంది. రంగనాయకమ్మ అన్నగారి వైపు చూస్తూ "అన్నయ్యా! యీపూట యిక్కడ వుండి పోకూడదూ?"

"లేదమ్మా పోవాలి. అవసరమైతే వుండేందుకు నాకేమీ అభ్యంతరం లేదు."

"అయితే అలా తోటలోకి పోయివద్దాం రా అన్నయ్యా!"

అన్నా, చెల్లెలు ఇంటి వెనుకభాగంలో వున్న చిన్న తోటలోకి వెళ్ళారు. సపోటా, నిమ్మ, నారింజ, బత్తాయి

చెట్లు కాయలతోనిండి కొమ్మలు భారంగా కిందికి వంగాయి. రంగారావు చెట్లవైపుచూస్తూ "యీ ఋతువులో నారింజ బత్తాయిచెట్లు చాలా అరుదుగా కాస్తాయి. కాని యీ చెట్లు బాగా కాశాయమ్మా!"

"బాగా పోషణ చేస్తున్నారన్నయ్యా! ఎరువులకు బోలెడు ఖర్చుపెట్టాడు."

చెట్లమధ్య పచ్చికమీద యిద్దరూ కూర్చున్నారు. రంగనాయమ్మ ప్రారంభించింది.

"అన్నయ్యా! పార్వతిని త్వరలో యిక్కడినుండి పంపించివేస్తాను."

"కారణం?"

"అది వట్టి తిండిపోతు అన్నయ్యా! మూడు పూటలా తినడం తప్ప మరో పనిలేదు."

రంగారావు పొడిగా నవ్వాడు "తిండితింటే తిననీ అమ్మా! నీకు తోడుగా వుంటోందిగదా!

"దాని తోడూ అదీ తగులబడింది. పగలు పన్నెండు గంటలూ ఆ వీధిగుమ్మంలో చస్తుంది."

"దేనికటా?"

"దేనికేముందీ! వచ్చేపొయ్యే వాళ్ళవంక చూడటానికి. కొద్దిరోజులనుండీ యింకొకటికూడా సాగించింది."

"యేమిటదీ?"

"పనిమనిషిద్వారా వుత్తర ప్రత్యుత్తరాలు నడుపుతూంది."

"ఎవరితోనో!"

"ఎవరో కాదు, మా పెదమామకొడుకు కుటుంబయ్య లేడూ! రాడీవెధవ. వాడితో."

"ఛా! అంతవరకూవచ్చిందీ! సరేగాని యీవిషయాలన్నీ నీ కెలా తెలిశాయి చెల్లెమ్మా?"

"నాకు అనుమానంవేసి యీ ఉదయం పనిమనిషి సుబ్బిని తోటలోకిపిలిచి దాన్ని నిలదీసి అడిగాను. అది అన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది."

"అయితే చెల్లెమ్మా! ఒక పనిచేద్దాం. ఆవిడను మనమేమీ కదిలించకూడదు. నేను రేపు వాళ్ళనాన్నతో మాట్లాడి-ఆయనను యిక్కడకు పంపుతాను ఆయన వచ్చి ఆవిడతో మాట్లాడి తీసుకుపోతాడు."

"బాగుంది అన్నయ్యా!"

"మరి నీకు తోడుకావద్దూ!"

పనిమనిషిసుబ్బి చాలా సంవత్సరాలుగా నమ్మకంగా యిక్కడ పనిచేస్తూందని ఖాసిం చెప్పాడు. దానికీ ఎవరూ లేరు. ఒంటరిబ్రతుకు. దానినే యిక్కడ వుండిపొమ్మంటాను."

"అయితే నే నిక పోవచ్చా?"

"మంచిది. యీసారి వచ్చేప్పుడు ఒక రేడియో తీసుకురా అన్నయ్యా!"

కారు బయలుదేరిపోయిన తరువాత రంగనాయకమ్మ యింటిలోపలకు వెళ్ళింది. పార్వతి అగుపించలేదు. ఆమె

యిల్లు నలుమూలలా వెదికింది. కాని పార్వతిజాడ లేదు. "బహుశా బయటికి పోయివుంటుంది." అనుకుంది.

రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత పార్వతి వీధి తలుపు తట్టింది. రంగనాయకమ్మ మెలకువతో వున్నా లేచి రాలేదు. ఖాసిం తలుపు తెరిచాడు. పార్వతి లోపలికివచ్చి లైటువేసి మంచంవాల్చుకుని పరుపు పరిచింది. రంగనాయకమ్మ ప్రశ్నించింది.

"ఇంత నిశిరాత్రి వరకూ ఎక్కడమ్మా, పెత్తనాలు?"

"నా బ్రతుక్కితోడు పెత్తనాలుకూడానా ?"

"మరి ఏం చేస్తున్నావుటా !"

"సినిమాకు వెళ్ళాను."

"సినిమాకు వెళ్ళేదానివి చెప్పి పోవచ్చుగదా !"

"నీవు మీ అన్నగారితో మాట్లాడుతూ కూర్చున్నావు. నాకు అవకాశం లేకపోయింది."

తరువాత ఎవ్వరూ మాట్లాడలేదు. వీధిలో కుక్కలు మొరిగాయి. ఖాసిం లైట్లువేసి కర్రపుచ్చుకుని ఇంటిచుట్టూ తిరిగి వచ్చాడు.

143

# ప్రకరణ 8

రంగనాయకమ్మ వుయ్యూరు వెళ్ళిన తరువాత రంగా రావు, డాక్టరు సుదర్శనంగార్ల కుటుంబాలు యేక కుటుంబంలా మెలిగాయి. వారంలో మూడుదినాలు ఒకరి యింట్లో భోజనాలు అయితే, మిగతా నాలుగురోజులూ రెండోవారి యింట్లో జరిగేవి. అందులోనూ శాంత పరీక్షాఫలితం తెలిసిన తరువాత అక్కడా, ఇక్కడా విందులు, పార్టీలు నిత్యమూ జరుగుతూవచ్చాయి.

ఒకనాడు భోజనాల సమయంలో రంగనాయకమ్మ వుయ్యూరు వెళ్ళిన తరువాత యెంతమార్పు చెందిందీ రంగారావు వివరించాడు. సుదర్శనం అంతావిని "భేషో! అన్నపూర్ణ పెండ్లి పుణ్యమా అంటూ మీ చెల్లాయిలో యీ విధమైన మార్పురావడం గొప్ప విశేషమేరా రంగా!" అన్నాడు.

"మేము ఒకసారి వెళ్ళి చూసివస్తామండీ!" అంది కామేశ్వరి.

"మేము అంటే యెవ రెవరు?"

"నేనూ, అన్నపూర్ణ, శాంత."

"హమ్మయ్యో! నేనా?" అన్నపూర్ణ బెదురుతూ చూసింది.

"ఫరవాలేదు. వెళ్ళిరా అమ్మా!" అన్నాడు రంగారావు.

"బేబీనికూడా తీసుకుపోతాం" అంది శాంత.

"రేపు భోజనాలు అయ్యాక వెళ్ళిరండి" రంగారావు సూచించాడు.

"మీరు లేకుండానా?" అన్నది కామేశ్వరి.

"డాక్టరుగారి క్రిజ్‌లర్ కారులో పొండి. డ్రైవరు వున్నాడుగా!"

"కారు లేకపోతే నాకు క్షణంగడవదురా వెర్రి నాన్నా!" అన్నాడు సుదర్శనం.

"నీ మొహం; కావాలంటే నా కారు తీసుకు పోవోయ్!"

పార్వతిని తీసుకురావడానికి గణపతిశాస్త్రి వుయ్యూరు వెళ్ళాడు. కాని పార్వతి ప్రయాణం వాయిదా వేసింది. తనకోసం యెవ్వరూ రానవసరం లేదనీ, నాలుగుదినాల తరువాత తనే బస్సుయెక్కి విజయవాడ వచ్చేస్తాననీ ఆమె తండ్రికి చెప్పింది.

రంగారావు ఆరువందలు పెట్టి హిజ్‌మాస్టర్సు వాయిస్ రేడియోసెట్టు కొన్నాడు. శాంత వీణదులిపి బాగు చేతకు పంపించింది. "దేనికమ్మా అది యిప్పుడు బాగు చేయిస్తున్నావు?" రంగారావు అడిగాడు.

"అత్తయ్యకు పంపిస్తాను నాన్నగారూ!"

"పంపించమని చెప్పిందా?"

"లేదు నాన్నగారూ! రేపు మేము వుయ్యూరు వెళ్ళినప్పుడు వీణమీద అత్తయ్యతో పాట పాడించాలి."

"యేమి పాడిస్తావమ్మా!"

"జయదేవుని అష్టపదులు."

"అయితే నేనూ వస్తాను వుయ్యూరు."

శాంత చిన్నగా నవ్వుతూ అంది "అత్తయ్య అంత బాగా పాడుతుందా నాన్నగారూ!"

"నీవు వినివున్నావు కదమ్మా!"

"అత్తయ్య పాటవిని చాలాకాలమైంది అనుకోండి. అయినా మీ అభిప్రాయం కావాలి."

రంగారావు మందస్మితంచేస్తూ "అత్తయ్య కంఠంలో కోకిలస్వరాన్ని మరపించే మాధుర్యంవుంది. అంతేకాదు. ఆమె వాయిద్యంలో చక్కని స్వరసిద్ధి, రసపుష్టికూడా వున్నాయి" అన్నాడు.

రెండునిమిషాలు మౌనంగా గడిచాయి. శాంత మళ్ళీ ప్రశ్నించింది. "నాన్నగారూ! వుయ్యూరు వెళ్ళిన తరువాత అత్తయ్యలో చాలా మార్పువచ్చిందని మీరు చెప్పారుగదా! ఆ మార్పుకు కారణాలు యేమై వుంటాయి నాన్నగారూ!"

"పెద్ద కారణాలుకూడా యేమీ లేవమ్మా! చాలా సామాన్యమైన విషయం. అత్తయ్య యింతకాలంగా విజయవాడలో మన నాలుగుగోడలమధ్య మెలిగింది. కాక పోతే యెప్పుడైనా ఒకసారి పురాణ కాలక్షేపానికో,

వేదాంతగోష్ఠికో పోయివచ్చేది. అదికూడా ఆమె సృష్టించు కున్న వాతావరణమే."

ఇక యిప్పుడు వుయ్యూరులో అవేమీ లేవు. అక్కడ ఆమెకు ఆత్మీయులుగా అగుపించినవాళ్ళు మన ఖాసిం కుటుంబం. వాళ్ళు మంచి సంస్కారం కలవాళ్ళు. అందుచేత ఆమె ఆ దంపతులతో సాన్నిహిత్యం పెంపొందించుకుంది. తను కావాలని యిక్కడనుండి తీసుకువెళ్ళిన పార్వతిని యేవగించుకుంటోంది. బహుశా త్వరలో పార్వతిని అక్కడ నుండి పంపించివేయాలనికూడా ఆలోచిస్తోంది.

ఇంకోవిషయం. అన్నపూర్ణ కూతురు బేబీ మన యింట్లో దాదాపు సంవత్సరం కాలం తిరిగింది. అయినా అత్తయ్య యేనాడూ ఆ బిడ్డను తాకినట్టుగాని, చివరకు పలుకరించినట్టుగాని నేను చూడలేదు. కాని ప్రస్తుతం వుయ్యూరులో ఖాసిం మనుమరాలిని యెత్తుకుని మోస్తోంది. తనదగ్గరే వుంచుకోవాలని చూస్తూందికూడాను!" అన్నాడు.

"అత్తయ్యలో అంతమార్పు రావడం చాలా గొప్ప విశేషం నాన్నగారూ!" అంది శాంత.

మరునాటి వుదయం పదిగంటలకు డాక్టరు సుదర్శనం గారి క్రిజ్‌లర్ కారు రంగారావుగారి యింటిముందు ఆగింది. డ్రైవరు డోర్ తెరిచాడు. అన్నపూర్ణ కారుదిగి సిల్కుచీరె బరబరలాడుతూంటే చెప్పుడుచెప్పులు గచ్చునేలమీద యీడ్చుకుంటూ లోపల ప్రవేశించింది. కామేశ్వరీ, శాంతా ద్వారంలో ఆమెకు యెదురయ్యారు.

"అబ్బో! చాలా బ్రహ్మాండంగా ముస్తాబు అయ్యిందే అన్నపూర్ణ!" అంది శాంత రెప్పవెయ్యకుండా ఆమెవైపు చూస్తూ.

జరీబోర్డరు లేతగులాబీరంగు సిల్కుచీరె, నారింజ రంగు వెల్వెట్ చోళీ, తలలో చెంపలకంటా కనకాంబరాల చెండూ, నొసట సింధూరతిలకం, మెడలో నెక్‌లెసూ, ఒక చేతికి రవ్వలగాజులు, రెండో చేతికి గడియారమూ, రెండు వేళ్ళకు వుంగరాలతో లక్ష్మీదేవిలా మెరుస్తూంది అన్నపూర్ణ.

కామేశ్వరి ఆమెవంక పరీక్షగా చూస్తూ "అదేమిటే అన్నపూర్ణా, ఆ చోళీ తగిలించుకున్నావు? నీకూ నాకూ చోళీలు యెందుకే దిష్టిబొమ్మలకు దిగవేసినట్టుగాను? అవి కాస్త కండగలవాళ్ళు వేసుకుంటే బాగుంటాయి." అంది.

"యేమో అక్కా! డాక్టరుగారు అది తీసియిచ్చి వేసుకోమని చెపితే వేసుకున్నాను."

"నీవు యెంత అదృష్టవంతురాలివే అన్నపూర్ణా! నీకు కావలసిన బట్టలుకూడా డాక్టరుగారే సెలక్టుచేస్తా రన్న మాట!"

అన్నపూర్ణ సిగ్గుపడింది "అది అంతా నీ చలవే అక్కా!" అంది.

"సరేగాని బేబీని తీసుకురాలేదే మమ్మా!" శాంత అడిగింది.

"అది కారుదిగ నంటోంది. అందులోనే కూర్చుంటుందట!."

"ఓసి దీని దుంప తెగ! నాలుగుతన్ని తీసుకువస్తాను" అంటూ శాంత కారుదగ్గరకు నడిచింది.

"శాంతా, దాన్ని యేడిపించకమ్మా!" కామేశ్వరి మందలింపుగా అన్నది.

శాంతను చూడగానే బేబీముఖం వికసించింది. "అక్కా, నేను చుట్టాలవ్వూరికి పోతున్నాగా!" అంటూ పూరించింది.

"నీ బొంద, పిచ్చిముండా! యీ కారు చెడి పోయింది. నేనూ, అమ్మా, అన్నపూర్ణా యింకో కారులో చుట్టాలవ్వూరికి పోతున్నాం"

"మరి... మరి... నేనూ!"

"నువ్వు ఆ కారులోనే కూర్చో మేము పోయివచ్చే దాకా."

బేబీ బిక్క మొహం వేసి "అక్కా, నేనూ వస్తాను!" అన్నది.

"అయితే త్వరగా దిగిరావాలి."

డ్రైవరు డోర్ తెరిచాడు. బేబీ గెంతుతూ శాంత కంటే ముందు లోపలికి పరుగుతీసింది.

కామేశ్వరి అద్దంముందు నిలబడి నొసట తిలకం దిద్దుకుంటూ "శాంతా, నీవుకూడా త్వరగా బట్టలు మార్చుకో అమ్మా! యేమికావాలో చెపితే తీసి యిస్తాను" అంది.

"నేను యిలానే వచ్చేస్తాను అమ్మా!"

"అదిగో, నీ వితండవాదం మాని త్వరగా తెముల్చు."

శాంత మాట్లాడలేదు. కామేశ్వరి బట్టలబీరువా ముందు నిలబడి "యేమిటే! మాట్లాడవూ!" కొంచెం కటువుగా అంది.

"నాన్నగారు మొన్న తెచ్చిన షిఫాన్‌చీరె తియ్యి."

"జాకెట్టు ?"

"నీ యిష్టం"

కామేశ్వరి నారింజరంగు కంచిపట్టుచీరె కట్టి నీలం రంగు వెల్వెట్‌బ్లౌజు వేసుకుంది. మెడలో చంద్రహారం, నడుముకు వడ్డాణం పెట్టుకుంది. అన్నపూర్ణ తల్లికీ, బిడ్డకూ తలలలో పూలచెండ్లు సర్దింది. అందరూ కారుదగ్గరకు నడిచారు.

శాంతా, బేబీ ముందుసీటులో కూర్చున్నారు. కారు కదులుతూండగా నౌకరుతో రేడియోసెట్టు పట్టించుకుని రంగారావు వచ్చాడు.

"నాన్నగారూ, మీరుకూడా వస్తున్నారా ?" శాంత ప్రశ్నించింది.

"లేదమ్మా! మీరు వెళ్ళిరండి."

కారు కదిలిపోయింది. కామేశ్వరి ప్రశ్నించింది. "శాంతా! వీణకూడా తీసుకువస్తానన్నావుగా!" అంటూ.

"అది యింకా బాగుకాలేదట అమ్మా!"

బంధువుల రాకతో రంగనాయకమ్మయిల్లు కళకళ లాడింది. కామేశ్వరిని, అన్నపూర్ణను రంగనాయకమ్మ ఆప్యాయంగా పలుకరించింది. శాంతను దగ్గరకు తీసుకుంది

"సంతోషం సగంబలం అన్నారు, కొద్దిరోజులకే, అన్నపూర్ణలో అంతమార్పు వచ్చిందేమర్రా!" అంది రంగ నాయకమ్మ.

"యేమిమార్పు వచ్చిందంటావు అత్తయ్యా!"

"యేమిమార్పు అంటా వేమిటే! అగుపించడంలేదూ? మనిషి నాజూకు తేలి చక్కగా కళకళలాడుతూంటేను!"

అంతా యేకంగా నవ్వారు.

"కొత్తకాపురం యెలావుందే అన్నపూర్ణా!"

"మీ దయవల్ల బాగానేవుంది వదెనగారూ !"

"వదెనవరస దేనికేవ్! నాకు కూతుళ్ళూ, కొడుకులూ లేరుగా వియ్యమందుకోవడానికి?"

మళ్ళీ అందరూ ఒకసారి నవ్వారు.

"అత్తయ్యా! నీలో యీచలోక్తులు యింతకాలంగా యెక్కడ దాగివున్నాయి?"

"యేమో! ఇది కనిపెట్టినదానవు అదిమాత్రం కనిపెట్ట లేవుటే?"

"అది అంతా వుయ్యూరు మహాత్యం అత్తయ్యా!"

"అయ్యో పిచ్చితల్లీ ! మహాత్యమంటూ వుంటే అది విజయవాడలోనే వుంది. కొండమీద కనకదుర్గమ్మ, కొండ దిగువను కృష్ణవేణమ్మ. అంతేగాని వుయ్యూరులోయేముంచే, పొలాలలో కష్టించే రైతాంగం, మిల్లులో శ్రమచేసే కూలీ లునూ?"

"యిక్కడికివచ్చి చాలా మాటలు నేర్చావు అత్తయ్యా!"

"ఆఁ నీమొహం, నామొహం. మెక్కడవున్నా మాటలకు కొదువయేముందే అమ్మడూ!"

శాంత రేడియో అమర్చేందుకు ప్రయత్నించింది. కాని యేరియల్ కట్టడం సాధ్యపడలేదు.

"యెవరినైనా పిలుపించు అత్తయ్యా, యీ యేరియల్ కట్టడానికి!"

"తోటమాలీలు వున్నారు. పిలిపించమంటావా!"

"అబ్బే, వాళ్ళవల్ల యేమవుతుంది? కాస్త తెలిసినవాళ్లు కావాలి అత్తయ్యా!"

"అయితే మన ఖాసింసాహెబుతో చెబుతాను, యెవరినైనా పిలుస్తాడు."

అరగంట తరువాత ఖాసింపోయి రహీంను వెంట పెట్టుకు వచ్చాడు. రహీం పదినిమిషాలలో అన్నీఅమర్చి వెళ్ళిపోబోతుంటే "కాఫీ తీసుకు వెడుదురుగాని నాలుగు నిమిషాలు కూర్చోండి" అంది రంగనాయకమ్మ.

రహీం ఆమెవైపు చూడకుండా "క్షమించాలి. అమ్మ యిక్కడకు రావడానికి ప్రయాణ మవుతూంది. నేనుపోయి ఆమెను పంపించుతాను." అన్నాడు.

"అయితే కారు తీసుకువెళ్ళండి" అంది ఆమె.

కామేశ్వరి, అన్నపూర్ణ ఒక పక్కగా నిలబడి వారి సంభాషణ వింటున్నారు. రహీం అందరివైపు తిరిగి "సెలవు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"వదెనా! యీయనగారు యెవరో నీకు తెలుసునా?" రంగనాయకమ్మ కామేశ్వరివైపు చూస్తూ అడిగింది.

"తెలియదు వదెనగారూ! కాని మనఇంటికి అప్పు డప్పుడు వస్తూవుంటారు."

"మన ఖాసింసాహెబు కొడుకు రహీం."

"ఛా! సాహెబా! మనయింట్లో మీ అన్నగారి సర సనకూర్చుని భోజనంచేశారు. రెండుమూడుసార్లు నేనే వడ్డనచేశాను. నాకు బాగా గుర్తువుందికూడా!" కామేశ్వరి ఆశ్చర్యం వెలిబుచ్చింది.

"నేనుకూడా ఒకసారి వడ్డించాను అక్కా!" అంది అన్నపూర్ణ.

"సాహెబులో, గీహెబులో యెవరైతే మనకెందుకు? ఆ తండ్రీ కొడుకుల హృదయాలు చాలా విశాలమైనవి. రహీంతల్లి చాంద్‌బీబీకూడా వారికి తీసిపోదు. రెండు రోజులకొకసారి అయినా వచ్చి చూసిపోతూ వుంటుంది. ఆ దంపతుల ఆప్యాయతా, ఆదరాభినాలూ చూసి నన్ను నేను విమర్శించుకుంటూ వుంటాను." అందిరంగనాయకమ్మ.

శాంత అత్తయ్యను కౌగలించుకుని నుదుటిమీద ముద్దుపెట్టుకుంది. "అత్తయ్యా! పెద్దలు అందుకే అన్నారు. 'మతము వేరైతేను యేమోయ్, మనసు లొకటైతేను చాలోయ్!' అని యీ యదార్థాన్ని నీవు ఆమోదిస్తావా!" అంది.

శాంతమాటలలో యేదో నిగూఢభావం యిమిడి వుందని కామేశ్వరి అనుకుంది. శాంతప్రశ్నకు రంగనాయ

కమ్మనుండి ఏమిటిసమాధానం వస్తుందో నని యెదురు చూసింది. కాని రంగనాయకమ్మ మరి మాట్లాడ లేదు. "మౌనం అర్ధాంగీకారం" అనుకుంది కామేశ్వరి. ఆమె యోచనలు పరిపరివిధాల పోయాయి. రంగనాయకమ్మ రహీంగార్ల మధ్య అస్పష్టమైన అదృష్టరేఖ ఒకటి దోబూచు లాడుతూందని ఆమె అభిప్రాయపడింది. "కాని యిది సాధ్యమా! వదెనగారిలో అంతటిమార్పు వచ్చిందా! లేక వస్తుందా!" అనే ప్రశ్నలకు సమాధానం కామేశ్వరి వూహ లకు అందరానిదే అయింది.

ఇంటిముందు కారు ఆగింది. చాంద్‌బీబీ రహీంబిడ్డలు ముగ్గురినీ వెంటపెట్టుకొని లోపలకు వచ్చింది. మగపిల్ల లిద్దరూ పైజమాలు, షేర్వాణీలు వేసుకొన్నారు. పెద్ద వాడికి ఆరుసంవత్సరాలు రెండవవాడికి అయిదు.

"పిల్లలు ముద్దువస్తున్నారు అమ్మా!" అంది శాంత.

"లవకుశుల్లా వున్నారు అక్కా!" అంది అన్నపూర్ణ.

"సాక్షాత్తూ వాళ్ళ నాన్నగారి పోలికలే!" అంది కామేశ్వరి.

"అన్నపూర్ణా, నీ కూతురు ఎక్కడుందీ కనిపించటం లేదూ!" రంగనాయకమ్మ ప్రశ్నించింది.

"నిద్రపోతూవుంది వదెనగారూ!"

కామేశ్వరి మగపిల్లల నిద్దరినీ దగ్గరకు తీసుకొని పెద్ద వాడిని "బాబూ, నీ పే రేమిటి?" అంది. వాడు "సలీం"

అన్నాడు. రెండోవాడివైపు చూసి "బాబూ, నీ పేరు ?" "కబీర్" అని సమాధానం వచ్చింది.

రంగనాయకమ్మ బంధువులను ముగ్గురినీ. బీబీకి పరిచయంచేసింది. పిల్లలు ముగ్గురికీ శాంత చాక్‌లెట్లు పంచింది. పార్వతి శిరోభారమని మంచ మెక్కింది. రంగనాయకమ్మ బజారునుండి ఫలాహారాలు తెప్పించింది. అందరూ కలసి సాయంకాలం తోటలో సరదాగా గడిపారు.

మాటల సందర్భంలో బీబీ "నా బిడ్డ రంగనాయకమ్మ రాబట్టి మిమ్ములను చూసేభాగ్యం కలిగింది. లేకపోతే ఎలా సాధ్యపడేది !" అన్నది.

కామేశ్వరి అందుకుంది "బేగం ! అలా అనుకోవలసిన అవసరం ఏమాత్రం లేదు. మాకు ఆ పట్టింపు లేమీ లేవు. రహీందాదా మా యింటికి చాలాసార్లు వస్తూంటాడు. అప్పుడప్పుడు భోజనానికికూడా వస్తాడు. అలానే మీరూ వస్తూ పోతూ వుంటే మేమూ వస్తూ పోతూ వుంటాము గదా !"

"అలాగే తల్లీ" అంది బీబీ.

"అయితే బేగం ! అత్తయ్య ఒకతేనా నీ బిడ్డ ! నేనుమాత్రం నీకు బిడ్డను కాకూడదూ !" అంది శాంత.

బీబీ మందస్మితంచేసింది "యెందుకు కాకూడదు తల్లీ ! అయినా నిన్ను కడుపులో పెట్టుకుని కాపాడే అమ్మా నాన్నా వున్నారు. కొద్దికాలం గడిస్తే భర్తకూడా వస్తాడు. నీకేమమ్మా ! బంగారుపిచ్చుకవు. కాని యీ నా బిడ్డకు యెవ

రున్నారు? చెప్పుతల్లీ!" అంటూ బీబీ రంగనాయకమ్మను తన దగ్గరకు తీసుకొని ఆప్యాయంగా తడిమింది.

రంగనాయకమ్మకళ్ళు నిండారులై ఆమె లోలోపల గొణుక్కుంది "ఇందులో యెవరు నా ఆత్మీయులు! ఈ ఋణానుబంధం ఎటువంటిది?"

రహీం పూలతోటకుపోయి మల్లెలు, జాజులు సంపెంగలు పోగుచేసు కొచ్చాడు. పూలుచూసి శాంత ఆనందంలో ఓలలాడింది. అన్నపూర్ణ దండలుకూర్చింది. సాయంకాలం బీబీతోసహా అందరూ అలంకరించుకొని కారు యెక్కారు. కారు కదులుతూంటే రంగనాయకమ్మ అంది.

"కామేశ్వరీ! అప్పుడప్పుడు వస్తూవుండమ్మా! అన్నపూర్ణా, నీవుకూడాను!"

"అలానే వదినగారూ!"



పార్వతిపెట్టిన గడువు నాలుగుదినాలూ గడిచిపోయింది. కానిఆమె విజయవాడపోయే ప్రయత్నం చేసినట్లులేదు. రెండు రోజులుచూసి ఆమె పోకపోతే తనే పార్వతిని విజయవాడ పంపించివెయ్యడానికి రంగనాయకమ్మ నిర్ణయించుకుంది.

రంగనాయకమ్మ పెదమామకొడుకు కుటుంబరావు దుర్వ్యసనాలకు లోనై వున్నఆస్థి కాస్తా యేనాడో తగలేశాడు. రంగనాయకమ్మ ఉయ్యూరువచ్చిన తరువాత వీలుఅయితే ఆమెను ఆశ్రయించో, లేక బెదిరించో కొంత ఆస్థిని సంక్రమింపజేసుకోవాలని పథకం వేశాడు. రంగనాయ

కమ్మకు దగ్గరజ్ఞాతి తను వొక్కడే. అతని అభిప్రాయాలకు అనుకూలంగా పార్వతి తటస్థపడింది. పార్వతిని లోబరచుకొని ఆమెద్వారా పథకం అమలు జరపాలని అతను ఆశించాడు. తీరా పార్వతిని లోబరచుకున్నతర్వాత అతనికి ఆమెపై మోజుఎక్కువైంది. కాని పార్వతిని ఉయ్యూరునుండి వెళ్ళి పొమ్మని, చెప్పడంతో కథ అడ్డంతిరిగింది.

రంగనాయకమ్మఇంట్లో పార్వతిస్థితికూడా యిరుకున పడింది. పనిమనిషిసుబ్బి ఆమెతో మాట్లాడ్డం మానేసింది. విజయవాడ వెళ్ళిపోదాం రమ్మంటూ తండ్రి వచ్చికూర్చు న్నాడు. విజయవాడ పోవడం ఆమెకు ఏమాత్రం యిష్టం లేదు. తండ్రివచ్చినప్పుడు తనుపెట్టిన నాలుగు రోజులు గడువూ పూర్తి అయింది. తెల్లవారితే రంగనాయకమ్మ తనను ఇంట్లోనుండి గెంటివేస్తుందేమో ! ఆమెకు ఏమీ తోచలేదు. చీకటిపడినతర్వాత సినిమాహాలుదగ్గర కుటుంబ రావును కలుసుకోవడం మాత్రమే ఆమెకు అగుపించిన ఒకే ఒక మార్గం. తరువాత కార్యక్రమమంతా అతని సలహాల మీదనే ఆధారపడి వుంటుంది.

చీకటిపడిన తర్వాత పార్వతి సినిమాకంటూ బయలు దేరింది. ముందువసారాలో ఖాసింను పలుకరించింది. "ఖాసిం, నేను సినిమాకు పోయివచ్చేసరికి ప్రొద్దు పోతుం దేమో, తలుపు తీసివుంచుతావుకదూ!" అంది.

"నేను మెలకువతోనే వుంటాన్లే. నీవు పోయిరామ్మా! తలుపు తెరుస్తాను." అన్నాడు ఖాసిం.

కూడలిదగ్గర కుటుంబరావువచ్చి పార్వతిని కలుసుకున్నాడు. "సినిమావైపుకు పోదామా?" అంది పార్వతి.

"అటువైపు అంతటా మనుష్యులు తిరుగుతూ వుంటారు. ఇటు కాలువవైపుకు పోదాం రా" అన్నాడు కుటుంబరావు. ఒకరివెనుక ఒకరు రోడ్డువెంట కొంతదూరం పోయి వంతెన దగ్గర మలుపుతిరిగి కాలువగట్టు ఎక్కారు. ఒక ఫర్లాంగు నడిచినతర్వాత "యింకా ఎంతదూరం పోవాలిట్లా?" అంది పార్వతి.

"ఈ చెరుకుతోట దాటితే అవతల ఎవ్వరూ వుండరు. అక్కడికి పోదాం" అన్నాడు అతను.

కొంతదూరం పోయాక కుటుంబరావు బ్యాటరీ లైటువేసి నాలుగువైపులా పరికించి చూశాడు. ఎవ్వరూ లేరని నిర్ధారణచేసుకున్నతరువాత అతను పైమీది తుండు తీసి క్రిందపరిచాడు. ఒకరినొకరు ఆనుకుని దానిమీాద కూర్చున్నారు. రోహిణీకార్తె అయినప్పటికీ చెరుకుతోటల మీాదినుంచి చల్లగాలివచ్చి తగులుతూంది. ఆకాశాన చుక్కలు మిలమిలలాడుతున్నాయి. వుండి వుండి పడమరగా మెరుపులుకూడా మెరుస్తున్నాయి. కుటుంబరావు ఆమె వడిలో తలపెట్టి వెల్లికిలా పడుకుని "యేం పార్వతీ! ఏం చేద్దామంటావు?" అన్నాడు.

"నాకు ఎటూదారిలేదు. మీారు ఏదిచెయ్యమన్నా చెయ్యడానికి నేను సిద్ధం."

"రంగనాయకిని లోబరచుకునేమార్గం ఆలోచించలేవూ?"

"ఆవిడ నాచేత్తో యిచ్చే మంచినీళ్ళుకూడా ముట్టు కొనడంలేదు."

"నేను రాత్రికి వస్తాను నీవు తలుపుతీసి వుంచితే!"

"ఏమిలాభం! ఆవిడ గదిలోపండుకుని తలుపులు బిగించుకుంటుంది."

"ఇంటికికాపలా ఆ ముసలిసాయిబుగాడు వక్కడేగా!"

"లేదు. ఈ మధ్య తోటమాలీలు యిద్దరు పండు కుంటున్నారు."

"అయితే ఏం చేద్దా మంటావు?"

"అదేదో మీరే చెప్పాలి. తెల్లవారితే రంగనాయ కమ్మ నన్ను ఇంట్లోనుండి బయటికి గెంటివేస్తుంది."

"రహీంగాడు అక్కడికి తరచు వస్తుంటాడా?"

"ఎప్పుడోగాని రాడు."

"వచ్చినప్పుడు రంగనాయకితో మాట్లాడతాడా?"

"ఏమో! వాళ్ళు మాట్లాడుకోవడం నేనుమాత్రం చూడలేదు."

కుటుంబరావు లేచికూర్చుని పార్వతిని తన కౌగిట్లోకి యిముడ్చుకుంటూ "అయితే యీ రాత్రే ఆ యింటినుండి వచ్చేయాలంటావు!"

"తప్పదు. అంతకంటే మార్గంలేదు."

"అయితే ఒకటి చేద్దాం."

"చెప్పండి."

"ఇంట్లో విలువగల వస్తువులుగాని, డబ్బుగాని ఏమైనా వున్నాయా?"

"డబ్బుమాత్రం వుంది. కాని ఎంతో తెలియదు."

"వస్తువులు ?"

"పూజామందిరంలో వెండిసామాన్లు వున్నాయి."

"ఏమి టవి !"

"పీట, ఫ్లాల్ దాన్, భజనతాళాలు, పంచపాత్ర, సీతారాముల విగ్రహాలు మొదలైనవి అన్నీ వెండివే."

"అన్నీకలిసి ఏమాత్రం బరు వుంటాయి ?"

"రెండువీశెలకు పైగా."

"ఆ మాత్రం నీవు మొయ్యగలవుగా !"

"వీలైతే ... "

"అయితే, గియితే ఏమిటి ! వీలుచేసుకుని అందిన మట్టుకు లాక్కురావాలి !"

"ప్రయత్నిస్తాను."

"డబ్బు ఎక్కడ జాగ్రత్తచేస్తారో నీకు తెలుసునా?"

"హాలులోవున్న బీరువాలో."

"తాళంచెవులు ఎక్కడుంటాయి ?"

"డ్రాయరు సొరుగులో. ఆ విషయాలన్నీ నేను చూసుకుంటానులెండి."

"అయితే నేను తెల్లవారుఝామున సరిగ్గా రెండు గంటలకు మీ తోటవైపు గుమ్మందగ్గరకు వస్తాను. నీవు కూడా ఆ సమయానికి అక్కడకు రావాలి."

"సరే"

కుటుంబరావు లైటువేసి టైము చూశాడు. తొమ్మిది న్నర అయింది. "పార్వతీ! యిప్పుడు మనం యీ రోడ్డువెంట తిరిగిపోవడం మంచిదికాదు. మొదటిఆట సినిమా వదిలారు. ఆ జనమంతా మనకు ఎదురవుతారు. పైగా ఆ రహీంగాడూ, వాడి స్నేహితులూ రంగనాయకమ్మ ఇంటికిపోయే మొగలో తూముమీద కూర్చునివుంటారు. అందుచేత మనం ఇక్కడ యీ కాలువ దాటామంటే అవతల పదిగజాల్లో రంగనాయకమ్మతోట, యిల్లు."

"అమ్మయ్యో! యీ చీకట్లో కాలువ దాటడమా! నా వల్లకాదు బాబూ!"

"ఫరవాలేదులే, నేను వున్నానుగా! నీకు అంత భయమెందుకు?"

"బట్టలు తడుస్తాయిగా! తడిబట్టలతో ఎక్కడికి పోగలను?" అంది. కుటుంబరావు నవ్వు ఆపుకుంటూ "బట్టలుతీసి చేత్తో పట్టుకుందాం" అన్నాడు.

"ఛీ పాడు!"

"ఈ చీకట్లో ఎవరు చూడవచ్చారు పార్వతీ?"

"మేమోనబ్బా! నేను రోడ్డువెంట తిరిగివస్తాను."

"రోడ్డూలేదు, గీడ్డూలేదు" అంటూ అతను ఆమె కొంగు పుచ్చుకుని ముందుకులాగాడు. సగం నగ్నమైంది. కుచ్చెళ్ళు గుంజాడు. ఇంకా ముడి మిగిలివుంది. ఆమె రెండు చేతులతో ముడిపట్టుకుని పెనుగులాడింది. ఆమె పొత్తికడుపు

మీద అతను చక్కిలిగింతలు పెట్టాడు. ఆమె వదిలివేసింది. అతను ముడి లాగేశాడు. ఆ వస్త్రాన్ని తలకు చుట్టు కున్నాడు తరువాత తన బట్టలుకూడా విప్పి అన్నీ లుంగ చుట్టాడు. పార్వతిచెయ్యి పట్టుకుని "ఛలో" అన్నాడు. ఆమె మాట్లాడకుండా అతనిప్రక్కనే నడిచింది.

కాలువలో సగంవరకు వెళ్ళారు. పార్వతికి గొంతు వరకు వచ్చాయి నీళ్ళు. "ఏమండీ! నా కాళ్ళు తేలిపోతు న్నాయి. నేను కొట్టుకుపోతున్నాను బాబోయ్!" అంది.

"నేను వున్నానుగా! చావనియ్యనులే!"

"చస్తే పీడ విరగడవుతుంది. నేను ఎవరికి కావాలట!"

"అలా అనకు పార్వతీ! నీ మీద నాకు మక్కువ వుంది. నీవు నాకు కావాలి."

"అవసరం తీరేదాకా."

"అదేమీకాదు! యదార్ధమే చెపుతున్నా" అంటూ అతను తనచేతిని ఆమె నడుముచుట్టూ బిగించి ఆమెను పైకి లేపాడు. ఆమె తన రెండుచేతులను అతని మెడకు మెలి వేసింది. ఆమెను ఒడ్డున దించి అన్నాడు.

"అమ్మయ్య! మనిషివి చూడబోతే కాస్తలేవు, కాని ఎంత బరువున్నావు పార్వతీ!"

ఆమె మాట్లాడలేదు. అతను తువాలుతీసి యిచ్చాడు. ఆమె వళ్ళుతుడుచుకుని పంచకోసం చెయ్యి చాపింది.

"అయ్యయ్యో! నీ పంచకాస్తా కాలువలో కొట్టుకు పోయింది. ఏం చేస్తావు?"

"అబ్బ! చాలులెద్దురూ, ఈ కాలువగట్టున నన్ను నగ్నంగా నుంచోబెట్టి మీ సరాగాలు!"

"కృష్ణుడు నగ్నంగావున్న గోపికలను ఏడ్పించి ఆనందించలేదూ!"

"వాళ్ళు దేవతలు. వాళ్ళ కన్నీ చెల్లుతాయి"

"మనం దెయ్యాలం. మన కన్నీ చెలామణే."

"ఆ తేడా వుందిగదా! సరేగాని నా పంచ యియ్యండిబాబూ!"

"ఇదుగో యిస్తున్నా నందుకో!" అతను అందించబోయాడు. ఆమె చేతులురెండూ పైకెత్తింది. అతను చేతిని యింకా పైకి ఎత్తాడు. ఆమె కొంచెం ఎగిరి అందుకోబోయింది. అతను నవ్వుతూ "పార్వతీ! నేటితో నా జన్మ తరించినట్లుగా ఆనందిస్తున్నా." అంటూ రెండోచేతితో ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. "అబ్బా, మీ వంటిమీది తడి యింకా ఆరలేదండీ!" అంటూ ఆమె తనచేతిలో వున్న తువాలుతో అతని శరీరం తుడిచింది.

దగ్గరలో కుక్కలు మొరిగాయి. కొంచెం పైగా బ్యాటరీలైటు వెలిగింది. ఇద్దరూ కంగారుగా బట్టలు వేసుకుని చెరిఒక వైపుకూ చీలిపోయారు.

# ప్రకరణ 9

ఉదయం ఎనిమిదిగంటలకు రంగారావు పత్రికచూస్తూ కాఫీ తీసుకునే సమయంలో రహీం లోపలకువచ్చి "నమస్తే, లెక్చరర్ సాబ్!" అన్నాడు. రంగారావు తలపైకెత్తి చూసి "ఒహో, రహీంసాహెబ్ ! తెల్లవారేసరికి వచ్చారేమిటి ? రాత్రి ఎక్కడ వున్నారు?"

"ఇప్పుడేనండి రావటం. ఫస్టుబస్సులో వచ్చాను."

"కూర్చోండి, కబుర్లేమైనా వుంటే చెప్పండి."

రహీం రంగారావుకు ఎదురుగావున్న కుర్చీలో కూర్చొని "పార్వతి రాత్రి యింట్లోనుంచి వెళ్ళిపోయింది."

రంగారావు నిర్ఘాంతపోయి "ఎక్కడికి?" అన్నాడు.

"తెలియదండీ."

"కొంపతీసి ఏ కాలువలోనైనా దూకలేదుకదా !"

"అలా జరిగివుండదులెండి. ఆమె వెళ్ళేటప్పుడు ఇంట్లోనుండి కొంత డబ్బుకూడా తీసుకుపోయింది."

"యేమాత్రమో !"

"ఎనిమిదివందలని రంగనాయకమ్మగారు అన్నారు."

"అవును. నేను మొన్ననే వెయ్యిరూపాయలు యిచ్చి వచ్చాను. పోలీసురిపోర్టు యిచ్చారా?"

"మీతో మాట్లాడిగాని ఏపనీ చెయ్యవద్దని మీ చెల్లెలుగారు చెప్పారు."

"మంచిదే" అంటూ రంగారావు పైన తిరుగుతూన్న పంకాకేసిచూసి రెండు నిమిషాల తర్వాత ముందుకువంగి బెల్ మ్రోగించాడు. నౌకరువచ్చి గుమ్మంలో నిలబడ్డాడు. రంగారావు అతనివైపుచూస్తూ "ఒరే, రఘూ! మన ఆఫీసు గదిలో గుమస్తా శాస్త్రిగారు వున్నారేమో చూసి, వుంటే నేను రమ్మంటున్నానని చెప్పు" అన్నాడు. నౌకరు వెళ్ళిపోయాడు.

శాంత గుమ్మంలోనిలబడి రహీంవైపు చూస్తూ "నమస్తే రహీం సాహెబ్!" అంది.

"నమస్తే కుమారీ!"

శాంత తండ్రివైపు తిరిగి "నాన్నగారూ! బెల్ మ్రోగించారు. ఏమైనా పనివుందా!"

"లేదమ్మా, నౌకరుకోసం మ్రోగించానులే. మన రహీంసాహెబ్‌కు ఒక కప్పు కాఫీ తీసుకువస్తావా?"

శాంత లోపలిపోయింది. రెండు నిమిషాల తర్వాత కామేశ్వరి ఉప్మా, కాఫీ తెచ్చి రహీంముందు పెడుతూ "నమస్తే రహీందాదా!" అంది. రహీం ప్రతిననుస్కారం చేశాడు.

రంగారావు ఆశ్చర్యపోయాడు. "రహీం, మీలో నిజంగా ఏదో మహాత్మ్య మున్నదయ్యా! మీ కుటుంబంతో పరిచయమేర్పడిన తర్వాత మా జనాభాలో ఎంతోమార్పు

అగుపిస్తోంది. ఇప్పటివరకూ మా కామేశ్వరి యింటికి వచ్చిన ఏ పెద్దమనిషినీ పలుకరించి ఎరుగదు."

"బహుశా పరిచయంలేక పలుకరించి వుండరని అనుకుంటాను" అన్నాడు రహీం.

"అదీ కొంతవరకు యదార్థమే ననుకో! కాని అసలు విషయ మేమిటంటే మావాళ్ళు పక్కా సనాతన వాతావరణంలో పుట్టి పెరిగారు. దానినుండి వెలుపలికి రావడానికి వాళ్ళకు అవకాశం చిక్కలేదు. ఇప్పుడు పరిస్థితులు కలిసి వచ్చాయి. మీ కుటుంబంతో ఏర్పడిన యీ కొద్దిరోజుల పరిచయం మా వాళ్ళను ముఖ్యంగా మా చెల్లెమ్మను చాలా ముందుకు తీసుకుపోయింది. మీకూ, మీ కుటుంబానికి ధన్యవాదాలు రహీం!"

శాస్త్రిగారు ద్వారంలో నిలబడి రంగారావువైపు తిరిగి "బాబూ! నన్ను పిలిపించారు."

"అవునండీ! అలా కుర్చీలో కూర్చోండి మాట్లాడుదాం!" అన్నాడు రంగారావు. శాస్త్రిగారు బెదురుతూ కుర్చీ వెనక్కులాగి దానిలో కూర్చున్నాడు.

రంగారావు ప్రారంభించాడు. "శాస్త్రిగారూ! మీ పార్వతి రాత్రిగాని, తెల్లవారిగాని ఇంటికి వచ్చిందా!"

"లేదుబాబూ! రాలేదు."

"మరి రాత్రి అక్కడనుండి ఎవ్వరికీ తెలియకుండా వెళ్ళిపోయిందట."

"బాబూ! నా తల్లి ఏమైపోయిందో! నా అమ్మో!"

"ఏమీకాదు. తొందరపడకండి, నేను చెప్పే విషయాలు కాస్త సావకాశంగావిని ఆ తరువాత మీ అభిప్రాయం చెప్పండి."

"చిత్తం. అలాగే బాబూ!"

"శాస్త్రిగారూ! పార్వతి ఉయ్యూరు వెళ్ళిన తరువాత హద్దులుమీరి ప్రవర్తించింది. పనిమనిషిని లోబరచుకుని బయటివాళ్ళతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపింది. సాయకాలం సినిమాకు అంటూ పోయి అర్ధరాత్రివేళ యిల్లు చేరేది. అందుచేత ఆమెను అక్కడనుండి వెంటనే తొలగించాలని మేం నిర్ణయించుకున్నాం. కాని మా యంతట మేం జోక్యంచేసుకోకుండా మీ ద్వారా ఆమెను అక్కడ నుండి పిలిపించడం మంచిదనికూడా మేం అభిప్రాయపడ్డాం. అదేవిధంగా నేను మీకు చెప్పాను. మీరు ఉయ్యూరు వెళ్ళారు. పార్వతి నాలుగురోజులు వాయిదా వేసింది. ఆ వాయిదాగడువుకూడా దాటిపోయింది. ఇక యిప్పుడు అసలు మనిషే పరారీ అయింది. అందులోనూ వట్టినే కాదు. బీరువాతీసి ఎనిమిది వందలు డబ్బుకూడా తీకుపోయింది."

శాస్త్రిగారు నోరుతెరుచుకొని మరీ విన్నారు. "బాబూ! ఎంతపనిజగింది! యిక ఎక్కడ తలఎత్తుకోను! అది నా కడుపున చెడబుట్టింది. నా పరువు గంగలో కలిపింది. అది ఎక్కడ చచ్చిందో ఏమైనా ఆచూకీ తెలిసిందా బాబూ!"

"తెలిస్తే మిమ్మల్నను అడగవలసిన అవసరం ఎందుకొచ్చేదీ! పోలీసులకు రిపోర్టు చెయ్యాలనుకుంటున్నాను."

శాస్త్రిగారు పైపంచె ముఖంనిండా కప్పుకుని గోలగా ఏడ్చాడు. "బాబ్బాబూ! రంగారావుగారూ! మీ పాదాలు పట్టుకుంటాను. ఆ పనిమాత్రం చెయ్యకండి. మీరు ఆ పని చేస్తే నేను నుయ్యో. గొయ్యో చూసుకోక తప్పదు."

"మరి మీ బిడ్డను మీకు అప్పజెప్పాలిగదా!"

"నా బిడ్డసంగతి దేవుడెరుగు. నేను డబ్బునుగురించే ఆలోచిస్తున్నాను బాబూ!"

"డబ్బుపోతే మళ్ళీ సంపాదించుకోగలుగుతాం, కాని మీ బిడ్డ శీలంచెడి కులటగా తయారైతే తరువాత బాధ పడతారుగదా!"

"అయిందేదో అయింది. చెడ్డచేనుకు రెండు మంచెలెందుకు! పార్వతి యిక మాకు లేదు. జన్మలో దాని ముఖం తిరిగి చూడదలుచుకోలేదు బాబూ!"

"శాస్త్రిగారూ! పార్వతి మీ బిడ్డ. మీ రక్తమాంసాలు పంచుకుని పుట్టింది. మీరు ఆమెను పెంచి పెద్దదానిని చేశారు. ఏ ముసలివాడికో ముడిపెట్టి మీ కర్తవ్యం తీరిపోయిందని సంతృప్తిచెందారు. కాని ఆ ముసలివాడుకాస్తా గుటుక్కుమన్నాడు. అప్పుడు ఆమె యుక్తవయస్సులో వుంది. ఆమెకు తిరిగి వివాహంచేయడానికి మీ సనాతన ఆచారాలు, మూఢనమ్మకాలు అడ్డువచ్చాయి. ఆమె నిగ్రహించుకోలేకపోయింది. పొరపాటు చేసింది. ఈ స్థితిలో మీరు ఆమెను వదలిపెట్టి వూరుకుంటే ఆమె యింకా దిగజారిపోవచ్చు. చేతులు మారవచ్చు. కొంతకాలానికి ఎవరి

తోనో చేరి మీ యింటిముందు గుడిసె వేసింది అనుకోండి. అప్పుడు మీరు ఎంతబాధపడతారు? ఆ స్థితిలో మీరు చేతులుకాల్చుకున్నా ప్రయోజనం వుండదు. కాబట్టి యిప్పుడే తొందరపడి వెతికి ఆమెను పట్టుకోండి. ఆమెను చేరదీసినవాడు మంచివాడుగావుంటే వాడికేయిచ్చి వివాహం చెయ్యండి. లేదూ ఏ అనాధశరణాలయానికో పంపే ఏర్పాటు నేను చూస్తాను. పోయినడబ్బుకు నేను విచారించడంలేదు." అన్నాడు రంగారావు.

శాస్త్రిగారు తడబడుతూ లేచి రంగారావుకాళ్ళ మీద పడ్డాడు. రంగారావు ఆయనను పైకి లేవదీశాడు. శాస్త్రిగారు గద్గదస్వరంతో అన్నాడు "బాబూ! నాకు యితర ఆధార మేమీ లేదు. ముంచినా దరిచేర్చినా మీరే. జీవితాంతంవరకూ మీకు కృతజ్ఞుడిగా వుంటాను. మీరుచెప్పి నట్లు నడుచుకుంటాను బాబూ!"

భోజనాల అనంతరం రంగారావు, రహీం కారులో వుయ్యూరు బయలుదేరారు. దారిలో బ్యాంకుదగ్గర కారు ఆపి రంగారావు బ్యాంకులోనికి పోయివచ్చాడు. అతను రహీంచేతిలో వందరూపాయలు పెట్టి "రహీం! పార్వతి యెక్కడవున్నదీ ఆరాతీసి వెదికి పట్టుకోవాలి. శాస్త్రిగారికి మాటయిచ్చాం" అన్నాడు.

"రంగనాయకమ్మ గారితోకూడా సంప్రదించ మంటారా!" రహీం ప్రశ్నించాడు.

"వద్దు రహీం! యిలాంటివిషయాలు ఆమెతో సంప్రదించడం మంచిదికాదు. ఆమెగారి సనాతనధర్మాలూ, కర్మసిద్ధాంతమూ మనకు అడ్డుతగులుతాయి."

కారు రంగనాయకమ్మ ఇంటిముందు ఆపి రంగారావు లోపలకుపోయాడు. గుమ్మంలో రంగనాయకమ్మ ఎదురై "అన్నయ్యా! యీ ముండ పోతేపోయింది. బీరువాలో వున్న డబ్బుకూడా యెత్తుకుపోయిందిగదా!" అంది.

రంగారావు చిన్నగా నవ్వాడు. "పోయినతరువాత అనుకుంటే ఏం ప్రయోజనం? అది సరేగాని ఆవిడ ఎవరితో లేచిపోయిందో తెలుసునా చెల్లెమ్మా?"

"లేదు అన్నయ్యా! రహీంగారు వస్తేగాని తెలియదు."

"నేనూ, అతనూ ఇప్పుడే విజయవాడనుండి కలిసి వచ్చాం. అతను దారిలో దిగిపోయాడు. తరువాతవచ్చి కలుసుకుంటా నన్నాడు. సరేగాని, పార్వతి కుటుంబరావుతో రాయబారాలు జరిపిందని లోగడ చెప్పావు గదూ!"

"నిజమే! కాని అతను తెల్లవారి వూళ్ళోనే వున్నాడని ఖాసిం చెపుతున్నా డన్నయ్యా!"

"పాపం శాస్త్రిగారు గగ్గోలుపెడుతున్నాడు చెల్లెమ్మా! పోలీసురిపోర్టు యిస్తానంటే ఆ పని చెయ్యవద్దని కాళ్ళమీద పడ్డాడు. ఏట్లోపడి చస్తా నన్నాడు."

"మరి ఏం చేద్దా మనుకుంటున్నారు?"

ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు చెల్లెమ్మా! పోలీసు రిపోర్టు యిస్తే నీవుకూడా కోర్టుచుట్టూ తిరుగవలసివస్తుం దనుకుంటాను.''

''పోనీలే అన్నయ్యా! పోలీసులకు రిపోర్టుచేయటం మానేద్దాం. దానికాష్టం కాలా! ఎనిమిదివందల పాతిక రూపాయలూ యెత్తుకుపోయింది. చండాలపుముండ.''

రంగారావు సాయంకాలంవరకూ వుయ్యూరులోనే వున్నాడు. రహీం అతనిని కలుసుకొని మాట్లాడి వెళ్ళాడు. పార్వతిజాడ ఎవ్వరికీ తెలిసినట్లు లేదనీ అయినా ప్రయత్నిస్తా ననీ చెప్పాడు.

♦ ♦ ♦ ♦

పార్వతికి చెప్పినప్రకారం కుటుంబరావు రాత్రి వొంటిగంటకే తోటవైపు గుమ్మందగ్గరకు చేరుకున్నాడు. ద్వారంకేసిచూస్తూ అతను ఒక చెట్టుచాటున కూర్చున్నాడు. దాదాపు గంట గడిచిపోయింది. పార్వతిజాడ లేదు. కాలువ గట్టుప్రక్కగా రైతుల యెరువులబళ్ళు పోతున్నాయి. బండిలోకూర్చున్న ఒక కంఠం పాడుతూంది.

''యేవూరు భామా - భామ నీ పేరేమి
నీ వూరు పేరేదో - నిలచి మాట్లాడు''
''నా వూసు నీకేల - ఓ యందగాడా
నా మామ చూస్తేను నలిపి వేస్తాడోయ్''

ఒకరైతు యెడ్లను అదిలించాడు. ముందున్న బండి ఆసామితో ముచ్చట మొదలుపెట్టాడు, ''ఒరేయ్,

యీరయ్యా! మా దోరది యియ్యాల సరిగ్గా మేత తిన లేదురా, యెందుకనో!"

"సీయమ్మా! వూరునిండా గాలు లున్నాయిరా అదేమైనా సోకిందేమో!"

"సీ యమ్మ! అయితే సచ్చా మన్నమాటే! ఇక రేపు బండి సాగదుగామానురా బాబోయ్!"

"ఒరే రంగయ్యా! సరేగాని యీ బోడెమ్మ యిక్కడే కాపరం పెట్టిందల్లే వుందేంటిరా!"

"ఆఁ మరేనన్నా! పెళ్ళి సేసుకుంటదంట!"

"సీయమ్మ! బోడిదాన్ని యెవడు సేసుకుంటాడురా!"

"బోలెడు ఆస్తి వుందన్నా! ఇదుగో యీ కాలవ అవతల డొంకదరి యేసుకుని అదుగదుగో అక్కడ మన పొలిమేర లేదూ, అక్కడదాకా యీ బోడెమ్మ పోలాలే!"

"సీయమ్మ! శానా పొలంవుందిరా! ఆ డెవడో అదురుష్టవంతుడే!"

"ఈలయిద్దేమో, నువ్వు సూడన్న ఒకసూపు?"

"సీయమ్మ! మనం యెక్కడ నచ్చుతాముర ఆళ్ళకి!"

"నీకేమన్నా! కేపింగుదువ్వి, యిస్త్రీసొక్కాయేసి చేతికి గడారం తగిలిచ్చి బయలుదేరావంటే నాసామి రంగా పూలరంగడికిమల్లే వుంటావులేరా!"

"ఓరి యదవనాగన్నా! అట్టాంటివాళ్ళకి మనసు మించిన పూలరంగళ్ళే వుంటార్రా బాబూ!"

బళ్ళు దూరమయ్యాయి. మాటలు అణిగిపోయాయి. తూర్పుదిక్కున వెలుగు వ్యాపించింది. బహుళ చంద్రుడు అప్పుడే నిక్కిచూస్తున్నాడు. రాత్రి రెండు గంటలు దాటింది. కుటుంబరావు మనస్సులో ఆందోళన యెక్కువైంది. "పార్వతి వట్టి అమాయకురాలు. దొంగతనంచేయటం దాని వల్లకాదు. పాపం దానిని చిక్కులలో పెడుతున్నా నేమో !" అనుకున్నాడు.

అతనికి దగ్గరలో యేదో అలికిడి అయింది. అతను వులికిపడి లేచి నిలబడ్డాడు. రెండు గజాల యెడంలో నక్క. అదీ కంగారుపడి తోటలోదూరి కూయడం సాగించింది. ఆ కూతను అవతలి నక్కలు అందుకున్నాయి. అన్ని కంఠాలూ యేకమై దిక్కులు మారుమ్రోగేలా అరిచాయి. నాలుగు నిమిషాల తరువాత అతను బిక్కు బిక్కు మంటూ మళ్ళీ చతికిల బడ్డాడు. "పార్వతి యికరాదు. దానివల్ల యే పనీ జరగదు." అనుకున్నాడు.

మసకవెన్నెల క్రమంగా చెట్లపైకి వ్యాపించింది. యిక లాభం లేదనుకొని కుటుంబరావు లేచి బయలుదేరాడు. పది అడుగులువేసి వెనుకకు తిరిగిచూశాడు. రెండు క్షణాలు ఆగి మళ్ళీ చెట్టుకిందికి చేరుకున్నాడు. రెండు నిమిషాలు గడిచాయి. గుమ్మందగ్గరకుపోయి తలుపులకు చెవిఆన్చి ఆలకించాడు. యెక్కడా చడీ చప్పుడూ లేదు. నిరాశ చేసుకుని బయలుదేరాడు. నాలుగు అడుగులు వేశాడు. తలుపులు చప్పుడు అయ్యాయి. నిలబడి చూశాడు.

పార్వతి తలుపులు తెరుచుకుని బయటికివచ్చి నిల బడింది. కుటుంబరావు రెండు అంగల్లో ఆమెను సమీపించి ఆమెను తనచేతుల్లోకి తీసుకున్నాడు. నోరుమెదపకుండా యిద్దరూ కొంతదూరం నడిచారు.

వూరిబయటికి చేరినతర్వాత కుటుంబరావు ప్రశ్నిం చాడు. "యేం పార్వతీ, యేమీ తీసుకురాలేదేం!"

"డబ్బు తీసుకువచ్చానండీ!" పర్సుతీసి అతనిచేతుల్లో పెట్టింది.

"వెండివస్తువులు తీసుకువస్తానన్నావుగా!"

"యేమో! ఆ పూజామందిరంలోని వస్తువులు దొంగి లించడానికి నా మనస్సు అంగీకరించలేదు."

"అబ్బో! మనకు యీ వైరాగ్యంకూడా యెందుకు!"

"నా వైరాగ్యం యిప్పటిదికాదు. వుగ్గుపాలతో అబ్బింది."

"డబ్బు యేమాత్రం తెచ్చావు?"

"యేమో! పర్సు మీ దగ్గరే వుందిగా! చూడండి."

కుటుంబరావు పర్సుతీసి డబ్బు లెక్కపెట్టాడు. యెనిమిది వందరూపాయిల కాగితాలు, పైన కొద్దిగా చిల్లర. "మన తాహతుకు యిది పెద్దమొత్తమే!" అన్నాడు,

రోడ్డుమీద కొంతదూరం నడిచారు. వంతెనదాటిన తరువాత రోడ్డుప్రక్కగా ఒక జట్కాబండి నిలబడివుంది. కుటుంబరావు బండిమనిషిని 'మస్తాన్!' అని పిలిచాడు. బండి వచ్చి రోడ్డుమీద నిలబడింది. పార్వతి, కుటుంబరావు

బండిలోనెక్కి కూర్చున్నారు. జట్కా బందరువైపుకు సాగిపోయింది.

◆ ◆ ◆ ◆

రంగారావు కారులో బయలుదేరాడు. రహీం సైకిల్ మీదవస్తూ దారిలో యెదురయ్యాడు.

"లెక్చరర్ సాబ్! విజయవాడ పోతున్నారా!"

"మరే రహీం."

"కబురు తెలిసిందండీ."

"కారులోకూర్చుని మాట్లాడుకుందాం రా."

"ఇక్కడమాట్లాడడం మంచిదికాదండీ. మీ కారు వూరుబయట చెరువుదగ్గర ఆపండి. నేను వచ్చి కలుసుకుంటాను." అన్నాడు రహీం.

కారు ముందుకు సాగిపోయింది. కారు చెరువు ప్రక్కకితీసి ఆపుచేశాడు రంగారావు. రహీంవచ్చి కలుసుకున్నాడు.

"లెక్చరర్ సాబ్ ! యీ వూరు జట్కా, రిక్షా డ్రైవర్ల యూనియన్లు రెండూ మన స్వాధీనంలో వున్నాయి. నేను వాటి ముఖ్యులను కలుసుకుని మాట్లాడాను. జట్కా యూనియన్ సభ్యుడు మస్తాన్ మనకుకావలసిన సమాచారమంతా చెప్పేశాడు

"యీ తెల్లవారుజామున మూడుగంటల సమయంలో కుటుంబరావు పార్వతిని మస్తాన్ జట్కాలో తాడంకి తీసుకుపోయి ఆమెను అక్కడదించి వచ్చాట్ట! తాడంకిలో కిల్లీకొట్టు

రాములు కుటుంబరావుకు చాలా దగ్గరస్నేహితుడు. పార్వతిని రాములుయింట్లోనే పెట్టారట. యీ రాత్రికి ఆమెను అక్కడనుండి పామర్రు పంపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనికూడా తెలిసింది" అన్నాడు రహీం.

"అయితే రహీం! మనం ఒకపని చేద్దాం. నేనుపోయి శాస్త్రిగారిని తీసుకువస్తాను. నీవు ముందుగా తాడంకివెళ్ళి అక్కడి నలుగురు పెద్దమనుష్యులనూ పోగుచెయ్యి. నయానో, భయానో పార్వతిని తీసుకువచ్చేద్దాం."

"యెక్కడికి తీసుకువస్తారు?"

"యెక్కడికో దేనికీ! సరాసరి కారులో తీసుకుపోయి యింటిలో అప్పజెప్పేస్తాను. సరేగాని, మళ్ళీ మనం కలుసుకునేది యెక్కడ!"

"తాడంకి వూరువెలుపల 22వ మైలురాతి దగ్గర."

రంగారావుకారు కదిలిపోయింది.

సాయంకాలం యెనిమిదిగంటల లోపునే పార్వతిని కారులో యెక్కించుకుని వుయ్యూరు తీసుకువచ్చారు. పార్వతి ప్రారంభంలో రానని పేచీపెట్టింది. కాని శాస్త్రి గారు బ్రతిమాలారు. త్వరలో వివాహం చేస్తామని రంగారావు హామీయిచ్చాడు. అవకాశంవుంటే కుటుంబరావుతోనే వివాహం జరిపిస్తామనికూడా ఆమెకు నచ్చచెప్పారు. వుయ్యూరులో రహీం కారుదిగి పోబోతూంటే పార్వతి తన బొడ్లోవున్న పర్సుతీసి అతనిచేతిలో పెట్టింది "యీ పర్సు రంగనాయకమ్మగారికి అందజెయ్యండి. నా పొరపాట్లను మన్నించమన్నానని చెప్పండి" అంది.

# ప్రకరణం 10

కొద్ది దినాలు గడిచాయి. ఒకనాటి సాయంకాలం రంగనాయకమ్మ తోటలో కూర్చుని ప్రేమచంద్ నవల 'సేవా సదన్' చదువుతూవుండగా ఖాసింసాహెబ్ చెప్పాడు "అమ్మా, తమరు విన్నారా! మన పార్వతమ్మ పెండ్లి చేసుకుంది."

రంగనాయకమ్మ పుస్తకంమూసి ఖాసింవంక విస్తుపోయి చూసింది. "యేమిటి, ఖాసింసాహెబ్! పార్వతి పెండ్లి చేసుకుందా!"

"అవునమ్మా!"

"యెవరినట!"

"మీ పెదమామగారి కొడుకు కుటుంబరావును."

"వాళ్ళ పెండ్లి పేలాలు వేగిరిలే!"

"లేదమ్మా! గుంటూరుజిల్లా రిజిష్ట్రారు ఆఫీసులో చేసుకున్నారట!"

"యెవరు చేయించారో యీ పెండ్లి! నీకు యేమైనా తెలుసునా ఖాసింసాహెబ్!"

"తెలుసు నమ్మా! పార్వతమ్మ నాయన శాస్త్రిగారే చేయించారట!"

"ఓరి నీ శాస్త్రి చట్టుబండలుగాను! దొంగవెధవ" అంది రంగనాయకమ్మ.

రోజులు గడిచినకొద్దీ రంగనాయకమ్మకు చికాకు మెక్కువైంది. ఆమె యోచనలు పరిపరివిధాల పోయాయి. పార్వతి పెండ్లి చేసుకుంది. శాంత చదువులకోసం వాల్తేరు వెళ్ళింది. ముసలిఖాసింకు జబ్బుచేసింది. రెండు రాత్రుల నుండీ రహీంవచ్చి పరుంటున్నాడు. రహీం తన యింటికి వచ్చి పరుండడం రంగనాయకమ్మకు యేమాత్రమూ యిష్టం లేదు. అతను వయస్సులో వున్నాడు. అతను వస్తూ పోతూ వుంటే లోకం యేమైనా అనుకోవచ్చు. లోకం యే మనుకున్నా తను నీతికి కట్టుబడి వున్నంతకాలం యెవ రినీ లెక్కచేయవలసిన అవసరంలేదు. కాని తనకు తెలియ కుండానే రహీం తనను ఆకర్షించాడు. అతని రూపురేఖలు, గుణగణాలు, అన్నిటినీమించి అతని సత్ప్రవర్తన ఆమె హృదయంలో స్థానం యేర్పరచుకున్నాయి. రహీంను గురించిన ఆలోచనలు దూరం చేసుకునేందుకు ఆమె వుప వాసాలు చేసింది. మౌనవ్రతాలు సాగించింది. గంటలతరబడి ఈశ్వరధ్యానంలో మునిగిపోయింది. కాని తన మనస్సులో నుండి అతన్ని చెరిపివెయ్యలేక పోయింది.

ఒకరోజున మాటలసందర్భంలో రహీం తన స్వవిషయం చెపుతూ "రంగనాయకమ్మగారూ! నేను భౌతికవాదిని. జాతి, కుల, మత విబేధాలను నేను పాటించను. విశ్వమానవ సౌభ్రాతృత్వం నా ఆశయం" అని చెప్పుకున్నాడు.

రహీంనుగురించి ఆ నాడు తను అనుకుంది "అబ్బో! యితను నాస్తికుడు. యీ చీడపురుగును దరి చేరనీయ కూడదు" అని. కాని తీరా అతను బయులుదేరి వెడుతూంటే

"రహీంగారూ రేడియో కొద్దిగా చెడినట్టుంది. అది ఒక సారి తీసిచూడరూ!" అన్నది.

అన్న రంగారావు ఒకప్పుడు తనను వీరేశలింగంగారి రచనలు చదవమని సలహాయిస్తే ఆ నాడు తను యేమంది? "అన్నయ్యా! వీరేశలింగంగారి రచనలు చాలావరకు సంఘ సంస్కరణకు సంబంధించినవి. అవి చదవాలనే అభిలాష నాకు అసలులేదు" అన్నది. కాని రహీం ప్రస్తుతం టాగూరు, ప్రేమచంద్ నవలలు తెచ్చియిస్తూంటే యెంతో శ్రద్ధగా చదువుతూంది. "ఈ పరిస్థితిని యిక కొనసాగనివ్వ కూడదు. రహీంను సాధ్యమైనంత దూరంలో వుంచాలి" అనుకుంది రంగనాయకమ్మ.

ఒకనాటి సాయంకాలం రంగారావువచ్చి "చెల్లెమ్మా! నీకో శుభవార్త!" అన్నాడు. రంగనాయకమ్మ తెల్ల బోయింది. "అన్నయ్య రహీంవిషయం యేదో చెపుతాడు కాబోలు!" అని భయపడింది. కాని తమాయించుకుని నెమ్మదిగా అడిగింది. "యేమిటి అన్నయ్యా, ఆ శుభవార్త!"

"లోగడ తీర్థయాత్రలకు పోవాలని ఒకసారి అన్నావు గదా! కొద్దిరోజుల్లో ఒక పూర్ణయాత్రా రైలు విజయవాడ నుండి బయలుదేరుతూంది."

రంగనాయకమ్మగుండె కుదుటపడింది. "విజయవాడ నుండి యెవరైనా పోతున్నారటనా!"

"ఆ–ఆ; చాలామంది. నా తోటి లెక్చరర్ విశ్వ నాథశాస్త్రి, ఆయన భార్యకూడా బయలుదేరుతూన్నారు."

"వాళ్ళు యెవరో నాకు తెలియదు అన్నయ్యా!"

"నీకు తెలిసేవుంటా రమ్మా! ఆయన భార్యపేరు శ్రీ రంగనాయకమ్మ."

"ఓహో! మన పక్కవీధిలో ఆ యెఱ్ఱటి ముసలాయనా! నాకు తెలుసు అన్నయ్యా! శ్రీ రంగనాయకమ్మగారు చాలా మంచిదికూడాను. కార్తీకస్నానాలకు అందరం కలిసే వెళ్ళేవాళ్ళం!"

"అయితే నీకు సెకండుక్లాసుబెర్తు రిజర్వుచేస్తాను."

"సరే, అలానే యేర్పాటుచెయ్యి అన్నయ్యా!"

రంగారావు సంభాషణ మార్చాడు. "ఖాసిం ఆరోగ్యం యేమైనా బాగుపడిందా, చెల్లెమ్మా!"

"కొద్దిగా లేచి తిరుగుతున్నాడు. నిన్న సాయంకాలం నేను వెళ్ళి చూసివచ్చాను అన్నయ్యా!"

"అయితే వెళ్ళేప్పుడు నేనుకూడా చూసిపోతాను చెల్లెమ్మా! మన యింటికిపోదాం రాకూడదూ? యీ నాలుగు రోజులూ అక్కడేవుండి యాత్రకు పోవచ్చుగా!"

"దేనికిలే అన్నయ్యా! ఆ రోజున యెలాగూ వస్తానుగా! పైగా ఇక్కడ యిల్లూ వాకిలీ వీళ్ళకు అప్పజెప్పి రావాలి. ఖాసిం ఆరోగ్యం యెప్పుడు కుదుటపడుతుందో, ఏమో!"

"రహీం చూస్తూంటాడు కదమ్మా!"

"చూస్తున్నాడనుకో! ఆయనగారికి అంతులేని కార్యక్రమాలు! యెప్పుడూ యింటిపట్టున వుండడట అన్నయ్యా!"

"అవును అతను మేధావి, ప్రజానాయకుడు."

"ఆఁ యేం మేధావో, యేం ప్రజానాయకుడో! ముగ్గురు బిడ్డలుంటే వాళ్ళను ముసలివాళ్ళమీద వదిలేసి ఆయన బాధ్యతలేకుండా తిరగడం యేమంత సబబుగా వుందంటావు!"

రంగారావు చిన్నగా నవ్వాడు. "అది నిజమే ననుకో! కాని తండ్రి ముసలివాడు అయినా, తల్లి బాగా ఆరోగ్యంగానే వుందికదా! ఆ బిడ్డలను ఆమె సాకగలదని అతని ధీమాఅయి వుండాలి."

"అసలుసమస్య అదికాదు అన్నయ్యా! రహీం తిరిగి వివాహం చేసుకోవాలని ఆ తల్లిదండ్రుల పట్టుదల. కాని రహీం వాళ్ళ సలహాలను పెడచెవిని పెడుతూన్నాడు. ఆ ముసలివాళ్ళు యిద్దరూ పెండ్లిచేసుకోవలసిం దని రహీంకు మనలను నచ్చచెప్ప మంటున్నారు."

"రహీం పెండ్లిచేసుకుంటే వుండే సాధక బాధకా లేమిటో తెలుసుకోకుండా మనం అతనికి సలహాయివ్వడం మంచిదికాదు చెల్లెమ్మా!"

"అవును అన్నయ్యా! నా అభిప్రాయంకూడా అదే!"

ఆ రాత్రి రంగనాయకమ్మ యింట్లో దొంగలు చొరబడ్డారు. పనిమనిషీ, రంగనాయకమ్మా కంగారుగా 'దొంగలు, దొంగలు' అంటూ అరిచారు. రహీం, తోటమాలీలు పరుగెత్తుకు వచ్చారు, రహీం దొంగను తరిమి పట్టుకున్నాడు. కాని అతనికి తలమీద చిన్న దెబ్బతగిలి రక్తం కారింది. తోటమాలీలు, రహీం కలసి దొంగను

కాళ్లూ, చేతులూ బంధించి పోలీసుస్టేషనుకు కబురుచేశారు. రహీం ముఖంమీంది రక్తాన్ని రంగనాయకమ్మ స్వయంగా శుభ్రమైనగుడ్డతో తుడిచివేసింది. చిన్న బేండేజీ తెచ్చి గాయానికి చుట్టింది. పోలీసులువచ్చి దొంగను తీసుకు పోయారు.

ఉదయం లేవగానే రంగనాయకమ్మ స్నానానికి పోతూ "రహీంగారూ! కాఫీ తీసుకుపోదురుగాని, తొందర పడి వెళ్ళకండి!" అని చెప్పింది.

రహీం తల పైకినెత్తి పరీక్షగా ఆమెవైపు చూశాడు. ఆమెముఖంలో విచిత్రమైన మార్దవం, ఆ కళ్ళల్లో వింత కాంతులు అగుపించాయి. ఆమె వెళ్ళినతరువాత అతను ఆలోచనలలో మునిగాడు. "ఆమె నన్ను ప్రేమిస్తోందా! అది సంభవమా! లేకపోతే ఆ చూపులలోని భావ మేమిటీ! రాత్రి తనకు కాస్త దెబ్బ తగిలిందో లేదో! స్వయంగా తుడిచి కట్టుకట్టవలసిన అవసరం ఆమెకు యేమి వచ్చిందీ? యేమో! 'క్షణభంగురముల్ జవరాండ్ర చిత్తముల్' అన్నట్లు ఆమె ప్రేమ అంతగానే పురిడిపోతుం దేమో!" అను కున్నాడు.

అతని ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి. "ఆమెకు అందము, ఆరోగ్యము, ఐశ్వర్యము అన్నీవున్నాయి. ఆమె నన్ను ప్రేమిస్తోంది అనుకోవడం కేవలం భ్రమ!" అను కున్నాడు. మళ్ళీ.

రంగనాయకమ్మ వంటయింట్లో పనిముగించుకుని హాలులోకి వచ్చింది. రహీం సోఫాలో చేరబడి కూర్చు

న్నాడు. ఆమె ఒక ప్లేటునిండా పూరీలూ, కూరా తెచ్చి అతనిముందు పెట్టింది. రహీం వాటివైపు చూస్తూ "మీరు చాలా శ్రమపడినట్లు వున్నారు. అన్నిపూరీలు తినడం నా వల్లకాదు సుమండీ!" అన్నాడు.

రంగనాయకమ్మ లోపలికిపోయి పనిమనిషితో ఖాళీ ప్లేటు పంపించింది. రహీం సగానికిపైగా తీసివేశాడు. ఆమె కాఫీగ్లాసు తెచ్చి అతనిముందు పెడుతూ అంది. "అదేమిటి రహీంగారూ! అన్నీ తీసివేశారేం?"

అతను చిరునవ్వు నవ్వుతూ "లేదండీ! సగంమాత్రమే తీసివేశాను."

"నేను తీర్థయాత్రకు పోతున్నాను. మీకు తెలుసునాండీ!" అంది అతనికి ఎదురుగా సోఫాలో కూర్చుని.

"ఆఁ. నిన్న లెక్చరర్‌సాబ్ చెప్పారు."

"నేను మళ్ళీ తిరిగి ఈ వూరు వస్తానో రానో చెప్పలేను. మీ కుటుంబం ఈ యింట్లోకి మారితే-బాగుంటుందేమో!"

"నాకు అభ్యంతరం లేదండీ! కాని మా అమ్మకు అక్కడనుండి మారడం యిష్టంలేదు. ఆమెకు ఎప్పుడూ చుట్టూ పదిమంది వుండాలి. మరి ఆమెకు కావలసిన యిరుగు పొరుగు యిక్కడ ఎవ్వరూలేరు. లెక్చరర్‌గారు లోగడ ఒకసారి సూచించారు. కాని అమ్మ అప్పుడే వ్యతిరేకించింది."

"రహీంగారూ! మీరు త్వరలో వివాహం చేసుకుని మీ అమ్మకు కాస్త చాకిరీ తప్పించకూడదూ?"

రహీం నీరసంగా నవ్వాడు. "నా భార్య పోయి రెండు సంవత్సరాలకు పైగానే అయిందండీ! కాని నేను ఆమెను యింకా మరచిపోలేకుండా వున్నానండీ!"

ఆ సమాధానం విని రంగనాయకమ్మ జాలిగా అతని వంక చూసింది. "రహీంగారూ! నన్ను క్షమించరూ! మిమ్మల్ని అనవసరంగా నొప్పించానేమో?"

"అదేమీ లేదండీ! నాకు యిప్పుడిప్పుడే మళ్ళీ పెండ్లి మీద దృష్టిపోయింది."

"అయితే అభ్యంతరం ఏముందీ? అందులో మీరు భౌతికవాదులు. కుల, మత విచక్షణలను మీరు పాటించరు గదా! మీకు నచ్చినవారిని ఎవరినైనా చేసుకోవచ్చును గదా!"

"ప్రేమికులకు యీ కుల, మత వివక్షలు అడ్డువస్తాయి అంటారా! అదేమీ లేదండీ! మీ ఏడుకొండలవాడు మా బీబీనాంచారిని తీసుకుపోయి చేసుకోలేదూ?"

రంగనాయకమ్మ సంతృప్తిగా నవ్వింది.

పోలీసుకానిస్టేబుల్ లోపలికిచూసి "రహీంసాహెబ్ గారూ! మిమ్మల్ని సబిన్‌స్పెక్టర్‌గారు ఒకసారి రమ్మంటు న్నారండీ!" అన్నాడు.

రహీం లేచి బయటికి నడిచాడు.

   

యాత్రాస్పెషలు సాయింకాలం బయలుదేరుతుం దనగా ఆ వుదయం రంగనాయకమ్మ విజయవాడ చేరింది.

ఇల్లు నాలుగువైపులా తిరిగి చూసి "కామేశ్వరీ! అమ్మడు లేకపోతే ఇల్లంతా చిన్నబోయి నట్టుందమ్మా!" అంది.

"అయ్యో వదినగారూ! ఒక్క శాంత మాత్రమేనా! మీరు వెళ్ళిపోతిరి! అన్నపూర్ణ వెళ్ళిపోయె! ఇక నా పని ఎలావుంటుందో మీరు వూహించండి."

"ఎవరికి వారే యమునా తీరే! అన్నట్లుగా వుందం టావు! సరేగాని అన్నపూర్ణ కేమైనా ... గర్భిణి ... వచ్చి నట్టా!"

కామేశ్వరి మందస్మితం చేస్తూ "ఆహాఁ!" అంది.

"అదృష్టవంతురాలు. ఈ సారి కొడుకును కంటుందిలే!"

"పోయి చూసివద్దాం. వస్తారా!"

"అలానే!"

కామేశ్వరి ఫోన్ దగ్గరకు పోయి రిసీవరుఎత్తి నెంబరు చెప్పింది. అవతలినుండి సమాధానం వచ్చింది. "కామేశ్వరి నండీ! అవతల డాక్టరుగారేనా?"

"అవును. ఎవరుకావాలి మీకు!"

"అన్నపూర్ణ."

"వంటఇంట్లో వుంది. పిలవమంటారా?"

"పనిలో వుందేమో! వద్దులెండి. మీ కారు ఒక సారి మా ఇంటికి పంపించరూ?"

"పంపిస్తాను. ఎవరికోసమట!"

"వదినగారు వచ్చారు. మీ ఇంటికి రావా లంటున్నారు."

"ఓ, చాలాసంతోషం. ఆమెను ఒకసారి ఫోన్ దగ్గరకు పిలవండీ!"

కామేశ్వరి పక్కకుతిరిగి "వదినెగారూ! మిమ్మలను డాక్టరుగారు పిలుస్తున్నారు" అన్నది.

"అక్కడకు ఎలాగూ పోదలచాముగదా! మధ్యలో ఫోన్ సంభాషణ దేనికమ్మా!" అంటూ రంగనాయకమ్మ అయిష్టంతో రిసీవరు తీసుకుంది.

"నమస్తే, డాక్టరుగారూ!"

"నమస్తే! మీరు యీ సాయంకాలం బయలుదేరుతున్నారుకదూ, యాత్రకు?"

"అవునండీ!"

"మా అమ్మకూడా వస్తోంది. కాని ఆమె వాత్తేరులో కలుసుకుంటుంది మిమ్మల్ని."

"చాలా సంతోషమండీ!"

"సాయంకాలం నేను స్టేషనుకు వస్తాను. యిప్పుడు హాస్పిటలుకు పోవాలి."

"మంచిదండీ" ఆమె రిసీవరు క్రిందపెట్టేసింది. కామేశ్వరివైపు తిరిగి "డాక్టరుతల్లి రాజమ్మగారుకూడా వస్తోందట యాత్రకు." అంది. "ఓహో, అలానా! అయితే ఒకరికొకరు కాస్త తోడుగా వుండొచ్చు" అంది కామేశ్వరి.

అరగంట గడిచాక డాక్టరుగారి క్రిజలర్ కారు వచ్చింది. రంగనాయకమ్మ, కామేశ్వరి కారులో బయలు దేరారు. పండ్లకొట్టుదగ్గర కారు ఆపించి రంగనాయకమ్మ బుట్టెడుపళ్ళు తీసుకుంది

కారుదిగి లోపల అడుగుపెట్టగానే వారికి అన్నపూర్ణ ఎదురై "నమస్తే వదెనగారూ!" అంది ఆమె రంగ నాయకమ్మవైపు చూస్తూ.

రంగనాయకమ్మ చిరునవ్వు నవ్వుతూ "ఏమని దీవించమంటావు అన్నపూర్ణా!"

"పెద్దల దీవెనలు వృధా కావంటారు. మీ మనస్సుకు తోచినరీతిని దీవించండి!"

"శీఘ్రమే సుపుత్ర ప్రాప్తిరస్తు."

అన్నపూర్ణ సిగ్గుపడింది. "వదినెగారు జ్యోతిషం కూడా నేర్చినట్టున్నారు."

"ఎంత వగలాడివే అన్నపూర్ణా! నీవు చెప్పకపోతే మాత్రం దాగుతుందా ఏమిటే?"

డ్రైవరు పండ్లబుట్టతెచ్చి టేబులుమీదపెట్టి వెళ్ళాడు. రంగనాయకమ్మ రెండు కాబూలు దానిమ్మపండ్లు, రెండు కాష్మీరు ఆపిలుపండ్లు పెద్ద ద్రాక్షపండ్లగుత్తి బుట్టలోనుంచి తీసి అన్నపూర్ణ చేతుల్లో వుంచింది.

అన్నపూర్ణ కన్నులు నిండారు లైనై. ఆమె మొహం ప్రక్కకు త్రిప్పుకుంది. రంగనాయకమ్మ ఆమెను తన కౌగిటి లోకి తీసుకుని "అదేమిటే, పిచ్చితల్లీ! అలా చీటికి మాటికి కన్నీరుకార్చడం మంచిది కాదమ్మా!"

రెండునిమిషాల తరువాత అన్నపూర్ణ తేరుకుని "ఏమో వదినెగారూ! అటు డాక్టరుగారివైపు వారుగాని, యిటు నా వైపువారుగాని నన్ను యీ మాత్రం ఆదరించిన వారు అగుపించలేదు."

నలుగురూ బల్లచుట్టూ కుర్చీలలో కూర్చున్నారు.

"బేబీ ఎక్కడుందీ! అగుపించదేం?" కామేశ్వరి అడిగింది.

"ఈ ఉదయం మా తమ్ముడువచ్చి తీసుకెళ్ళాడు అక్కా!"

"మీ అమ్మ ఎప్పుడైనా వస్తూవుంటుందటే!" రంగనాయకమ్మ అడిగింది.

"ఆ. పదిరోజులకో సారి నిక్కిచూసి పోతూంటుంది అంటే అంటనట్లుగా." అంది అన్నపూర్ణ.

"మీ అత్తగారు నీతో బాగా మాట్లాడుతుందా?"

"ఎక్కడా! పెండ్లిఅయిన కొత్తలో పదిరోజులు మాత్రం వున్నారు ఆమెగారు యిక్కడ. ఆ పదిరోజులూ ఏదో ముభావంగా వుండేవారు."

"మీ ఆడబిడ్డ సుశీల నువ్వంటే బాగానే వుంటుం దటగా!"

"ఆమెగారు చాలా ఆప్యాయంగా పూసుకుతిరుగు తుంది. కాని ఆ మెమాటలు నిష్కర్షగాను, కొంచెం కటువు గాను వున్నట్లు ధ్వనిస్తాయి. ఆమె హృదయంమాత్రం నవ నీతం వదెనగారూ! సరిగ్గా మీ మాదిరే." అంటూ అన్న

పూర్ణ రంగనాయకమ్మవైపు చూసింది. రంగనాయకమ్మ మందస్మితం చేసింది. "అదేమిటేవ్ ! నాకు ఏదో సర్టిఫికెటు యిస్తున్నావు."

"నే నేమి సర్టిఫికెటు యివ్వగలను వదెనగారూ ! నోటిమాటేగదా !"

డ్రయివరు లోపలకువచ్చి "ఆలశ్యం వుంటుందా అమ్మా ! హాస్పిటలుకు పోయివస్తాను" అన్నాడు.

"ఆలశ్యమేమీ లేదు డ్రైవర్ ! మమ్మిల్లను ఇంటిదగ్గర దిగబెట్టి పోదువుగాని !" అంది కామేశ్వరి.

అన్నపూర్ణ లోపలికిపోయి ట్రేతో పళ్ళు, కాఫీ గ్లాసులు తెచ్చింది. రంగనాయకమ్మముందు రెండు చక్కరకేళీపళ్ళు, ఒకగ్లాసు పళ్ళరసము పెట్టింది. కామేశ్వరివైపు తిరిగి "అక్కా పాలకోవా బిళ్ళలున్నాయి. రెండు తీసుకురమ్మంటావా!" అంది.

"ఎక్కడివే ఎవరైనా సూడిదలు పంపించారా?"

"నీ దంతా చోద్యం అక్కా ! ఎక్కడినుండైనా సూడిదలువస్తే నీకు తెలియకుండా ఎలావుంటుందీ ! నిన్న మా ఇంట్లోనే చేశాను అక్కా !" అంటూ అన్నపూర్ణ లోపలికిపోయి ఒక ప్లేటుతో కోవాలు పట్టుకొచ్చింది. కామేశ్వరి సంజ్ఞ చేసింది. 'రంగనాయకమ్మకు కూడా' అన్నట్లు అన్నపూర్ణ కోవాలు మూడుప్లేట్లలో సర్ది పెట్టింది. ఒకటి రంగనాయకమ్మకు అందిస్తూ "వదినెగారికికూడా రెండు కోవాలు" అంది.

"నీవు అభిమానంతో పెడతానంటే నేను వద్దనడం బాగుండదు అన్నపూర్ణా!"

డ్రైవరు హారన్ ప్రయోగించాడు. కామేశ్వరి అంది "అన్నపూర్ణా! ఆ డ్రైవరును పిలిచి రెండుపళ్ళు, కఒ గ్లాసు కాఫీ యివ్వు."

కాఫీ అనంతరం కామేశ్వరి, రంగనాయకమ్మ వెళ్ళి కారులో కూర్చున్నారు. కారు కదిలిపోయింది.



రంగనాయకమ్మ భర్త మరణానంతరం మామగారితోను, తల్లి శాంతమ్మతోను కలిసి ఉత్తరహిందూస్థానంలోని పుణ్యక్షేత్రాలు హరిద్వారంవరకు తిరిగి చూసింది. ఇప్పుడు మళ్ళీ తీర్థయాత్రలు చేయాలనే అభిలాష ఆమెకు అంతగా లేదు. కాని రహీంకు సాధ్యమైనంత దూరంగా వుండాలని మాత్రమే ఆమె దృఢనిర్ణయం. అందుకు యీ యాత్ర కొంతవరకు తోడ్పడగలదని ఆమె ఆశించింది. తలవని తలంపుగా ఆరోజురాత్రి యింట్లో దొంగలు పడడమూ రహీంకు దెబ్బలు తగలడమూ, అతని మొహంమీదికి కారిన రక్తాన్ని తను కొంగుతో తుడవడమూ గుర్తుకువచ్చినప్పుడు "అబ్బ! ఎంత సిగ్గుమాలినపని చేశాను?" అనుకునేది ఆమె.

ఆమెకు పన్నెండేండ్ల వయస్సులో భర్త చనిపోయాడు. ఆ తరువాత ఏ పురుషుణ్ణీ ఆమె తాకి ఎరుగదు. ఎంతో పవిత్రంగా జీవిస్తున్నానని ఆమె గర్వపడేది. కాని తన

పవిత్రజీవితాన్ని బూడిదపాలు చేయడానికి దాపురించాడా యీ రహీం? అని అనుకొని ఆమె భయంతో వణికిపోయేది. "ఏమైనా సరే, నా జీవితాన్ని యికముందు ఎట్టి పరిస్థితుల్లోనూ మలినం కానీయకూడదు, కానీయను." అనుకునేది. అలాంటి సమయాలలో ఆమె కండ్లుమూసుకుని చేతులురెండూ జోడించి "ప్రభూ, దయామయా! ఈ దాసురాలి జీవితం నిష్కళంకంగా వుండేట్లు చూడు స్వామీ!" అంటూ ప్రార్థనలు సలిపేది.

రంగనాయకమ్మ ఉయ్యూరునుండి బయలుదేరుతూ ఒకే ఒక నిర్ణయం చేసుకుంది. "యీ రహీంను మరచిపోయేంత దాకా మళ్ళీ తిరిగి యీ ఉయ్యూరు గడ్డమీద కాలుపెట్టడం జరుగదు అని." ఆ సంకల్పంతోనే ఆమె ఉయ్యూరు వదలి వచ్చేసింది. విజయవాడలో బంధువుల, స్నేహితుల మధ్య ఉత్సాహంగా గడిపింది. సాయంకాలం ప్రయాణానికి కావలసిన బట్టలు, పరుపు, కొద్దిగా పుస్తకాలు అన్నీ సర్దుకుంది.

# ప్రకరణ 11

సాయంకాలం రాజమండ్రికి పోయే ప్యాసింజరు బండిలో యాత్రికుల కొరకు రెండు పెట్టెలు ప్రత్యేకించారు. మామూలు ప్రయాణీకులతోను, యాత్రికులు వారిబంధువుల తోను ప్లాటుఫారం కిటకిటలాడింది. రంగనాయకమ్మను సాగ నంపడానికి బంధువులు, మిత్రులు రెండు కార్లనిండా వచ్చారు. రంగారావు, కామేశ్వరి, డాక్టరు సుదర్శనం, అన్నపూర్ణ, డాక్టరుచెల్లెలు సుశీల, ఆమెభర్త ఆ వచ్చిన వారిలో ముఖ్యులు.

రంగనాయకమ్మ రెండవతరగతిలో కాలుపెడుతూ అంది "అన్నయ్యా! యాత్రికుల కొరకు ప్రత్యేకరైలు వేశారన్నారుగా! ఇదేమిటీ, ప్యాసింజరుకు రెండుపెట్టెలు మాత్రమే తగిలించారు!"

"అవునుచెల్లెమ్మా! ప్రత్యేకరైలు రాజమండ్రినుండి బయలుదేరుతుంది. యీ పెట్టెలురెండూ అక్కడ దానికి తగిలిస్తారు"

రంగనాయకమ్మ కిటికీ ప్రక్కనే కూర్చుంది. లెక్చరర్ విశ్వనాధశాస్త్రి, ఆయన భార్య, శ్రీరంగనాయకమ్మ కూడా అదేపెట్టెలో కూర్చున్నారు. రంగనాయకమ్మకు ఎదురుగా అవతలి కిటికీదగ్గర స్థానం శ్రీరంగనాయకమ్మ ఆక్రమించుకుంది. ఆమెప్రక్కనే లెక్చరరు కూర్చున్నారు.

కాని లెక్చరరు కిటికీ ప్రక్కకు జరగాలని ఆదుర్దాతో భార్యను "యేమేవ్! నీవు కాస్త యువతలకి సర్దుకుంటావా? నేను ఆ ప్రక్కన కూర్చుంటాను" అన్నాడు.

భర్తసూచనను శ్రీరంగనాయకమ్మ ఆమోదించలేదు. "నాకు యిక్కడే బాగుంది. పదిమందినీ చూస్తూ కూర్చుంటాను. మీకేం, మహారాజులా యెప్పుడూ వీధులు, వాడలు తిరుగుతుంటారు. ఇలాంటి సమయంలోనైనా పదిమందిని చూడడానికి నోచుకోలేదూ నేనూ!" అంటూ దీర్ఘం తీసింది.

"సరే! ఏలూరు స్టేషనులో కొత్త ప్రయాణీకులు వస్తారుగా! అప్పుడు సర్దుకుని కూర్చోవచ్చులే!" అన్నాడు విశ్వనాధశాస్త్రి సరిపెట్టుకొని.

అన్నపూర్ణ రంగనాయకమ్మ చెవిలో చెప్పింది. "ఈ భార్యాభర్తలు యెప్పుడూ కీచులాడుకుంటూనే వుంటారు వదెనగారూ!"

రంగనాయకమ్మ చిన్నగా నవ్వుకుంది. "అయితే బాగా కాలక్షేపమన్నమాట!" అంది ఆమె.

బండి పదినిమిషాలకు బయలుదేరుతుందనగా ప్లాటుఫారంమీద రహీం అగుపించాడు. అతన్ని చూడడంతోనే రంగనాయకమ్మ గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. "ఇతను యెందుకుగాను ప్రత్యక్షమైనట్టు యిక్కడ?" అనుకుంది.

రహీం నాలుగు నిమిషాలు రంగారావుతో మాట్లాడాడు. రంగనాయకమ్మ అతనివైపే చూస్తూ కూర్చుంది.

కామేశ్వరి అది గమనిస్తూనేవుంది. రహీం రంగనాయకమ్మ వైపు తిరిగి "అన్నయ్యగారితో కేసువిషయం మాట్లాడిపోదామని వచ్చానండీ!" అన్నాడు.

"యేమిటిటా ఆ కేసు విషయం?"

"మనయింట్లో పట్టుబడిన దొంగదగ్గర సొత్తు యేమీ లేదు. 'కేసుపెట్టినా నిలవదు' అంటున్నారు పోలీసులు."

"అయితే మనమేం చేస్తాం?"

"ఏదైనాసొత్తు అపహరించినట్టు చూపెడదామంటున్నారు వాళ్ళు."

"వాడు చెయ్యనిది మనం యెలా చూపెడతామట! మరి అన్నయ్య యేమన్నారు?"

"పోలీసులతో మనం యెలాంటి పొత్తూ పెట్టుకోకూడదని అన్నయ్యగారి అభిప్రాయం."

"అయితే మంచిదే."

రహీం జేబులోనుండి ఒక చిన్న కాగితంపొట్లం తీసి "అమ్మ యీ పొట్లం మీకు అందజేయమని చెప్పిందండీ!" అన్నాడు.

ఆమె చేయి చాచింది. అతను పొట్లం అందించాడు. అతని వేళ్ళు ఆమెచేతిని తాకాయి. ఆమె షాక్ తగిలినట్టుగా చేయి వెనకకు తీసుకుంది. పొట్లం కిందపడిపోయింది. అతను వంగి పొట్లంతీసి మళ్ళీ అందించాడు. ఆమె అందుకుని పొట్లం విప్పింది. బంగారం పొదిగిన రుద్రాక్షమాల.

ఆమె ముఖం వికసించింది. "ప్రయాణపు తొందరలో మరచి పోయి వచ్చాను. అమ్మకు ధన్యవాదాలు చెప్పండి" అంది.

అతను చిరునవ్వు నవ్వాడు. ఆమె ముభావంగా చూసింది.

రైలు బయలుదేరే వేళకు బంధువులు, మిత్రులు పెట్టెలకు దగ్గరగా చేరారు. రహీం తప్పుకుని కొంచెం దూరంలో నిలబడ్డాడు. గంట గణగణ మోగింది. గార్డు విజిల్ వూది పచ్చజెండా పైకి యెత్తాడు. ఇంజను కూతకూసి గుప్పుగుప్పున పొగలు వదులుతూ పెట్టెలను భారంగా కుదిపి ముందుకు కదిలింది. రంగనాయకమ్మ అందరి ముఖాలలోకి చూస్తూ "వెళ్ళివస్తాను" అంది. ఆమె రహీంవైపు చూసింది. అతడు చిరునవ్వు నవ్వుతూ చెయ్యి పైకి యెత్తాడు. ఆమె కూడా చెయ్యి పైకియెత్తి అందరివైపూ చూసింది. రైలు కదిలిపోయింది.

ఏలూరు, తాడేపల్లిగూడెం, నిడదవోలు, కొవ్వూరు స్టేషన్లలో కొత్త యాత్రికులు వచ్చి కలిశారు. రాజమండ్రి స్టేషనులో బండి చాలాసేపు నిలబడింది. రంగనాయకమ్మ తన బెర్త్ మీద పక్క పరచి ప్రార్థన అనంతరం ముసుగు పెట్టింది.

తెలతెలవారే సమయంలో రైలు వాల్తేరు ప్లాటు ఫారం మీదికి వచ్చి నిలబడింది. యాత్రికులు చాలామంది కిందికిదిగి మొహాలు కడిగారు. కొందరు కాఫీలకు పోయారు. రంగనాయకమ్మ తలుపుదగ్గర నిలబడి డాక్టరు సుదర్శనం

తల్లి రాజమ్మగారికోరకు నిరీక్షించింది. కాని యెక్కడా ఆమె వచ్చినజాడ లేదు. యాత్రాస్పెషలు నిర్వాహకులలో ఒకరినిపిల్చి రంగనాయకమ్మ అడిగింది. "యేమండీ! వాల్తేరు నుండి వచ్చే రెండవతరగతి ప్రయాణీకులలో రాజమ్మగారు అనే ఆమె రావలసివుంది. ఆమెగారు వచ్చేట్టా లేక రానట్టా!"

అవతలనుండి సమాధానం రాకపూర్వమే శాంత తుఫానులా వచ్చి అత్తయ్యకంఠం కౌగలించుకుంది. శాంతతో కూడావచ్చిన మరో అమ్మాయి తెల్లబోయి చూస్తూ నిలబడింది. శాంత ఆ అమ్మాయిచెయ్యి పట్టుకొని ముందుకులాగి "వనజా! యీమే మా అత్తయ్య." అంది.

రంగనాయకమ్మ ఆప్యాయంగా కోడలిని తడుముతూ "యెవరే అమ్మడూ యీ అమ్మాయి?" అంది.

"మన డాక్టరుగారి అన్నకూతురు వనజ అత్తయ్యా!"

"ఓహో! అలానా! యెప్పుడో చిన్నతనంలో చూశాను. అయినా యిప్పుడు చాలా మారిపోయింది."

రంగనాయకమ్మ మరోమాట అందుకునేలోపున రాజమ్మగారు, పెద్దకొడుకు మధుసూదనం, ఆయనభార్య రాజరాజేశ్వరి పెట్టెలోకి వచ్చారు.

రాజమ్మగారు పెట్టెలోకి వస్తూనే రంగనాయకమ్మ చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ "యేమ్మా, రంగనాయకమ్మా! నీ పుణ్యమా అంటూ నేను తీర్థయాత్రలకు బయలుదేరాను" అంది.

"అదేమిటి పిన్నిగారూ! మీరు పెద్దలు అయివుండి అంతమాట అనడం ధర్మం కాదండీ!" అంది రంగనాయకమ్మ.

మధుసూదనం అందుకున్నాడు. "అవునమ్మా! మీరు యాత్రకు బయలుదేరుతున్నారని తెలిసిన తరువాతనే అమ్మ యీ యాత్రకు సిద్ధమయింది."

యోగక్షేమాల అనంతరం రంగనాయకమ్మ శాంతను అడిగింది. "అమ్మడూ! నేను శ్రీనగర్ కూడా పోయిరావా లనుకుంటున్నాను. నీకు యేమి బహుమతి కావాలో చెప్పు. అక్కడినుండే పంపించే ఏర్పాటు చేస్తాను."

శాంత జాలిగా రంగనాయకమ్మ కళ్ళల్లోకి చూసింది. "అత్తయ్యా! నీవు క్షేమంగా తిరిగివస్తే చాలు. అంతకు మించిన బహుమానం మరొకటి వుండదు" అంది.

రంగనాయకమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె ఆప్యాయంగా శాంత తల నిమురుతూ "మా బంగారు తల్లివి కదూ!" అంది.

రైలు కదిలిన తరువాత రంగనాయకమ్మ రాజమ్మ గారిని అడిగింది. "పిన్నిగారూ! ఇన్ని పండ్లగంపలు వేసు కొచ్చారుగదా! వీటన్నిటికీ రైలులో చోటు యెక్కడ తెద్దాం?"

"అయ్యోతల్లీ! నీ కోడలు చెప్పితే వింటుం దనుకుంటు న్నావా! మా పెద్దవాడి కూతురు వనజా, అదీ కలిసి నిన్న పండ్లదుకాణాలన్నీ గాలించి యీ గంపలన్నీ వేసుకొచ్చారు.

ఎలాగో వాళ్లలాగు మనమే సర్దుకోవాలి. ఏం చేస్తాం!"
అంది రాజమ్మ.

పూరీజగన్నాథం, కాశీ, గయ, ప్రయాగ, ఆగ్రా, ఢిల్లీ, హరిద్వార్ మొదలైన క్షేత్రాలన్నీ తిరిగి చూశారు. విశ్వనాథశాస్త్రి దంపతులమధ్య వచ్చే పేచీలకు, కలహాలకు రంగనాయకమ్మ మధ్యవర్తిత్వం వహించేది.

బదరీయాత్రకు బయలుదేరేముందు యాత్రికుల నందరినీ డాక్టర్లు పరీక్షచేశారు. ఆరోగ్యాలు సరిలేనివారిని కొందరిని బదరీయాత్రకు పోవద్దని సలహాయిచ్చారు. విశ్వనాథశాస్త్రిగారిభార్య శ్రీరంగనాయకమ్మ, డాక్టరు సుదర్శనం తల్లి రాజమ్మగారు, మరికొందరు ఆగిపోవలసి వచ్చింది. రాజమ్మగారు, శ్రీరంగనాయకమ్మ బదరీయాత్రికులు తిరిగి వచ్చేవరకూ ఋషీకేశ్ ఆశ్రమంలో వుండిపోయేందుకు ఏర్పాటుచేశారు.

తెల్లవారితే బదరీయాత్రకు బయలుదేరతా రనగా శ్రీరంగనాయకమ్మ రంగనాయకమ్మను చాటుకు తీసుకుపోయి చెప్పింది. "యిదిగో అమ్మాయీ! మనకువున్న పరిచయం కొద్దీ నీతో చెపుతున్నా. మా ఆయనను కాస్తకనిపెట్టి మెలగాలి; 'చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరిగుడిసెలు' అన్న సామెత అక్షరాలా ఆయనకు వర్తిస్తుంది. కాబట్టి జాగ్రత్తసుమా!"

రంగనాయకమ్మ నిర్ఘాంతపోయింది "మామ్మగారూ! శాస్త్రిగారు వయస్సులోకూడా చాలా పెద్దవారుకదా!

ఆయన గారు అంత తెలివితక్కువగా ప్రవర్తిస్తారంటే నేను నమ్మలేకుండా వున్నానండీ!" అంది.

"ఆయన పెద్దరికం ఆయనా కూలిపోయిరిలే! వయస్సు మారినా వక్రబుద్ధిమాత్రం మానలేదు. కాలేజీలో చదివే పిల్లకోసం రాత్రివేళ గోడదూకితే ఆ యింటవాళ్ళు పట్టుకొని పచ్చడి పచ్చడిగా తన్నారు. ఆ దెబ్బలతో నెలరోజులు మంచం దిగలేదు. అయితేమాత్రం బుద్ధివచ్చిందనా! అబ్బే పుట్టుకతో వచ్చిన వ్యసనం పుడకలతోగాని పోదంటారుగా! యీయనగారి విషయంలో అది అక్షరాలా నిజం అమ్మాయీ! యీ మధ్య ఒక కిరస్తానీపంతులమ్మను వెంటే సుకొని మద్రాసు, బెంగుళూరు యెక్కడెక్కడో నెల్లాళ్ళు తిరిగివచ్చారు. కాబట్టి నీజాగ్రత్తలో నీవు వుండాలితల్లీ!"

"మంచిది మామ్మగారూ! అలానే వుంటాను."

వర్షాలు అధికంగా కురియడంతో బదరీ ప్రయాణం సుఖంగా లేదు. యాత్రికులు బాగా అలిసిపోయారు. విశ్రాంతి సమయంలో విశ్వనాథశాస్త్రి రంగనాయకమ్మను ప్రాథేయ పడుతూ అడిగాడు.

"ఇదుగో అమ్మాయీ! రంగనాయకీ! నా కాళ్ళు పీకుతున్నాయి. ఒక్క పదినిమిషాలు కొంచెం కాళ్ళు వత్తే వంటే కాస్త కునుకు తీస్తాను."

"మీరు పెద్దలు. తండ్రితో సమానులు. మీకు సేవ చేయడానికి నాకు అభ్యంతరం లేదు. కాని యింతకాలంగా యే పురుషుణ్ణీ నేను తాకి యెరుగను. ఆ నియమం యిప్పుడు

ఉల్లంఘించాలనే అభిప్రాయం నాకు లేదు. కాబట్టి నేను నిమ్ము లను తాకలేను, తాకను శాస్త్రిగారూ!"

"ఒహో! అలానా! అయితే నిన్ను ఒక్క విషయం అడుగుతాను నిజం చెపుతావూ?"

"తప్పకుండా"

"నీవు శివానందస్వామి శిష్యురాలివి కదూ?"

"అవును."

"అతని విషయం నాకు బాగా తెలుసు."

"అదేమిటో చెప్పండి!"

"యేమిటంటావా! అతను తన శిష్యురాళ్ళను నీలాగా వయస్సులోవున్న అందమైన పిల్లలను అనుభవించకుండా వదలడు. యీ యదార్థం నీవు అంగీకరిస్తా వనుకుంటాను" అన్నాడు లెక్చరరు రంగనాయకమ్మ కళ్ళల్లోకి చూస్తూ.

ఆమె ముభావంగా నవ్వింది. "ఆ విషయం కొంత వరకు యదార్థమే ననుకోండి. కాని ... ..."

"ఏమిటమ్మా ఆ కాని ... ...? అతను నిన్నుమాత్రం తాకలేదు అంటావు. అంతేనా?"

"అంతేకాదండీ! వాడు తన వికారపు చేష్టలను నా దగ్గర ప్రదర్శించినప్పుడు వాడి కాలినున్న పాదుకలాగి వాడి మూతి చితకగొట్టాను. వాడి పెదవి రెండుగా చిట్లింది. పన్ను సగం విరిగింది. తరువాత వాడి ముఖం నేను చూడ లేదు."

"అతను మెట్లుదిగుతూ జారి పడగా ఆ దెబ్బ తగిలిందని చెప్పుకొన్నారే!"

"అవును మరి! యింకేమని చెప్పుకొంటారు?

"అతన్ని నీవు యేమిచేసినా నేను విచారించను. కాని నన్నుమాత్రం కాస్త దయతో ఆదరించు. నీ ప్రేమ భిక్షకొరకు పడి చస్తున్నాను."

రంగనాయకమ్మ వ్యంగ్యంగా నవ్వింది. "మీరు పెద్దలు, విజ్ఞానవంతులు. మీ బుద్ధి యిలా వక్రించడం చాలా విచారకరం."

యేమి చేస్తాం! ఆనాడు మహాఋషులకే తప్ప లేదు."

"మీ శాస్త్రాలు, ధర్మాలు అడ్డురావూ!

"అవన్నీ పామరులకోసమే!"

"అయితే శాస్త్రిగారూ! నేనుకూడా ఆ పామరుల కోవకే చెందుతానండీ! అంతేకాదు. మన శాస్త్రాలను, ధర్మాలను తూచ తప్పక పాటించాలనే వాళ్ళలో నేనూ ఒకర్తెను. అందుచేత మీ పశువాంఛను తీర్చేందుకు నేను సిద్ధం కాలేను, కాను."

"ఇదుగో అమ్మాయీ! యేవో సాకులుచూపి నా అభీష్టాన్ని తోసిపుచ్చాలని చూస్తున్నావు. నీ విషయం నాకు పూర్తిగా తెలుసు నీవు విజ్ఞాన ఖనివి. సకల శాస్త్ర, వేద, పురాణ గ్రంథాలను క్షుణ్ణంగా చదివి అవగాహన చేసుకున్నావు. నీవు అసలు దేవతల కోవకు చెందుతావు. అందుచేత నా అభీష్టాన్ని నెరవేర్చినకోషం నిన్ను ఆవ

హించదు. అదీగాక ఈ ప్రపంచంలో స్త్రీ పురుష సంబంధం అన్నిటికంటే అతీతమైనది. స్త్రీకోసం పురుషుడు, పురుషుడి కోసం స్త్రీ త్యాగం చేయడం పెద్ద నేరమేమీ కాదు."

రంగనాయకమ్మ వ్యంగ్యంగా నవ్వింది. "శాస్త్రి గారూ! మీ వేదాంతం పెడమార్గం పడుతూంది. దేవతలు కాని, మానవులుకాని సంఘ నియమాలను అతిక్రమించితే వాళ్ళు దోషులుగా పరిగణించ బడతారు. మీరు మళ్ళీ ఒక సారి మనుధర్మశాస్త్రం చదవడం మంచిదని నా సలహా."

"రంగనాయకీ! యెప్పుడో యెవరో ఉబుసుపోకకు వ్రాసిన వ్రాతలు, చెప్పిన కబుర్లు యీ యిరవయ్యవ శతాబ్దంలో మనం పట్టుకుని వేళ్ళాడ్డం కేవలం అర్థరహితమూ, అనవసరమూను. పెద్దవాడిని. పండితుడిని. నిన్ను ప్రాధేయ పడుతున్నాను. నా కోరిక తీర్చావంటే నీకు దాసుడుగా వుంటాను. నిన్ను నెత్తిన పెట్టుకుని శివుడు గంగను ఆరాధించి నట్టుగా ఆరాధిస్తాను. నా కోరికతీర్చు రంగనాయకీ!" అంటూ అతను లేచి నిలబడి ఆమెను సమీపించాడు. ఆమె భీతి చెంది చంగునలేచి నిలబడి తప్పుకోబోయింది. కాని అతను భల్లూకంలా ఆమెను ఒడిసి పట్టుకుని తన కౌగిలిలోకి తీసు కున్నాడు. ఆమె పెనుగులాడింది. అతను పట్టు బిగించాడు. ఒకచేతిని ఆమె నడుంచుట్టూ తిప్పి బంధించాడు. రెండో చేతిని తొడలపైకి పోనిచ్చాడు. రహస్యావయవం తాకాడు. ఆమె సత్తువకొద్దీ అతనిరొమ్ముల్లో చేతులువేసి గట్టిగా తోసి వేసింది. శాస్త్రిగారు గచ్చునేలమీద కుప్పలా కూలాడు. ఆయాసంతో రొప్పుతూ వెంటనే లేచి మళ్ళీ ఆమెను సమీ

పించాడు. ఆమె తప్పుకుని పక్కనేవున్న కట్టెపేడు అందు కుంది. శివంగిలాగ గర్జిస్తూ "ఇదుగో ఆయుధం. అడుగు ముందుకు వేశావా నీ బుర్ర రెండుచక్కలవుతుంది. జాగ్రత్త!" అంది.

"అలాగే కానీ రంగనాయకీ! ఆ పుణ్యంకాస్తా నీకే దక్కుతుంది. నిన్ను పొందకుండా నేను చచ్చినా బ్రతికినా ఒకటే" అన్నాడు విశ్వనాథశాస్త్రి తాపీగా.

ఆమె కాండ్రించి అతని ముఖంమీద ఫూసింది. అతను నిర్ఘాంతపోయాడు. పైపంచతో ముఖం తుడుచు కుంటూ క్రోధంతో మండిపడ్డాడు. "పిశాచీ నిన్ను శపి స్తున్నా!" అన్నాడు.

ఆమె కాలిచెప్పు తీసి చేతితో పుచ్చుకుని "ఇంకా పిచ్చిగా వాగావా అంటే యీ చెప్పుతో నీ పళ్ళు రాల గొడతా" అంది. శాస్త్రిగారి నోటినుండి మాట పెగలలేదు. ఆయన తగ్గాడు. ఆమె తలుపు తెరచి బయటికి నడిచింది.

వారంరోజుల అనంతరం, యాత్రికులందరూ హరి ద్వారం చేరుకున్నారు. రంగనాయకమ్మ కొంతకాలం ఋషీ కేశ్ ఆశ్రమాలలో గడిపేందుకు నిర్ణయించుకుంది. డాక్టరు సుదర్శనంతల్లి రాజమ్మగారిని తనకు తెలిసినవారికి అప్పజెప్పి ఆమె యాత్రికులనుండి విడిపోయింది.

విశ్వనాథశాస్త్రిగారు అక్కడనుండి వెళ్ళిపోయే ముందు రంగనాయకమ్మను వొంటరిగా కలుసుకుని "అమ్మాయీ! నేను పొరపాటే చేశాను. నా బలహీనతను

గురించి యితరులకు చెప్పవద్దని ప్రాధేయపడుతున్నా. ఇంత టితో నన్ను క్షమించి వదిలెయ్యి తల్లీ!" అన్నాడు.

రంగనాయకమ్మ అతన్ని పురుగును చూసినట్టు చూసింది. "విశ్వనాథశాస్త్రిగారూ! నేను మిమ్మల్ని క్షమించేసమస్య లేనేలేదు. మీరు పయోముఖ విషకుంభం. మహాపండితుల మనీ, విద్వాంసుల మనీ, తత్వవేత్తల మనీ సమాజంలో విర్రవీగుతూ తిరుగుతారు. ప్రజాసామాన్యానికి మీరు నీతులు బోధిస్తారు. మీరుమాత్రం అవినీతిగా ప్రవ ర్తించేదుకు వెనుకాడరు. మీరు మేధావులే కావచ్చు. కాని మీ నైతికప్రవర్తన పశువులకంటే హేయం. మీ పాపా లకు పశ్చాత్తాప మొక్కటే ప్రాయశ్చిత్తం. కాని శాస్త్రాలకు మతధర్మాలకు వక్రభాష్యాలు సృష్టించి స్వప్రయోజనా లను కాపాడుకునేందుకు అలవాటుపడిన మీరు పశ్చాత్తాప పడతారని నేను అనుకోను. మీరు ప్రస్తుత సమాజానికి చీడ పురుగు వంటివారు. మీ మొహం చూడడంకూడా అసహ్యం. ఇక మీ దారిన మీరు పోవచ్చు" అనిచెప్పి రంగ నాయకమ్మ అక్కడనుండి వెళ్ళిపోయింది.

విశ్వనాథశాస్త్రిగారు దీర్ఘాలోచనలలో మునిగారు. "ఎంత పొగరు ఈ ముండమోపికి! ఎంత పొరపాటు చేశాను.యీ ముండను యింతదూరం రానియ్యవలసింది కాదు. అక్కడే ఏ వాగులోనో తోసేసి వుండవలసింది. పీడ

విరగడై వుండేది. ఆడదానికి యింత అహంభావమా!" అను కున్నాడు.

◆ ◆ ◆ ◆

ఋషీకేశ్ ఆశ్రమంలో రంగనాయకమ్మ రెండు నెలలకు పైగా గడిపింది. అనేకమంది విద్వాంసులను, స్వాము లను కలుసుకుని అనేక సమస్యలను గురించి చర్చించింది. కాని ఆమె సందేహాలు నివృత్తి కాలేదు. ఆశ్రమవాసులలో అధికభాగం స్త్రీలు. వారుకూడా యెక్కువమంది విధవలు, వయస్సుమళ్ళిన వారూన్నా. వారిలో సుమిత్రాదేవి, సునందాదేవి అనేవారు రంగనాయకమ్మ దృష్టిని ఆకర్షిం చారు. ఆ ఇరువురికీ సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు, పంజాబీ భాషల్లో మంచి పరిచయం వుంది. సునందాదేవి ఆశ్రమ వాసులతో ఆట్టే కలిసి మెలిసి తిరిగేది కాదు. యెక్కువకాలం యే గంగానది ఒడ్డునో, యే చెట్టునీడనో కూర్చుని ఏకాం తంగా గడిపేది. సుమిత్రాదేవి తరచు పత్రికలు, గ్రంథాలు తిరగవేస్తూ వుండేది. సునందాదేవిలా గాక ఆమె ఆశ్రమ వాసులతో కలిసి మెలిసి వుండేది.

సుమిత్రాదేవితో రంగనాయకమ్మ సన్నిహితంగా మెలిగింది. ఆమెగారి పూర్వ చరిత్ర తెలుసుకునేందుకు రంగ నాయకమ్మ ఒకటి రెండుసార్లు ప్రయత్నించింది. కాని సుమిత్రాదేవి కన్నులు నిండారులవడం చూసి ఆ ప్రయత్నం విరమించుకుంది.

సుమిత్రా దేవివయస్సు యాభై సంవత్సరాలు దాట లేదు. అయినా మనిషి తెల్లగా పాలిపోయి పండి రాలిపోయే ఆకులా అగుపిస్తుంది. పెదవులు కదిపీ కదపకుండా నెమ్మదిగా మాట్లాడుతుంది. ఒకనాటి సాయంకాలం రంగనాయకమ్మ సుమిత్రాదేవితో "అక్కా! ఈ రోజు శ్రావణ శుద్ధపూర్ణిమ. మనం యీపూట లక్ష్మణేశ్వర్ వెళ్ళి అక్కడి ఆలయాలు సందర్శించి రాత్రి వెన్నెలలో హాయిగా నడిచి తిరిగి వద్దామా?" అంది.

"అలానే పోయివద్దాం చెల్లీ! సునందాదేవికూడా వస్తుందేమో! ఆమెనూ తీసుకుపోదాం" అంది సుమిత్రా దేవి.

"లేదు అక్కా! సునందాదేవిగారితో మరోసారి యెప్పుడైనా కలిసిపోవచ్చు. కాని యీరోజు మనం యిద్దరమే పోయిరావాలని నాకు అభిలాషగా వుంది అక్కా!"

"యేదో విశేషం వుంది. అవునా చెల్లీ?"

"విశేషమంటూ యేమీ లేదు అక్కా! నిన్ను చూస్తే నా ఆత్మీయుల నెవరినో చూసినట్టు యేదో అవ్యక్త మధురానుభూతి కలుగుతూ వుంటుంది. యేదైనా పూర్వ జన్మ సంబంధమేమో అక్కా!"

సుమిత్రాదేవి రంగనాయకమ్మను దగ్గరకు తీసుకుని ఆప్యాయంగా వీపు నిమురుతూ "అలాగే పోయివద్దాం చెల్లీ!" అంది.

ఇద్దరూ పడవ యెక్కి గంగానదిని దాటి ఆవలిఒడ్డు చేరారు. అక్కడనుండి నెమ్మదిగా కబుర్లు చెప్పుకుంటూ

సూర్యాస్తమయ సమయానికి లక్ష్మణ్ ఝూలా (లక్ష్మణుని ఉయ్యాల) సమీపించారు. ఆ ఉయ్యాల వంతెనపై నిలబడి రంగనాయకమ్మ నలుదిశలు పరికించింది. పడమటిదిశగా హిమాలయ శిఖరాలమధ్య సంధ్యభానుడు యెర్రని జ్యోతిలా వెలుగుతున్నాడు. ఆ బంగారు కాంతిలో చెట్లచిగుళ్ళు మిల మిల మెరుస్తున్నాయి. ఉయ్యాలకిందుగా గంగానది గలగల మంటూ పరుగులు తీస్తూంది. రంగనాయకమ్మ సుమిత్రా దేవితో "అక్కా! యీ ఉయ్యాల వంతెనమీద కాసేపు కూర్చుని విశ్రాంతి తీసుకుని పోదామా!" అంది.

"అలానే చెల్లీ!"

పదినిమిషాల తరువాత ఇద్దరూ గంగానదిలో దిగి మంచులా వున్న ఆ శీతలజలాలతో కాళ్ళూ చేతులు శుభ్రం చేసుకున్నారు. ఆలయంలోకిపోయి తిరిగివచ్చి మంటపంలో ఒక పక్కగా కూచుని కబుర్లలో మునిగారు.

రంగనాయకమ్మ అంది. "అక్కా! యీ ఆశ్రమంలో యింకా యెంతకాలమసి గడుపుతాం. దక్షిణదేశ యాత్రలు కూడా ముగించుకుంటే నా పని పూర్తి అవుతుంది. నీకు అభ్యంతరం లేకపోతే నీవుకూడా నా వెంట బయలు దేరాలని కోరుతున్నాను. అక్కడనుండి మా యింటికిపోయి జీవితాంతంవరకు నిన్ను నా దగ్గర వుంచుకోవాలని అభిలాషగా వుంది. నీ చెల్లెలి కోరికను మన్నిస్తావని అనుకుంటాను అక్కా!"

సుమిత్రా దేవి రంగనాయకమ్మవైపు విస్తుపోయి చూచింది. "అయ్యో చెల్లీ! యాత్రలంటే సామాన్య మను

కుంటున్నావా! బోలెడు డబ్బయిపోతుంది. మీ అక్క చేతిలో ఈ రోజున ఎర్రని యేగానీ లేదు. నీకు ఆ విషయం తెలిసివుంటే యిలా అడిగివుండేదానివి కాదని అనుకుంటాను చెల్లీ!"

"డబ్బునుగురించి నీవు ఆలోచించ వలసిన అవసరం ఏమాత్రమూ లేదు అక్కా! భగవంతుని దయవల్ల ఆ కొరత ఏమీ లేదు సంవత్సరానికి పాతిక వేలకు పైగా ఆదాయంవచ్చే భూములు, తోటలు వున్నాయి. నాదీ నీదీ అనే భేదం లేకుండా మన శేషజీవితం నిశ్చింతగా గడప గలుగుతాం అక్కా!"

ఆలయంలోపల ప్రవేశించిన భక్తులు కొందరు ప్రార్థనలు చేస్తున్నారు. మరికొందరు భజనలు చేస్తున్నారు. వుండి వుండి గంట గణగణ మోగుతూంది.

నాలుగు నిమిషాలు మౌనంగా గడిచాయి. సుమిత్రా దేవి ఆలోచనలోనుండి తేరుకుంది. ఆమె తల పైకియెత్తి రంగనాయకమ్మవైపు చూస్తూ "అమ్మాయీ, రంగనాయకమ్మా! లోగడ ఒకటి రెండు పర్యాయాలు నీవు నా గత జీవితాన్ని గురించి అడిగావు. కాని అప్పుడు నేను చెప్పలేక పోయాను. నీవు నా పట్ల యింత ఆదరాభిమానాలు కలిగి వున్నప్పుడు నా గతజీవితాన్నిగురించి నీకు చెప్పకపోవడం భావ్యంకాదు. నీకు ఓపికవుంటే చెపుతాను విను" అంది.

రంగనాయకమ్మ మందస్మితం చేసి "చెప్పుఅక్కా!" అంది.

సుమిత్రాదేవి చెప్పుకుపోయింది. "చెల్లీ! మా స్వస్థానం లాహోరునగరం. నా భర్త సత్యపాల్. ఆ నగరం లోని ప్రముఖ న్యాయవాదులలో ఒకరుగా ఆయన పేరు లోకి వచ్చారు. మా మామగారుకూడా లాయరువృత్తిలో మంచిపేరు సంపాదించారు. వారికి యిద్దరే యిద్దరు సంతానం. నాభర్త మొదటివారు. రెండో ఆమె మనతో పాటు ఆశ్రమంలో వుంటున్న సునందాదేవి. ఆమెను వజీరాబాద్‌లో పెద్దభూస్వాముల కుటుంబంలో యిచ్చారు. భారత దేశ విభజనవరకు మా జీవితాలు సాఫీగా ఆనందంగా సాగి పోయాయి.

"నాకూ యిద్దరు సంతానం. యిద్దరూ మగబిడ్డలే. పెద్దబ్బాయి జయపాల్. చిన్నబ్బాయి యశపాల్. భారత పాకిస్థాన్ల విభజననాటికి పెద్దబ్బాయికి యిరవై రెండేండ్లు. లా కాలేజీలో మొదటిసంవత్సరం చదువుతున్నాడు. చిన్నబ్బాయి ఆ సంవత్సరమే ఇంజనీరింగుకాలేజీలో చేరాడు. జయపాల్‌కి ఆ క్రింది వేసవిలో వివాహం చేశాము. వాడికి యిచ్చినపిల్ల యీ సునందాదేవికుమార్తె స్వర్ణలత. మా కోడలుకూడా అప్పటికి బి. ఎ. మొదటిసంవత్సరం చదువుతూంది. సునందాదేవికి స్వర్ణలతగాక మరో ముగ్గురు కొడుకులు వుండేవారు. వాళ్ళు ముగ్గురూ హైస్కూలులో చదువుతూ వుండేవారు.

భారతదేశ విభజన అనంతరం లాహోరు వదలిపెట్టి పోవాలని అనుకుంటూనే వున్నాం. కాని పిల్లలచదువులు, ఆస్థుల అమ్మకం మొదలైన ఆటంకాలవల్ల మేము వలస

రావడం సాగిందికాదు. అయినా మా వారు ప్రయత్నాలు చేస్తూనే వున్నారు.

ఒకనాటిమధ్యాహ్నం ఆయనగారు ఆఫీసునుండి తిరిగి వచ్చారు. నేను వారికి కాఫీ అందివ్వబోయాను. ఆయన చాలా ఆందోళనగా 'మతకలహాలు చెలరేగాయి సుమిత్రా! మనబ్రతుకు లేమవుతాయో!' అన్నారు. నేను నిర్ఘాంత పోయాను. కాఫీకప్పు బల్లమీదపెట్టి నేను ముందువరండా లోకి పోయి నిలబడ్డాను. పిల్లలుయిద్దరూ కాలేజీలలో వున్నారు. ఆయన దర్వానును పిలిచి జాగ్రతగా చూస్తూ వుండమనిచెప్పి కారుతీసుకుని పిల్లలకోసం వెళ్ళారు. చీకటి పడినా కారు తిరిగిరాలేదు. తెల్లవార్లూ ఆందోళనతో జాగరణ చేశాను. గృహదహనాలు, లూటీలు విచ్చలవిడిగా సాగాయి. మా ఇల్లు ముసల్మానులువుండే ప్రాంతంలో వుంది. మా ఇంటిజోలికి యెవ్వరూ రాలేదు.

"తెల్లవారి దర్వాను కబురుచెప్పాడు. తండ్రీ కొడుకులు ముగ్గురినీ నడిరోడ్డుమీద హత్యచేశారట! నాకు 'ఫిట్టు' వచ్చి పడిపోయాను. స్మారకం వచ్చేసరికి నేను యెక్కడో పరాయికొంపలో వున్నట్టు తెలుసుకున్నాను. నన్ను ఓదార్చేవారు, ఆదరించేవారు యెవ్వరూ లేరు.

చీకటిపడిన తరువాత దర్వాను వచ్చాడు 'అమ్మా! మీరు అమృతసర్ వెళ్ళండి. నేను తరువాతవచ్చి కలుసు కుంటాను' అని చెప్పాడు. నేను తలవూపాను. ఒకగంట తరవాత మళ్ళీ వస్తానని చెప్పి అతను వెళ్ళిపోయాడు.

మా దర్వాను పఠాన్‌జాతివాడు పేరు ఖాన్ సాహెబ్. అప్పటికి చాలాకాలంనుండి మా దగ్గరే వుంటున్నాడు. విశ్వాసపాత్రుడనే చెప్పాలి. మా యింటి వ్యవహారమంతా అతనికి బాగా తెలుసు. రాత్రి పదిగంటల సమయంలో అతను తిరిగివచ్చాడు. ఒక చిన్న చేతిసంచిలో నా నగలు, కొద్దిగా డబ్బు తెచ్చాడు. ఆ సంచి నాముందు పెట్టి 'అమ్మా! మీరు బయలుదేరాలి, యింకో గంటలో రైలు బయలుదేరుతుంది.' అన్నాడు నేను లేచి నిలబడ్డాను. ఘోషాముసుగు ఒకటితీసి నాకు అందిస్తూ 'అమ్మా! మీరు యిది కప్పుకోవాలి. లేకపోతే మీకు రక్షణవుండదు' అన్నాడు. నేను ఆ ముసుగు కప్పుకుని బయలుదేరాను.

స్టేషనులో బండివుంది. పోలీసుబందోబస్తు చేశారు. పెట్టెలనిండా జనం క్రిక్కిరిసి వున్నారు. వందలకొలది తలుపులుపట్టుకు వేళ్ళాడుతూన్నారు. కొందరు పెట్టెల పైకప్పులమీదికి ఎక్కి కూర్చున్నారు. గార్డుపెట్టెనుండి ఇంజన్‌వరకూ రెండుసార్లు తిరిగాం. ఎక్కడా సూదిమోపే స్థలం లేదు. నేను నిరాశ చేసుకున్నాను. మా దర్వాను యింజను పక్కనవున్న బ్రేక్ వాన్ తలుపుతన్ని కాస్త సందు చేసి నన్ను దానిలో ఎక్కించి 'బ్రిడ్జి దాటేవరకు ఆ బురఖా తియ్యకండి. మీరు అక్కడకు వెళ్ళినతరువాత జాబు రాస్తే నేనువచ్చి కలుసుకుంటాను' అని చెప్పాడు. రెండుదినాలనుండి అతనూ తిండి తింటున్నట్టులేదు. మనిషి చాలా నిస్త్రాణగా అగుపించాడు. అతను నాకు సెలవుచెప్పి పెట్టెకు ఆనుకుని కుమిలి కుమిలి విలపించాడు.

రాత్రి ఒంటిగంటవేళ రైలు బయలుదేరింది. గార్డు బూర వూదలేదు. ఇంజను కూతకూయలేదు. గుప్పు గుప్పున పొగలు వదలలేదు. పెట్టెలనిండా వేలజనం కిక్కిరిసి వున్నా యెక్కడా కేకలు, కూకలు వినిపించలేదు. ఇనప పట్టాలమీద బండి పాములా పాకింది. బండి యెక్కడా నిలబడకుండా పోతూంది. ఒకటి రెండు ఫర్లాంగులు దాటితే సట్లెజ్‌నది. దానిమీద రైలువంతెన. ఆ వంతెనదాటితే భారత భూభాగం. అన్నివేలమంది ప్రజలు ప్రాణాలు బిగబట్టుకుని బిక్కు బిక్కు మంటూ ఆ రైలువంతెన యెప్పుడు వస్తుందా! సట్లెజ్‌నదిని యెప్పుడు దాటుతామా! భారత భూభాగంమీద యెప్పుడు కాలుమోపుతామా! అని యెదురుచూశారు. ప్రార్థనలు చేశారు. కాని వారి ప్రార్థనలను ఆలకించిన నాథుడు లేడు. వారి ఆశలు నిరాశలయ్యాయి. వంతెన కనుచూపుమేరలో వుండగా బండిని ఆపేశారు. సాయుధులైన దుండగులు అమాయకప్రజలపై బడి అందరినీ చిత్రవధ చేశారు. కేకలు, యేడ్పులు, పెడబొబ్బలు, ఆక్రందనాలు. ఒక్కగంట వ్యవధిలో అంతా సర్వనాశనమైంది.

నేను వున్న పెట్టెలోకికూడా కొందరు తొంగి చూశారు. ఒకగొంతు నన్ను పలుకరించింది 'బేగం! యీ బండిలో యెక్కడికిపోదా మనుకుంటున్నావు?' నేను అంత విచారంలోనూ తడుముకోకుండా సమాధానం చెప్పాను. అమృతసర్‌లో నా కూతురు వుంది నాయినా! ఆమెను

తీసుకురావడానికి పోతున్నాను బాబూ! మరో కంఠం పలి
కింది 'బేగం! నీ కూతుర్ని అక్కడ చంపేసివుంటారు. నీవు
వెళ్ళి ప్రయోజనం లేదు. బండిదిగు. వెనకకు తీసుకుపోతాం'
ఒకడు నా బురఖాలాగి చూశాడు. 'యేంయ్! నీవు
ముసల్మాన్‌వి కాదు. హిందువువి.' అన్నాడు. నేను
తొణకకుండా సమాధానం చెప్పాను. లేదుబాబూ! నేను
ఖాన్‌సాహెబ్ భార్యను. మా ఇల్లు చౌరస్తా గల్లీలో వుంది.
కావాలంటే ఖాన్‌సాహెబ్‌ని అడిగి తెలుసుకోండి.
అన్నాను. అందులో ఒకరు అన్నారు 'ఖాన్‌సాహెబ్
స్టేషనులో అగుపించాడు' మరొక గొంతు వత్తాసు పలికింది.
'అవును. అతను పెట్టెపక్కన నిలబడి యేడ్చాడు.' ఆ తరు
వాత కాసేపటికి దుండగులు అందరూ వెళ్ళిపోయారు.

తెల్లవారింది. యెటుచూసినా శవాలగుట్టలు. రైలు
పెట్టెలవెనక మరికొన్ని వాగన్లు తగిలించి వాటినిండా
శవాలను నింపారు. 'భారతదేశానికి మంచికానుక' అని
వ్రాసిన పెద్ద అట్టను ఇంజనుముందు తగిలించారు. రైలుబండి
సట్లెజ్ వంతెన దాటి ఇవతలిఒడ్డుకు వచ్చింది. ఆ బండి
అంతకూ బ్రతికి బయటపడినదానిని నేను ఒక్కత్తెనే. నా
బురఖా తీసి పారేశాను. బండిదిగగానే ఆఫీసర్లు, విలేఖ
రులూ నా చుట్టూ మూగి యెన్నో ప్రశ్నలు వేశారు.
నాకు తెలిసినంతవరకు వారికి సమాధానాలు చెప్పాను.

"ప్రభుత్వ అతిథిగా రెండుదినాలు అక్కడే గడిపాను.
ప్రతీకారజ్వాలలు అక్కడివారిలో మిన్నుముట్టాయి.
హిందూగూండాలు స్వైరవిహారం చేశారు. అమాయిక

ప్రజలు వారికి అండగా నిలిచారు. ఆ సాయంకాలానికి చేతికిచిక్కిన ముస్లిం లందరినీ చిత్రవధ చేశారు. వారి ఆస్తులు కొల్లగొట్టారు. చిన్నా, పెద్దా, ఆడా, మగా విచక్షణ చూపకుండా వేలాది ముస్లింలను వూచకోత కోశారు. అటునుండివచ్చిన రైలుపెట్టె లన్నీ ముస్లింల శవాలతో నింపారు. "పాకిస్థాన్‌కి ఒక చిన్న బహుమతి" అని వ్రాసిన అట్టను ఇంజనుకు తగిలించి ఆ బండిని పాకిస్థాన్ వైపుకు పోనిచ్చారు.

రంగనాయకమ్మ ఇంక వినలేకపోయింది. సుమిత్రా దేవివంక ఆమె బెదురుతూ చూసింది. "అక్కా! నేటి సమాజంలో మానవత్వం నశించి రాక్షసత్వం ప్రబలింది. యేడీ ఆ భగవంతుడు! గీతలో యేమనిచెప్పాడు!

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే॥

ధర్మం నశించి అధర్మం ప్రబలిపోయింది. ఘోరాలు జరిగిపోతున్నాయి. మానవజాతి నశిస్తూంది. భగవంతుడు అనేవాడు వుంటే యీ ఘోరాలను యెందుకు ఆపు చెయ్యడు? యీ భగవద్గీత అంతా వట్టి బూటకమేనా!" అంది రంగనాయకమ్మ.

సుమిత్రాదేవి అందుకుంది. "కొంచెం ఓపికపట్టు తల్లీ! నన్ను పూర్తిచెయ్యనీ."

"యేమో అక్కా! నా హృదయం బేజారైంది. నా బుర్ర పనిచెయ్యడం లేదు. యీ స్థితిలో నీవు యేమి చెప్పినా నాకు వినే ఓపిక లేదు."

సుమిత్రాదేవి రంగనాయకమ్మను చెయ్యిపుచ్చుకుని కిందికిలాగి కూర్చొబెట్టింది. రంగనాయకమ్మకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె కొంగుతో కళ్ళుతుడుచుకుని పక్కకుతిరిగి చీదివేసింది. రెండునిమిషాలు మౌనంగా గడిచాయి. ఆమె తలవంచుకుని నెమ్మదిగా అంది "సరే, చెప్పు అక్కా!"

సుమిత్రాదేవి మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

"నేను కొద్దిరోజులు అమృతసర్‌లో గడిపాను. ఆ తరువాత అంబాలా కంటోన్మెంటుకు వెళ్ళాను. అక్కడ మా పినతల్లికొడుకు మిలిటరీ ఆఫీసరు. కొద్దినెలలుమాత్రం అక్కడ వున్నాను. ఆ తరువాత యీ ఆశ్రమానికి వచ్చి పడ్డాను. సునందాదేవి నాకంటే ముందుగానే యిక్కడికి చేరింది. ఆమెను చూస్తూ నేను భ్రమాన్పడిపోయాను. నన్ను చూసి ఆమెకూడా అలానే అయింది. సంవత్సరాలు దొర్లిపోయాయి. యీ రోజువరకు 'మీ వాళ్ళంతా యేమయ్యా'రని నేను ఆమెను అడగలేదు. ఆమె నన్నూ అడగలేదు.

మాలో కోరికలుగాని, ఆశలుగాని యేమీ లేవనే చెప్పగలను. చావు రాలేదుగనుక యింత తిని జీవచ్ఛవాలలా తిరుగుతూన్నాం. యీ దేవుళ్ళమీద, పూజలు, పునస్కారాలమీద నమ్మకం నాకు ఆనాడే పోయింది. మా సునందాదేవి విషయంకూడా అంతే. ఆమె ఆలయంలోకి

పోయి ప్రార్థనలు, పూజలు, చేయడం ఇక్కడకువచ్చాక
నేను యెన్నడూ చూడలేదు. అదేమని నేను అడగనూ
లేదు. రంగనాయకమ్మ తల్లీ! ఇదీ మా చరిత్ర. ప్రొద్దు
పోతూంది ఆశ్రమానికి పోదాం" అంటూ సుమిత్రాదేవి
లేచి నిలబడింది. రంగనాయకమ్మ ముందు దారితీసింది.
నిర్మలంగానున్న నీలాకాశంలో పూర్ణచంద్రుడు తెల్లని
వెలుగులు వెదజల్లుతున్నాడు. గంగానదివొడ్డున కాలిబాట
వెంట నడచి యిద్దరూ ఆశ్రమం చేరుకున్నారు.

రంగనాయకమ్మ మనస్సు వికలమైంది. ఆమెకు ఆ
రాత్రి కన్ను మూతపడలేదు. ఆమె యోచనలు పరిపరివిధాల
పోయాయి. "వేల సంవత్సరాలుగా యీ మతకలహాలు,
యుద్ధాలు కొనసాగుతూనేవున్నాయి. అమాయికప్రజలు
హతులవుతూనేవున్నారు. అయినా వాటిని నిర్మూలించిన
వారు యెవ్వరూ అగుపించరు. యీ కలహాలకు మూలమేది?
వీటికి అంతం యెప్పుడు? యేమో! అంతా అగమ్యగోచ
రంగా వుంది" అనుకుంది.

కొద్దిదినాలు గడిచాయి. రంగనాయకమ్మ ఆశ్రమం
వదలి వెళ్ళిపోడానికి నిర్ణయించుకుంది. సుమిత్రాదేవిని
తనతో రావలసిందిగా కోరింది. కాని సునందాదేవిని విడిచి
పెట్టి తాను రాలేనని సుమిత్రాదేవి తెలియజేసింది. ఆమె
ప్రయాణానికి అన్నీ సిద్ధంచేసుకుంది. రాత్రి పదిగంటలకు
ప్రయాణం.

ఆ సాయంకాలం ఆశ్రమానికి కొత్తస్వాములవారు
వచ్చారు. ఆయన స్వామీ సత్యానంద్. ఆయన ప్రపంచ

మంతా చుట్టివచ్చారు. ప్రపంచంలోని ముఖ్యభాషలన్నింటి తోనూ ఆయనకు పరిచయం వుంది. ముఖ్య మతగ్రంథాలన్నీ ఆయన క్షుణ్ణంగా చదివి అవగాహన చేసుకున్నారు. ఆ స్వామీజీని గురించి రకరకాల వదంతులు వ్యాప్తిలో వున్నాయి.

"స్వామీ సత్యానంద్ మహామేధావి, సర్వజ్ఞుడు" అన్నారు కొందరు. "ఆయన నిరీశ్వరవాది, నాస్తికుడు, రాజకీయవేత్త" అన్నారు మరికొందరు. రంగనాయకమ్మ స్వామీ సత్యానంద్‌ను కలుసుకోవాలనే అభిలాషతో ఆ రోజు ప్రయాణం విరమించుకుంది.

# ప్రకరణ 12

స్వామీ సత్యానంద్ వయస్సు అరవై సంవత్సరాలకు పైగా వుంటుంది. తెల్లగా గుబురుగా పెరిగిన గడ్డమూ, మనిషి సన్నగా ఆరు అడుగుల బారు, విశాలమైన నుదురు, స్వచ్ఛమైన చూపులు, చిరునగవు చిందించే సన్నని పెదవులు ప్రశాంతంగా పవిత్రంగా అగుపిస్తాడు.

రంగనాయకమ్మ స్వామీ సత్యానంద్‌ను చూస్తూనే ఆయనగారిపట్ల గురుభావం యేర్పరుచుకుంది. ఆయన అక్కడవున్న కొద్దిదినాలు ఆమె స్వామీజీకి సన్నిహితంగా మెలగుతూ అనేక సమస్యలపై తన సందేహాలను ఆయన ముందు వెలిబుచ్చి సమాధానాలు పొందింది.

రంగనాయకమ్మ స్వామీజీని ఒకసారి ప్రశ్నించింది. "బాబా! ఈ ప్రపంచంలోని సకల చరాచర భూతములకు ఆధారుడైన దేవదేవుడు ఒక్కడే అయివుండగా ఇన్ని మతాలు వ్యాప్తిలోకి రావడానికి కారణము యేమై వుంటుందంటారు?"

స్వామీ సత్యానంద్ రంగనాయకమ్మవైపు చూసి మందస్మితం చేశాడు.

"బిడ్డా! యీనాడు ప్రపంచంలో వ్యాప్తిలోవున్న మతాలు అన్నీ ఒక్కసారిగా అమలులోకి రాలేదు. ఈ మతాలు వేర్వేరు దేశాలలో ఆ యా కాలాలయందు

ప్రారంభమై క్రమేపీ వ్యాప్తిచెందుతూ వచ్చాయి. ఆనాడు సమాజంలో ప్రబలివున్న అన్యాయాలను, అక్రమాలను యెదుర్కొని వాటిని రూపుమాపేందుకు కొందరు మహానుభావులు ముందుకు వచ్చారు. వారు ప్రజలకు నీతి, ధర్మము బోధించారు. కృష్ణుడు, గౌతమబుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, మహాత్మాగాంధీ మొదలుగువారు ఆ కోవకు చెందుతారు.

వారి వారి అనుచరులు వారియొక్క బోధనలను ప్రచారంచేశారు. క్రమేపీ ఆ యనుచరులే మతస్థులయ్యారు. కాని మన దురదృష్టంకొద్దీ వారి ధర్మబోధనలన్నీ అడుగున పడిపోయాయి. కొంతకాలానికి వారే దేవుళ్ళయ్యారు. దేవాలయాలు, చర్చిభవనాలు, మసీదులు, ఆరామాలు వెలిశాయి. స్వార్థపరులైన పీఠాధిపతులు వాటిని ఆక్రమించారు. రాజులు వారికి రక్షణయిచ్చారు. కవులు, పండితులు వారికి వంతపాడారు. ఆ దేవుళ్ళ పేరుచెప్పుకుని యీ స్వార్థపరులు భోగాలు అనుభవిస్తున్నారు. ఈ నాడు యింకా మతాలు పోషించబడుతున్నాయి అంటే అదిఅంతా కేవలం పై తరగతులవారి స్వార్థ ప్రయోజనాల నిమిత్తమే."

రంగనాయకమ్మ వెంటనే మరో ప్రశ్నవేసింది. "స్వామీ! ఆ సర్వాంతర్యామియగు ఆ దేవదేవునిగురించి మీ అభిప్రాయ మేమిటో తెలుసుకోవాలని వుంది."

స్వామీజీ చెప్పుకుపోయాడు.

"అమ్మాయీ! అసలు మొందునాలేని ఒక గుప్త విషయాన్ని గురించి కొందరు సంవత్సరాలతరబడి ఆలో

చించి ఆలోచించి తుదకు తమకు యిష్టమైనరూపాన్ని ఒకదానిని కల్పించుకుని దానినే దేవుడని భ్రమపడడం జరుగుతూంది. రాముడనీ, కృష్ణుడనీ, క్రీస్తుఅనీ, అల్లాఅనీ, కాళీమాతఅనీ, మేరీమాతఅనీ యెవరికి యే దేవుడు, దేవత యిష్టమో ఆ దేవుణ్ణి, దేవతను వారు సృష్టించుకుని ఆరాధిస్తున్నారు.

కాని అమ్మాయీ! ఈ అనంతవిశ్వంలోని సకల చరాచర భూతములకు ఆధారమైనది ప్రకృతి. ఆ ప్రకృతిని గురించి తెలుసుకోవాలంటే శాస్త్రీయ పరిశోధనలద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. అంతేగాని నీవూ, నేనూ తలకిందులుగా తపస్సుచేసినా, ముక్కుమూసుకుని జపం చేసినా, చివరకు తలలు పగలగొట్టుకున్నా దానినిగురించి మనం తెలుసుకునేది శూన్యం అనే నేను అంటాను.

ఇక్కడ మరో విషయంకూడా చెప్పదలచుకున్నాను బిడ్డా! మనం నివసిస్తున్న యీ భూమి పుట్టి కొన్ని వందల కోట్ల సంవత్సరాలు అయివుంటుందని శాస్త్రజ్ఞులు చెపుతూన్నారు. ఇన్ని వందలకోట్ల సంవత్సరాలుగా యీ భూమి రోజుకిఒకసారి తనచుట్టూ తాను తిరుగుతూ, సంవత్సరానికి ఒకమారు సూర్యునిచుట్టి వస్తూంది. ఇంతకాలం గడిచినా దాని గమనంలో ఒక్క సెకనుకూడా తేడా రాలేదు. ఇక యీ భూమిలాంటి గ్రహాలు, అంతకంటే చిన్న, పెద్ద మండలాలు కోటానుకోట్లు వున్నాయి. ప్రతిఒకటీ ధేని పరిధిలో అది తిరుగుతూనే వుంది. ఇదిఅంతా ప్రకృతిచర్య తల్లీ! నీవు దేవుణ్ణి కొలిచినట్టుగా ఈ ప్రకృతిని ఆరాధించ నవ

సరములేదు. నీ దీప, ధూప, నైవేద్యాలతో దానికి నిమిత్తం లేదు. దానిపని అది క్రమముతప్పకుండా చేసుకుంటూ పోతుంది. కాని దాని కాలగతిలో మార్పు వచ్చినప్పుడు మాత్రం తుఫానులు చెలరేగవచ్చు. భూకంపాలు సంభవించవచ్చు. అసలు గ్రహాలే భస్మమై పోవచ్చు. అట్టి ప్రళయాలను నీవుగాని, నేనుగాని, నీ దృష్టిలోవున్న దేవుళ్ళుగాని అరికట్టలేరు."

రంగనాయకమ్మ ఆలోచనలో పడింది. నాలుగునిమిషాలు మౌనంగా గడిచాయి. ఆమె మరో ప్రశ్న అందుకుంది "అయితే బాబా! నేటి మానవకోటి మనుగడకు మార్గ మేమిటంటారు?"

"మానవజాతి మనుగడకు మార్గము లేకపోలేదు బిడ్డా! ఈ అనంత విశ్వంలో మానవుని వునికి చాలా అల్పమైనదే, అయినా మానవుడు తన మేధాశక్తితో ప్రకృతి వైలక్షణ్యాన్ని అవగతంచేసుకుని దానితో పోరాడి జయించుకుంటూ ముందుకు సాగిపోతున్నాడు. మానవుడు ఆవిరియంత్రం, విద్యుచ్ఛక్తి, టెలివిజన్, అణుశక్తి మొదలైన వెన్నో కనిపెట్టాడు. ఇటీవల రోదసిలోకిపోయి ప్రపంచాన్ని చుట్టివచ్చాడు. గ్రహాలకుపోయే మార్గాలకొరకు అన్వేషణ సాగిస్తున్నాడు. మానవుని మేధాశక్తి అపారం. అతను ప్రకృతిని జయించి మనగలుగుతాడు. అంతేకాదు. నేటి సమాజంలో మానవజాతి అభివృద్ధికి ఆటంకాలుగానున్న జాతి, కుల, మత, వర్గ విభేదాలను రూపుమాపుతాడు.

విశ్వమానవ సౌభ్రాతృత్వం పెంపొందిస్తాడు. అందుకు సందేహం యేమాత్రంలేదు."

రంగనాయకమ్మ లేచి స్వామీజీ పాదాలకు నమస్కరించింది. "బాబా! నాకు ఒక చిన్న కోరికవుంది. మీరు అంగీకరిస్తే నేనుకూడా కొంతకాలం మీతోపాటు దేశాటన చెయ్యాలనివుంది" అంది.

"వద్దు తల్లీ! చాలా కష్టాలు పడవలసి వస్తుంది."

"అయితే నన్ను యేమిచేయమంటారు స్వామీ?"

"అమ్మాయీ! నీవు యింకా చిన్నవయస్సులో వున్నావు. తిరిగి వివాహం చేసుకోవడం మంచిదని నా సలహా."

రంగనాయకమ్మ తల కిందికి దించుకుంది. ఆమె ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. కాని యేమీ నిర్ణయించుకోలేక పోయింది. పదినిమిషాలు మౌనంగా గడిచాయి. ఆమె నెమ్మదిగా చెప్పసాగింది.

"బాబా! తిరిగి వివాహం చేసుకోవాలనే అభిప్రాయం నాకు యీనాటివరకూ కలుగలేదు. పెద్దలు, అనుభవజ్ఞులు అయిన మీరు చెవుతూన్నారుగనుక ఇప్పుడు దానినిగురించి ఆలోచించవలసిన పరిస్థితి యేర్పడింది. కాని నాకు కొంత వ్యవధి కావాలి. యెక్కడైనా కొంతకాలం ప్రశాంతంగా గడపాలనే అభిలాష వుంది. మీకు తెలిసినప్రదేశము యెక్కడైనావుంటే చెప్పండి. కొంతకాలం అక్కడ వుండిపోతాను."

స్వామీజీ చిన్నగా నవ్వుతూ "బిడ్డా! ఆగ్రాలో మా యిల్లువుంది. నీవు అక్కడకుపోతే నా భార్య నిన్ను ఆదరిస్తుంది. నీ యిష్టం వచ్చినంతకాలం అక్కడ స్వేచ్ఛగా వుండిపోవచ్చు" అన్నాడు.

రంగనాయకమ్మ ఆశ్చర్యంగా స్వామీజీవైపు చూసింది.

"బాబా! మీరు సంసారులా?" అంది.

"అవును అమ్మాయీ! నాభార్య విమలాదేవి. ఆమె అక్కడ సేవాసదన్ ప్రిన్సిపాల్."

స్వామీజీ రంగనాయకమ్మను తానే స్వయంగా ఆగ్రాకు తీసుకువెళ్ళాడు. శ్రీమతి విమలాదేవి రంగనాయకమ్మను బిడ్డలా చూసింది. రంగనాయకమ్మ అక్కడ సేవాసదన్ విద్యార్థినులతో కలిసి మెలిసి తిరిగింది. కొద్దినెలలు గడిచాయి. రంగనాయకమ్మ వేషభాషలు పూర్తిగా మారిపోయాయి. సంస్కృతం, వురుదూ, ఇంగ్లీషు భాషలు చదువనూ, వ్రాయనూ నేర్చింది.

సేవాసదన్ వార్షికోత్సవాల సందర్భంలో నాట్య, నృత్య, గాన, కళా ప్రదర్శనలు పెద్దయెత్తున జరిపారు. ప్రదర్శనలలో విద్యార్థినులు యెంతో వుత్సాహంగా పాల్గొన్నారు. శాకుంతల నాటకప్రదర్శనలో రంగనాయకమ్మ శకుంతల పాత్ర నిర్వహించింది. ఆమె నటనచూసి ప్రేక్షకులు పదే పదే హర్షధ్వానాలు చేశారు. ఉత్సవాలకు అధ్యక్షత వహించిన గవర్నరు శ్రీమతి విమలాదేవితో రంగనాయకమ్మను

గురించి "యీ అపర శకుంతలను యెక్కడనుండి తీసుకు వచ్చారమ్మా!" అన్నాడు. ఆ సందర్భంలో స్వామీ సత్యా నంద్ మాట్లాడుతూ రంగనాయకమ్మ తమ పెంపుడు బిడ్డ అని చెప్పుకున్నాడు.

స్వామీజీ వాక్కులు విని రంగనాయకమ్మ తనలో తాను పొంగిపోయింది. ఆమె తన జీవితం సార్థకమైనట్లు భావించింది. ఉత్సవాల ముగింపునాడు జరిగిన బహిరంగ సభలో రంగనాయకమ్మ వీణమీద జయదేవుని అష్టపదులు యెంతో శ్రావ్యంగా పాడి సభికులను ముగ్ధులను చేసింది.

నాటకంలో శకుంతలపాత్రకు రంగనాయకమ్మకు ప్రథమ బహుమతి లభించింది. ఉత్సవాల అనంతరం స్వామీజీ బయలుదేరి పోతుంటే రంగనాయకమ్మ ఆయన పాదాలకు నమస్కరించి "స్వామీజీ! యేమిటి సెలవు?" అని అడిగింది. ఆయన మందస్మితంచేస్తూ "బిడ్డా! నీవు త్వరలో వివాహం చేసుకుని మోడువారిన నీ జీవితలతను చిగురింపచేసుకో తల్లీ! అనుకూలుడైన భర్తను యెంచుకుని చక్కని బిడ్డలను కని నీ సంసారాన్ని నందనవనంగా తయారు చేసుకో అమ్మా!" అన్నాడు.

సేవాసదన్‌లో రంగనాయకమ్మకు శకుంతల పేరు స్థిరంగా వుండిపోయింది. ఒకసారి తాజ్‌మహల్ గార్డెన్సులో జరుగుతూన్న విందుకు శ్రీమతి విమలాదేవికి శకుంతల పేరుతో రంగనాయకమ్మకు ఆహ్వానాలు వచ్చాయి. ప్రముఖ విదేశీ అతిథులరాక సందర్భంలో ఆ విందు యేర్పాటు

చేయబడింది. అగ్రనాయకులు, విదేశ రాయబారులు, ప్రముఖ వుద్యోగులు, మాజీ సంస్థానాధీశులు, పెద్ద బ్యాంకర్లు, వ్యాపారస్తులు, ప్రముఖ సినీనటులు, గాయకులు ఆ విందుకు హాజరయ్యారు.

శ్రీమతి విమలాదేవి రంగనాయకమ్మను ప్రత్యేకంగా ముస్తాబుచేసింది. రంగనాయకమ్మజుట్టు చెంపలవరకూ పెరిగి గిరజాలు తిరిగి చెవులు, మెడ కమ్ముకున్నాయి. ఆ గిరజాలలో గులాబీలూ, నొసట సింధూరతిలకమూ, కళ్ళకు కాటుకా, పెదవులమీద తేలికగా లిప్‌స్టిక్, మెడలో రవ్వల నెక్‌లెసూ, కెంపురంగు సిల్కు బ్లౌజ్, జరీరిబ్బను బోర్డరు నైలాన్‌చీరె ధరించి ఆమె దివినుండి భువికి వేంచేసిన అప్సరసలా అగుపించింది. ఎ. ఐ. ఆర్., ఆర్కెష్ట్రా జన-గణ-మన ఆలాపిస్తుండగా ఆమెలేచి పాట అందుకుంది. పాట ముగిసేవరకు యెక్కడా చీమ చిటుక్కు మనలేదు. సభికులు నోళ్ళు తెరుచుకుని తన్మయత్వంతో ఆమెను చూస్తూ నిలబడ్డారు.

పాట ఆగిపోయినంతనే సభికులలో గుసగుసలు ప్రారంభమయ్యాయి. ప్రతివారు 'యెవరు యీమె' అంటూ ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు, 'గుజరాతీ' అన్నారు కొందరు. 'కాదు కాష్మీరీ' అన్నారు మరికొందరు. 'కాదు కాదు పార్శీ' అన్నారు ఇంకొకరు. లోగడవున్న పరిచయంతో గవర్నరు ఆమెను కుశలప్రశ్న చేశాడు, 'ఆఁ, గవర్నరుగారి బంధువు' అన్నారు అనేకులు.

"బాప్ రే! చంపలకంటా వున్న ఆ కళ్ళవంక చూస్తుంటే షాంపేన్ తాగినంత మైకం కమ్ముతూంది." అన్నాడు ఒక యువక ఎయిర్ ఆఫీసరు.

గవర్నరు రంగనాయకమ్మను శ్రీమతి సత్యానంద్ గారి పెంపుడు బిడ్డగా అక్కడివారికి పరిచయం చేశాడు. గవర్నరు కోరినమీదట రంగనాయకమ్మ వీణమీద కొన్ని హిందుస్థానీ పాటలు పాడింది. పాట ఆగిపోగానే సభికుల కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. "వ్వా-వ్వా కోకిలగానం" అన్నారు కొందరు. "భేష్-భేష్ నైటింగేల్ స్వరం" అన్నారు మరికొందరు.

విందు అనంతరం ప్రముఖ సినీతారలు, గాయకులు, డైరెక్టర్లూ, ఆమెచుట్టూ మూగి అభినందనలు తెలియజేశారు. రంగనాయకమ్మ చేతులు జోడించి నమస్కరించి అందరికీ తన కృతజ్ఞత తెలిపింది. యువకులు కొందరు కరస్పర్శ చేయడానికి చేతులు చాచారు. కాని ఆమె తప్పుకుని నమస్కారాలతో సరిపెట్టింది.

కొద్దిరోజులు గడిచాయి. విద్యార్థులు, యువక ఆఫీసర్లు రంగనాయకమ్మను 'వివాహం చేసుకుంటా' మంటూ ప్రేమలేఖలు వ్రాశారు. ప్రారంభంలో ఆమె కొన్ని విప్పి చదివింది. కాని రోజురోజుకూ జాబులసంఖ్య పెరుగుతూ వచ్చింది. ఆమె విసుగుదలతో ఆ జాబులన్నీ బుట్టలో వేసింది. కొందరు శ్రీమతి విమలాదేవిగారివద్దకు రాయబారాలు నడిపారు.

ఒకనాడు శ్రీమతి విమలాదేవి రంగనాయకమ్మతో నవ్వుతూ అంది "అమ్మాయీ! వీళ్ళు మనను వూపిరిసలప నిచ్చేటట్టు లేరు. వీళ్ళబెడద తప్పించుకోవాలంటే నీవు త్వరలో పెండ్లి చేసుకోక తప్పదేమో!"

ఈ హడావుడి చూసి రంగనాయకమ్మ సహజంగా బెదిరిపోయింది. ఆమె ఆగ్రా విడిచిపెట్టి వెళ్ళిపోవాలనుకుంది. కాని యెక్కడికి అనే సమస్య ఆమెకు యెదురైంది. ఆమె ఆ రాత్రి అంతా ఆలోచించి అన్నగారికి జాబు వ్రాసింది.

♦ ♦ ♦

విజయవాడలో కాలేజీలకు వేసవిసెలవులు యిచ్చారు. శాంత సెలవులలో వాల్తేరులోనే వుండిపోతానని తండ్రికి జాబు రాసింది. ఆ తరువాత రెండుదినాలకు రంగనాయకమ్మ జాబు వచ్చింది. రంగారావు జాబు చదివి దీర్ఘాలోచనలో పడ్డాడు.

రంగనాయకమ్మ తనను తక్షణం బయలుదేరి రమ్మని రాసింది. ఆమె లోగడ వ్రాసినజాబులలో తన భావాలు పూర్తిగా మారాయని వ్రాస్తూ వచ్చింది. కాని ఆ మార్పు యేమిటో యెక్కడా వుదహరించలేదు. ఒక జాబులోమాత్రం "అన్నయ్యా! ఈ ప్రపంచాన్నిగురించి, మానవుని పరిణామాన్ని గురించి నేను యిప్పుడిప్పుడే కొద్దిగా అర్థం చేసుకోగలుగుతున్నాను. ప్రస్తుతం నా భావాలు నీయొక్క, రహీం

గారియొక్క భావాలకు చాలా దాపులో వున్నాయి.'' అని వ్రాసింది.

రంగారావు ఆలోచనలు చెల్లెలి పెండ్లిమీదికి పోయాయి. ఒకసారి కామేశ్వరి మాటల సందర్భంలో "వదెన గారు రహీందాదాను వివాహం చేసుకుంటే నే నేమీ ఆశ్చర్యపడను.'' అంది.

"ఆధారా లేమైనా వున్నాయా! లేక వట్టి వూహ లేనా?'' అని తను ప్రశ్నించాడు.

"వాళ్ళ చూపుల్నీ సంభాషణల్నీ బట్టి నేను అలా అర్థం చేసుకున్నాను'' అంది ఆమె.

రంగారావు జాబు జేబులోపెట్టి రహీంను కలుసుకుని మాట్లాడడం మంచిదని అనుకున్నాడు. కారు బయటికితీసి ఉయ్యూరు వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు. సరిగ్గా ఆ సమయా నికి రహీం గేటుతీసుకుని లోపలకు వచ్చాడు.

రంగారావు ఆనందానికి మేర లేదు అతను రహీంను ఆలింగనము చేస్తూ "నేను యిప్పుడు నీ కోసమే బయలుదేరు తున్నాను రహీం!'' అన్నాడు.

"యేదైనా అవసరమైనపని వున్నదాండీ!''

"లోపలకూర్చుని మాట్లాడుకుందాం'' అంటూ రంగా రావు దారితీశాడు. రహీం వెనక నడిచాడు. ఇద్దరూ సోఫాలో కూర్చున్న తరువాత రంగారావు జేబులోనుండి జాబుతీసి రహీంకు అందించాడు. అతను జాబుతీసి చదివాడు.

ఆగ్రా,
22-5-61.

అన్నయ్యా!

నమస్తే! నేను క్షేమం. మీరూ క్షేమమేనని తలుస్తాను. నేను ఇక్కడ విపత్కర పరిస్థితులలో చిక్కుకున్నాను. ఈ చిక్కులనుండి బయటపడడం నాకు సాధ్యంకాదు. మీరు తక్షణం బయలుదేరి రండి. మీ రాకకొరకు నిరీక్షిస్తూ వుంటాను.

మీ చెల్లెమ్మ రంగనాయకమ్మ.

రహీం జాబు పూర్తిచేసి రంగారావు వైపు విస్తుపోయి చూశాడు. "నా కేమీ అర్థం కావడం లేదండీ!" అన్నాడు.

రంగారావు చిన్నగా నవ్వుతూ "దాని అర్థం నేను తరవాత చెపుతానుగాని నీకు ఆమెను వివాహం చేసుకోవాలనే అభిప్రాయం వుందా?" అని ప్రశ్నించాడు.

"నాకు వుంటే యేమైనట్టు? ఆమెగారు యిష్టపడాలి గదా!" రహీం తన సందేహం వెలిబుచ్చాడు.

"అయితే బయలుదేరు. ఆగ్రా పోదాం"

"ఇప్పుడా!"

"యేం! యేమైనా అవసరమైన పనులున్నాయా?"

"పనులేమీ లేవనుకోండి. బట్టలు వగైరాలు సర్దుకోవాలిగదా!"

"బట్టలు కావలిస్తే నావి చాలా వున్నాయి."

"రాత్రి జి. టి. లో గదా మన ప్రయాణం?"

"అబ్బే దేనికీ! మన కారులో హైదరాబాదుపోయి అక్కడ ప్లేన్ కాచ్ చేద్దాం"

రహీం గుండెలు కొట్టుకున్నాయి. నేను యింతకు ముందు ప్లేన్‌లో ప్రయాణం చెయ్యలేదండీ!"

"నేనుమాత్రం చేశానా! అవసరం వచ్చిందిగనుక యిప్పుడు చెయ్యాలిసి వచ్చింది."

బీరువాతీసి రెండు బ్యాగులనిండా బట్టలు సర్దుకున్నారు. కామేశ్వరి తొంగిచూసి "యెక్కడికో ప్రయాణమవుతున్నట్టున్నారు" అంది.

"అవును కామూ! చెల్లెమ్మ దగ్గరకు పోతున్నాం."

"రహీందాదా కూడానా?"

"ఆహా!"

కామేశ్వరి రహీంవైపు చూస్తూ మందస్మితం చేసింది.

రంగారావు నవ్వుతూ అన్నాడు. "రహీం! చూ కామేశ్వరి చిరునవ్వు వెనక దాగివున్న రహస్యమేమిటో తెలుసుకున్నావా?"

రహీం తెల్లబోయి చూశాడు.

రంగారావు మళ్ళీ నవ్వుతూ అన్నాడు "ఆడవాళ్ళు అతి సూక్ష్మగ్రాహులు రహీం! వాళ్ళు యిట్టే పసి కట్టేస్తారు."

రహీం సిగ్గుపడ్డాడు. కాని అంతరాత్మలో "నాకు అంతటి అదృష్టమా!" అనుకున్నాడు.

• • • •

సేవాసదన్ విద్యార్థినులు వుదయం కాఫీల హడావుడిలో వుండగా 'రంగనాయకమ్మకు టెలిగ్రాం వచ్చింది' అన్నారు. ఆమె కాఫీ వదిలేసి టెలిగ్రాం అందుకునేందుకు పరుగుతీసింది. టెలిగ్రాం విప్పి చదువుకుంది.

హైదరాబాదు
మే 26 సాయంకాలం 4 గంటలు.

ప్లేన్‌లో బయలుదేరుతున్నా. రేపు వుదయం
పదిగంటలకు సేవాసదన్‌లో కలుసుకుంటా.

రంగారావు.

రంగనాయకమ్మ టెలిగ్రాం కాగితం చేతితో పైకి యెత్తి చూపుతూ "నేను యీ పూట క్లాసులకు రాను. మా అన్నయ్య ప్లేన్‌లో వస్తున్నారు" అంది.

స్నేహితురాండ్రు కొందరు ఆమెచుట్టూ మూగారు.

"అబ్బో! శకుంతల మహా హుషారుగా వుందే!"

"ఏదో టెలిగ్రాం వచ్చిందిగా!"

"అయితే ఏదో విశేషం వుంది!"

"వాళ్ళ దుష్యంతుడు వస్తున్నాడేమో!"

నలుగురూ చప్పట్లు కొడుతూ కిలకిలా నవ్వారు. రంగనాయకమ్మకూడా శృతికలిపింది. ఒకరు ఆమె చేతిలోని టెలిగ్రాం కాగితం లాక్కోబోయారు. రంగనాయకమ్మ చెయ్యి యింకా పైకి లేచింది. వెనకనుండివచ్చిన శ్రీమతి విమలాదేవి ఆమెచేతిలోని కాగితం లాగేసుకుంది. రంగనాయకమ్మ వెనకకు తిరిగి చూచి నిర్ఘాంతపోయింది.

"మాతాజీ! మిమ్ములను చూడలేదు" అంది. శ్రీమతి విమలాదేవి నవ్వుతూ రంగనాయకమ్మ వీపు తట్టింది. ఆమె టెలిగ్రాం చదివి "అయితే మీ అన్నగారు రాత్రి ఢిల్లీ చేరివుంటారు. యీపాటికి యిక్కడకి వస్తూ వుండవచ్చు" అంది.

రంగనాయకమ్మ రిసెప్షన్‌హాలులో కూర్చుంది. పది గంటలకు యింకా పదిహేను నిమిషాలు వుండనగా కారు వచ్చి సేవాసదన్ గేటుముందు ఆగింది. ఆమె వెలుపలికి వచ్చి చూసింది. రంగారావుతోపాటు రహీంకూడా కారు దిగాడు. అతన్ని చూసి ఆమె సిగ్గుపడుతూ వెనకకు తగ్గబో

యింది. కాని అడుగులు ముందుకే పడ్డాయి. ఆమె చేతులు జోడించి వారికి నమస్కరించింది.

రంగారావు ఆశ్చర్యంగా "ఈ ప్రళయం యింత కాలం యెక్కడ దాగివుంది చెల్లెమ్మా!" అంటూ ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

రహీం కళ్ళద్దాలు తీసి కళ్ళు నలుపుకొని ఆమెకేసి పరీక్షగా చూశాడు. "రంగనాయకమ్మగారు సురంగనాయకమ్మగారు అయ్యారు" అన్నాడు.

ఆమె చిరునవ్వు చిందిస్తూ అంది. "ఇదంతా మీ ప్రభావమే రహీంగారూ!"

రంగారావు యేకాంతంగా చెల్లెలితో పదినిమిషాలు మాట్లాడి ప్రిన్సిపాలు శ్రీమతి విమలాదేవిని చూడడానికి వెళ్ళాడు. రంగనాయకమ్మ రహీంపక్కకుపోయి కూర్చుంది. నాలుగునిమిషాలు మౌనంగా గడిచాయి. ఆమె ప్రారంభించింది. "రహీంగారూ! మీకు జాబు వ్రాయడానికి నాకు ధైర్యం చాలలేదండీ!"

అతను ప్రశాంతంగా అడిగాడు "యేమని వ్రాయాలనుకున్నారు?"

"మీ సుఖదుఃఖాలలో, మీ జీవిత యాత్రలో, మీకు భాగస్వామిగా వుండాలని."

"అయితే నేను అదృష్టవంతుణ్ణి. నా కోరికలు ఫలించాయి. నా స్వప్నాలు యదార్థమయాయి."

ఇద్దరిచూపులూ కలిశాయి. ఆమె అతనికి దగ్గరగా జరిగింది. అతను ఆమెను తన కౌగిలిలోకి తీసుకున్నాడు.

అరగంట అనంతరం రంగారావు శ్రీమతి విమలాదేవిని వెంటపెట్టుకుని రిసెప్షన్ హాలులోకి వచ్చాడు. రంగనాయకమ్మ రహీంను ఆమెకు పరిచయం చేస్తూ "మాతాజీ! వీరు రహీంగారు. నాకు కాబోయేభర్త" అంది.

రహీం ఆమెకు నమస్కరించాడు. ఆమె ప్రతినమస్కారం చేసింది. విమలాదేవి రహీంవైపు పరీక్షగా చూసింది.

"యేమమ్మా, రంగనాయకమ్మా! ఇంత చక్కని భర్తను మెంచుకున్న దానివి మాటవరుసకైనా మాకు చెప్పలేదేమమ్మా!" అంది.

రంగనాయకమ్మ, రహీం యిరువురూ జంటగా ఆమె పాదాలకు నమస్కరించారు. విమలాదేవి నవ్వుతూ అంది "చక్కనిజంట. రతీమన్మథుల్లా వున్నారు."

భోజనాలగంట గణగణ మోగింది. విద్యార్థినులు క్లాసులు వదలి బయటికి వచ్చారు. కొందరు రిసెప్షన్‌హాల్లో రంగనాయకమ్మచుట్టూ చేరారు. రంగనాయకమ్మ అన్న

గారినీ, రహీంనూ వారికి పరిచయం చేసింది. రహీంను గురించి చెపుతూ "వీరు నాకు కాబోయేభర్త" అని చెప్తూ వుంది. రంగనాయకమ్మ స్నేహితురాళ్లు రహీంను వాలుకన్నులతో చూశారు.

అందులో ఒకామె రహీంముందుకు వచ్చి అంది. "యేమండోయ్, దుష్యంతుడుగారూ! మా ఆశ్రమవాసి శకుంతల యింతకాలానికి మీకు గుర్తుకువచ్చిందా! పోనీ యిప్పుడైనా తీసుకుపోయి ప్రేమతో చూస్తారుకదూ!"

ఆమె మాటలకు రహీం తెల్లబోయాడు. రంగనాయకమ్మ కల్పించుకుని చెప్పింది. "రహీంగారూ! ఈ మధ్యం ఇక్కడ శాకుంతల నాటకం వేశాం. అందులో నేను శకుంతలగాను, మీతో మాట్లాడిన ఆశాలత ప్రియంవదగాను నటించాం. వీళ్ళందరూ అప్పటినుండీ నన్ను శకుంతలా అని పిలుస్తారు. మా ఆశాలతకు కొత్తా పాతా యేమీలేదు. సందర్భం వున్నా లేకపోయినా చలోక్తులు విసురుతూ వుంటుంది. ఆమె తరహాయే అంత."

రహీం తృప్తిగా నవ్వుకున్నాడు. అతను ఆశాలత వైపు తిరిగి "ఆశాలతగారూ! మీ వుపమానం నాకు వర్తించదని తెలియజేయడానికి విచారిస్తున్నాను. నేను మీ దుష్యంతుడులాంటి కర్కోటకుడిని కాదు. మజ్నూలాంటి

ప్రేమపిపాసిని. మీ నేస్తం మీకు శకుంతలఅయితే నాకు లైలా. నా లైలాను నేను ఆరాధిస్తాను. ఆమెకోసం నేను ఆహుతి అవుతాను" అన్నాడు.

రంగారావు కన్నులనుండి ఆనందబాష్పాలు రాలాయి. "మా చెల్లెమ్మ ధన్యురాలు" అనుకున్నాడు.






